


మీకు యివ్వబడిన డిజైన్ ట్రేస్ తీసి, చుట్టూ చక్కగా కుట్టబడి, నలుచదరంగా (35 సెం.మీ. x 35 సెం.మీ) వున్న గుడ్డపై కేమెల్ క్రైలిన్ రంగులతో ఆ డిజైన్‌కు రంగులు వేయండి. మీరు వేసే రంగులు వీలయినంత లేతగా వుండాలి. అందుకు కేమెల్ క్రైలిన్ మీడియమ్‌తో రంగులను పలుచన చేసుకోవచ్చు. పోటీ చేసే ప్రతి ఒక్కరూ 3 ఎంట్రీలకన్న ఎక్కువ పంపరాదు.

**బహుమతులు : రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- ఇవే గాకుండా 10 మెరిట్ సర్టిఫికెట్‌లు**

మీరు రంగులు వేసిన ఎంట్రీలను ఈ క్రింది ఎడ్రసుకు పంపండి :

పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్,

**కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్,** ఆర్ట్ మెటీరియల్ డివిజన్, జె.బి. నగర్, బొంబాయి 400 059

పేరు, ఎడ్రసు వ్రాసిన కవర్‌ను పోస్టేజితోసహా ఎంట్రీతోపాటు పంపితే పోటీ చేసే ప్రతి ఒక్కరికీ ఒక ట్రాన్స్ఫర్ పంపబడుతుంది.

మీ ఎంట్రీతో జతపరిచే 'ట్యాగ్'పై మీ పేరు, చిరునామా ఇంగ్లీషులో వ్రాయండి. మీ ఎంట్రీ తిరిగి పంపబడదు.

**ఎంట్రీలు పంపవలసిన ఆఖరు తేది : 28-2-1979**

Vision **CONTEST NO. 10**

---

**Join Camel School of Art Correspondence Course.
Contact the above mentioned address for details.**

# వనిత

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి : 4 సంచిక : 7

జనవరి : 1979

విడి ప్రతి : రెండు రూపాయిలు

సం॥ర చందా: ఇరవై నాలుగు రూపాయిలు

శ్రీలంక : రూ. 2.00 (ఇండియా)

మలేసియా : 90 సెంట్స్

చిరునామా :

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026


### రచనలు చెయ్యడం ఎందుకు ?

**ఉ**త్తమ రచన అనేది పాఠకుల మనసుల్లో హత్తుకుపోవాలి. ఆలోచనలను రేకెత్తించాలి. ఉత్తమ సాహిత్యం వల్ల సమాజం ప్రభావితం కాదనుకోవడం పొరపాటు. సమాజంలోని మూఢ నమ్మకాలను, సాంఘిక దురన్యాయాలను లంచ గొండితనాన్ని రూపుమాపి ప్రజలకు కనువిప్పు కలిగించడంలో ఉత్తమ సాహిత్యం పాత్ర ఎంతైనా ఉన్నది. ఆనాడు వీరేశలింగం పంతులు, గురజాడ వంటి మహానుభావుల రచనల వల్ల ఆనాటి సమాజం ప్రభావితం కాలేదా? "ఈనాటి రచయిత్రులు ప్రస్తుత సామాజిక సమస్యలను అవగాహన చేసుకోవటానికి అవకాశం లేకపోవడంవల్ల వాళ్ళ ఆలోచనా పరిధికి పరిమితమయిన ఊసుపోక సాహిత్యాన్ని రాస్తున్నారు" అన్నారు డి. కామేశ్వరి గారు - నవంబరు 78-'వనిత'లో. వాస్తవ ప్రపంచానికి విరుద్ధంగా స్వాప్నిక జగత్తులో విహరింపజేసే ఈ కథల వల్ల, నవలల వల్ల నష్టపోయే యువతీయువకుల శ్రేయస్సు దృష్టిలో ఉంచుకుంటే అలాంటి సాహిత్యం రాయకపోవటమే మంచిది.



**ఈ పేజీలోని ప్రతి లేఖకూ చిన్న పారితోషికం—ఐదు రూపాయిలు**

కామేశ్వరిగారు అన్నట్లు స్త్రీలు కథలు రాసేది కేవలం తమ పేరు అచ్చులో చూసుకోవటానికో, లేక చిన్న పారితోషికం కోసమో అయితే వాటిని ప్రచురించడం ద్వారా పత్రికాధిపతులు, విరివిగా చదవడం ద్వారా పాఠకులు వారిని ప్రోత్సహించడం మంచిది కాదు.

**క్రొత్తపల్లి రాఘవరాణి** — **అమర్తలూరు**

### మానసిక స్థితి తెలుసుకోవాలి !

**ఈ**మధ్య మా ప్రాంతంలో జరిగిన ఒక సంఘటన - తల్లిదండ్రులకు పిల్లల పట్ల గల నిర్లక్ష్య వైఖరిని ప్రస్ఫుటంగా తెలియజేస్తుంది. ఒక అమ్మాయి - తల్లిదండ్రులు పెట్టే బాధలు, అవమానాలు భరించలేక ఆత్మహత్యా ప్రయత్నంగా వంటికి నిప్పు అంటించుకుంది. ఆ అమ్మాయి కొంచెం తెలివి తక్కువదిట. అంటే మానసికంగా ఎదగలేదన్నమాట. అలాంటి పిల్లలున్న తల్లిదండ్రులు వారికి తగిన రక్షణ, శ్రద్ధ కనబరచక వారికి జీవితం మీద విరక్తి కలిగేలా ప్రవర్తిస్తే ఆ అమాయిక జీవులు ఇలాంటి ప్రయత్నాలే చేసి జీవితాల్ని అంతం చేసుకుంటారు. శారీరక అవసరాలే కాకుండా వారి మానసిక స్థితి కూడా తెలుసుకుని వారితో వ్యవహరించవలసిన బాధ్యత తల్లిదండ్రులకు ఎంతైనా ఉంది. వారు శారీరకంగానే కాకుండా మానసికంగా చక్కగా ఎదుగుతున్నారా? లేదా? అనే విషయం తల్లిదండ్రులు గమనించాలి. కానీ అటువంటి పరిజ్ఞానం చాలామంది తల్లులకు ఉండదనే నా అభిప్రాయం. అందువల్ల ప్రతి తల్లీ కూడా బిడ్డ మానసికావసరాలు కూడా ఎప్పటికప్పుడు గుర్తించడం ఎంతైనా అవసరం.

**ఎ. మైత్రేయి** — **కాకినాడ**

### 'కన్యాదానం' అన్నమాటే పోవాలి!

**వ**రకట్నాలను నిషేధిస్తూ 1975 సం॥ లోనే రాష్ట్ర ప్రభుత్వం చట్టం చేసినా అది నిరర్థకంగానే వుండిపోయింది. చట్టాలవల్ల సాంఘిక దురాచారాలు నిర్మూలనం కావు. అసలు వరకట్నం తీసుకునే దురాచారానికి గల సాంఘిక, ఆర్థిక పునాదులను నిర్మూలించాలి. అంటే కుటుంబంలో, సమాజంలో స్త్రీ, పురుషులు సమాన హక్కు కలిగినవారుగా ఈ చట్టాలను సవరించాలి. జన్మతః స్త్రీకి పురుషునివలె పూర్తి వారసత్వ హక్కు యిస్తూ వారసత్వ చట్టాన్ని సవరించాలి. వివాహ వ్యవస్థలో స్త్రీ పురుషునికంటే తక్కువ అనే భావానికి కారణం "కన్యాదానం." స్త్రీ కూడా పురుషునికి ఒక ఆస్తిగా పరిణమించే స్థితిలో వుంది నేడు. గోదానం, భూదానం, వస్త్ర

"1971 సం॥ జనాభా లెక్కల ప్రకారం, మనలో చదవనూ, రాయనూ తెలిసినవారు—నూటికి ముప్పైమంది మాత్రమే. అక్షరజ్ఞానం వున్న స్త్రీలు ఇరవై శాతం మాత్రమే! ఇందులోనూ పట్టణప్రాంతం వనితలే ఎక్కువ! అప్పటి – మొత్తం మూడువందల అరవై జిల్లాల్లోని—నూటఇరవైఅయిదు జిల్లాల్లో నూటికి ముగ్గురు లేక నలుగురికి మాత్రమే చదువు పరిమితమయింది. మిగతా నూరు జిల్లాల్లోని అక్షరాస్యుల సంఖ్య-తొమ్మిది శాతం మాత్రమే!"

'ఈ తరం భారతనారి' మీద చర్చించబడ్డ ఒక వ్యాసం—

వచ్చే సంచికలో

దానం మొదలైన వాటితోపాటు స్త్రీని పురుషునికి దానం చేసే కన్యాదానం కూడా అదే కోవకు చెందుతుంది. లేకపోతే నోరులేని పశువువలె, నిర్జీవమైన భూమివలె, ఇతర వస్తువులవలె స్త్రీ దానం చేయబడే వస్తువు ఎలా అవుతుంది? స్త్రీనే ఎందుకు దానం చేయాలి? పురుషుని స్త్రీకి దానం చేయాలనే భావం ఎందుకు రాలేదు? కన్యాదానం - ఆ దానం పుచ్చుకున్న వరునికి దక్షిణ అన్న రూపంలో ప్రారంభమైన ఈ వరకట్న భావానికి పునాది సిద్ధాంతాన్ని కూకటివేళ్ళతో పెకలించనిదే వరకట్న దురాచారానికి శాశ్వత స్వస్తి జరగదు!

**కె. లక్ష్మి ఎమ్. ఎ.** **కొత్తపేట**

## సినిమాల్లోని స్త్రీ పాత్రలు!

ఆడది అన్ని రంగాల్లోనూ ముందంజ వేస్తూ, అభ్యుదయ పథంవైపు పయనిస్తున్న ఈ శుభ తరుణంలో ఆడది ఏ రంగంలో ఎంత పెరిగినా, సినిమా రంగంలో మాత్రం ఆవగింజంతయినా పెరగలేదు. వ్యక్తిగతంగా స్వేచ్ఛావాయువులు పీలుస్తూ స్వచ్ఛందమైన స్వతంత్ర జీవనాన్ని వెతుక్కుంటున్న వనితల 'వ్యక్తిత్వం' దెబ్బ తీసేవిగా వుంటున్నాయి నేటి సినిమాలు. సినిమా అనే చవకబారు వినోదంలో 'స్త్రీ'మూర్తి ఒక కీలుబొమ్మగా ఆడుతోంది నేడు. గతంలో కళాజగత్తుగా ఖ్యాతికెక్కిన నాటకరంగంలో స్త్రీమూర్తికి, నేటి చిత్రరంగంలో ఆమె స్థానానికి ఎంతో వ్యత్యాసం కన్పిస్తోంది. నాటకరంగంలో నాడు 'స్త్రీ'కి లభించిన గౌరవం, మర్యాద, మన్నన, విలువలో నూరవభాగం కూడా లభించడం లేదీనాటి సినిమా రంగంలో 'స్త్రీ' మూర్తికి! .... "సినిమాలో స్త్రీమూర్తి కేవలం 'సెక్సు' ఉత్పత్తి కారకం, గుర్తింపు మాటకొస్తే - గ్లామరుకే పరిమితమయిన "షో కేసులోని గాజు బొమ్మ." ధనాపేక్షకులైన నిర్మాతల వ్యాపార ధోరణికి అమ్ముడుపోయిన ఈ అబలల అభ్యుదయం గురించి ఇంకేరీతిని కొనియాడగలం? ఆడదాని చూపులోని శృంగారం కావాలి సినిమా వాళ్ళకి. అందులోని ఆలన - పాలన - లాలన అక్కర్లేదు. ఆడదాని నడకలోని వయ్యారం - విసురు చూస్తారు; కానీ ఆమె నడకలోని అభ్యుదయం చూడలేరు వాళ్ళు. శృంగారం వాళ్ళ ఊపిరి. సృజనాత్మకత ఉన్నా - లేకున్నా ఒక్కటే! ... అబలల కన్నీటి గాథలు, అలనాటి సీతామాలక్ష్మి పవిత్ర కథలు - ఇవే ఈనాటి మన సినిమాలు. ఇందులో ఆడది స్వేచ్ఛా - స్వాతంత్ర్యాలు లేని పరాన్నజీవి. చదువుకున్నా స్వాతంత్ర్య జీవనాన్ని వెతుక్కోలేని 'పేరసైట్!'....ఏమిటీ సినిమాల కర్థం? ఏమిటిందులో వున్న పరమార్థం?.... భర్తను ఎదిరించమని ఎవ్వరూ చెప్పలేం. కానీ 'భర్తే శరణ్యం' అని చూపవద్దంటున్నాం. మగవాడికన్నా అధికృత చూపించమని అడగడంలేదు. మగవాడితో సరిసమానంగా ఆడది కూడా గౌరవింపబడితే చాలంటున్నాం. ఆడదాన్ని అందంగా అల్లుకుపోయే, పూతీగతో మాత్రమేకాక, అభ్యుదయం వైపు ముందడుగు వేస్తున్న సబలతో సరిపోల్చమంటున్నాం.

**ఎమ్. వి. రమణమ్మ** **కాశీబుగ్గ**

## తెలుగు భాషకు సంస్కృతం మాతృక కాదు!

కేవలం సంస్కృత శబ్దమైన 'త్రిలింగ' నుండి 'తెలుగు' అను పదం ఉద్భవించినంత మాత్రాన తెలుగు భాషకు సంస్కృతం 'మాతృక' అనడం అసమంజసం, అపరిశీలనా మూలకం. సంస్కృతము నుండి మన భాషలోకి ఇతర భాషా పదాల కన్నా అధికంగా వ్యావహారిక ఛందోవ్యాకరణాలంకారిక పదాలు తెచ్చుకొనడం - సంస్కృత భాషనుండే మన భాష ఉద్భవించిందనే అపోహకు కారణభూతమైంది. కాని రాస్మస్ రాస్క్, ఫ్రాన్సిస్ డబ్లు. బిషప్ కాల్డ్వెల్ మొదలగు ప్రముఖ భాషా శాస్త్రజ్ఞుల పరిశోధనల ఫలితంగా సుమారు శతాబ్దం క్రిందటే మన తెలుగు భాష, సోదర భాషలైన తమిళ, కన్నడ, మలయాళ, తుళు, కొడగు ఇత్యాది భాషలతోపాటు 'మూల ద్రావిడ భాష' (ప్రోటో ద్రవిడియన్ లాంగ్వేజ్) నుండి ఉద్భవించిందని సహేతుకంగా నిరూపితమైనది. కాబట్టి, మన భాష ద్రవిడ భాషా జన్యమే గాని, సంస్కృత భాషా జన్యం ఎంత మాత్రం కాదు. ఇంచుమించు ప్రతి భాషలోను 'సంస్కృత ప్రధాన పదాలు' అధికంగానో అల్పంగానో ఉండడం వలన 'జనని సంస్కృతంబు సర్వ భాషలకును' అనే ఆర్యోక్తి ప్రచారమైంది. సంస్కృతం తల్లివంటి భాషేగాని, తల్లి భాష కాదని ఆ ఆర్యోక్తికి అర్థం.

**నిమిషకవి స్వరాజ్యలక్ష్మి యం. ఏ.** **హైద్రాబాదు**



ముఖచిత్రం:
అంతర్జాతీయ బాలల సంవత్సర సందర్భంగా
"తల్లి - పిల్ల"
వర్ణచిత్రం: ఛాయా ఆర్య

ఈ సంచికలోని 'నా చరిత్ర' గేయాన్ని (53వ పేజీ) రాసిన శ్రీమతి శారదా అశోకవర్ధన్ గేయ రచయిత్రిగా 'వనిత' పాఠకులకు పరిచితురాలు. శ్రీమతి శారద, తొలి నుంచి హైద్రాబాదులోనే వుంటూ అక్కడే బి. ఎ. వరకూ చదువుకుని, అక్కడే 'ఆకాశవాణి'లో ఐదేళ్ళపాటు కుటుంబ నియంత్రణ కార్యక్రమాలను నిర్వహిస్తూ వచ్చారు. ఇప్పుడు ప్రభుత్వ సమాచార పౌర సంబంధాల శాఖలో సూపరింటెండెంట్‌గా ఉద్యోగం చేస్తున్నారు. శారదా అశోకవర్ధన్ రాగబంధం, తప్పెవరిది? పగిలిన బొమ్మలు, అశ్రుతర్పణ మొదలైన పలు నవలలు; యాభైకి పైగా కథలూ రాశారు. 'శారదా కృతులు' అన్న పేరిట గేయ సంపుటి



వెలువడింది. ఆమె భర్త శ్రీ గాదేపల్లి అశోకవర్ధన్ హైద్రాబాదులోనే ఉన్నతోద్యోగంలో వున్నారు. ఈ దంపతులకు నలుగురు అమ్మాయిలు సంతానం. నలుగురూ చదువుకుంటున్నారు.

డిసెంబరు వనితలో కథలు చాలా బాగున్నాయి. ముఖ్యంగా ''సుందరి స్వగతం'' రచనా విధానం నన్నెంతో ఆకట్టుకుంది. ''కృష్ణవేణి'' నవలను అనవసరంగా పొడిగిస్తూన్నట్టుంది. ''బామ్మగారి పేజీ'' అటు పాత తరానికి ఇటు కొత్త తరానికి మధ్య వారధిలా వుంది.

—కె. లక్ష్మి, కల్పక్కం

వనితలో వస్తున్న కొన్ని శీర్షికలు మధ్య తరగతి స్త్రీలకు ఎంత మాత్రం ఉపయోగపడుతాయో ఆలోచించాలి. ఉదాహరణకు చీరల ప్రదర్శన మొ॥వి రంగులు కలిగి చూడ్డానికే కాని కొనడానికి ఉపయోగపడవు. అందువలన అందరికీ అందుబాటు కలిగి కుటుంబ ఆర్థికాభివృద్ధికి తోడ్పడేవి ప్రచురించినట్లయితే చాలా బాగుంటుంది. వనితలో అభిప్రాయాల శీర్షిక చూస్తుంటే వాటిలో అన్ని అభినందనలు తప్ప విమర్శలు తక్కువ. సరియైన విమర్శనలను తప్పక ప్రచురించాలని నా మనవి.

—ఆర్. ఇందిరా శేఖర్, కోరగుంటపల్లి

క్రొత్త శీర్షిక ''కూరలు-పోషకపదార్థాలు'' మొదలు పెట్టినందుకు నా కృతజ్ఞతలు.

—వి. ఆర్. కుమారి, కందుకూరు

'వైకుంఠపాళి' తరువాత మరొక క్రొత్త సీరియల్ కోసం ఎదురు చూస్తున్నాము. 'పుట్టిన రోజులు' శీర్షిక మా ఇంట అందరినీ ఆకర్షిస్తోంది. ముద్దుగా బొద్దుగా ముచ్చట గొలిపే చిన్నారి పాపాయిలకు నా [illegible].

—పి. సుభాషిణి, కోరుకొండ

మావారి ట్రైనింగు కారణంగా కొంత కాలంగా వనిత చదవడం వీలుపడలేదు. ఈనెల (నవంబరు) సంచిక చూసి ఆశ్చర్యపడ్డాను. పక్ష పత్రిక మాస పత్రికగా మారడం - బామ్మగారు పాఠకులతో మాట్లాడుతూ సమాధానాలివ్వడం మంచి మార్పే. కాని వున్న ఒక్క సీరియల్‌కు జరిగిన కథ లేనందున కథ అయోమయంగా వున్నది. కథలు బాగున్నాయి. రవివర్మగారి తైల వర్ణచిత్రం పత్రికకే హైలైట్.

—టి. కుసుమకుమారి, గుడిపాటిపల్లి

నవంబర్ వనితలో తోపల్లి నిర్మలగారి నిత్యావసర వస్తువుల ధరల గురించిన వ్యాసం, ధరల విషయంలో సామాన్య ప్రజలస్థితి ఎంత దుర్భరంగా ఉందో తెలియ జేస్తుంది.

—శ్రీమతి ఇంద్రాణి, విశాఖపట్నం

డిసెంబర్ సంచికలో మీరు ప్రచురించిన దండు విజయ లక్ష్మిగారి పరిచయం చాలా బావుంది. అయితే ఆమె చేసిన బొమ్మలు కొన్ని చాలావరకూ కొత్తవి. అందు వలన అవి చేసే విధానం కూడా ప్రచురిస్తే బావుండేది.

—వాణి, రాణి, విశాఖపట్నం

డిసెంబరు '78 వనితలోని ప్రచురించిన ''కావ్యోత్తులు చేయడం'' గురించిన వ్యాసం, సుందరి స్వగతం కథ చాలా బాగున్నవి.

—చంద్రికాశంకర్, రాజమండ్రి

డిసెంబరు నెల వనితలోని కథలన్నీ ఎంతో బాగు న్నాయి. ముఖ్యంగా, కాకాని కమలగారి ''సుందరి స్వగతం'' స్త్రీల వాస్తవిక జీవితానికి అతి దగ్గరగా వుంది.

—కె. సరోజ, సికింద్రాబాద్

'బామ్మగారి జవాబులు' కుతూహలాన్ని రేకెత్తిస్తున్నవి. బాలల సం॥ శీర్షిక ఉపయుక్తంగా వుంది.

—మదువర్సు నాగప్రియ, మార్కాపురం




డిసెంబర్ వనిత చదివాము. బంగారం వ్యాసం చాలా బాగుంది. బామ్మగారి పేజీ చాలా బాగుంది. గూడు వదిలిన పక్షి కథ-వనితకే హైలైట్.

—కె. అనూరాధ, పి. శాంత. భువనగిరి

డిసెంబరు వనిత చూడ ముచ్చటగా, ఆకర్షణీయంగా వుంది. వైద్య సలహాలు ఉపయోగకరంగా వున్నవి. ఆశల జీవితం (కథ) ఆసక్తికరంగా, చదివేకొద్దీ ఇంకా చదవాలని అనిపించింది. ప్రభాసక్షేత్రం ఆలయాలు, శిథిలాలు చూసినట్టే అనుభూతి చెందాము.

—కోనాల మీనాక్షి, వెదురుపాకసావరం

డిసెంబరు వనితలో రెండు హైలెట్స్ — స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యలు పై గోష్ఠి, గూడు వదలిన పక్షి (విశాఖ) కథానిక.-వి. జానకీదేవి, అమలాపురం

వార్తల్లోని వనిత శ్రీమతి గాంధిని గురించి చదవగానే అసలు వనితలకు వార్త లెంతవరకూ తెలుసు అనే విషయాన్ని గురించి వ్రాయాలన్పించింది. ఆవేళ నవంబరు 8వ తారీఖు. మాకు తెలిసినవాళ్ళమ్మాయి వచ్చి మాట్లాడుతుంటే మాటల సందర్భంలో శ్రీమతి గాంధి గెలిచిన విషయం చెప్పాను. ''ఇందిరాగాంధి గెలిచిందా? అప్పుడు ఓడిపోయిందన్నారుగా'' ''అంటే యిప్పుడు మొరార్జీ కాదా ప్రధాని, ఇందిరా గాంధీనా?'' అన్నది. పది నిముషాల పాటు అంతా వివరంగా చెప్పాను. అంతా విని ''ఏమో బాబూ ఈ రాజకీయాలంటే పరమబోర్ నాకు. వదిలెయ్'' అన్నది. స్త్రీల రాజకీయ పరిజ్ఞానమింతే అయితే మరి తాను ఓటు హక్కు ఎలా సద్వినియోగ పర్చుకోగలదు? అంతో, యింతో అక్షరజ్ఞానమున్నవాళ్ళే వార్తల్లో ఆసక్తి కన్పరచకుంటే యిక నిరక్షరాస్యుల సంగతి వేరే చెప్పేదేముంది? —వి. ప్రతిమ, మద్రాసు

''వనిత'' కొన్ని విషయాలలో అభినందించదగిన పత్రికే. కాని కొన్ని విషయాలలో మమ్ములను నిరుత్సాహపరుస్తోంది. ఎందుకంటే వనిత పక్ష పత్రికగా వున్నప్పుడు రెండు సీరియల్ కథలుండేవి. కాని మాస పత్రికగా మారాక ఒకే సీరియల్ కథను వేయటం మాకు నిరుత్సాహంగా వుంది.

—మాగాపు సూర్యబాల, పెంటపాడు

## లోపల

# ప్రపంచం

ఇరాన్ సువిశాలమయిన దేశం. ఆసియా ఖండంలో నాల్గవ పెద్ద దేశం. ఒకప్రక్క కోటికి పడగలెత్తినవారు, మరొక ప్రక్క కూటికిలేని ప్రజలూ ఇరాన్‌లో కనిపిస్తారు. గ్రామీణ ప్రాంతాలలో నివసించే ఐదు కుటుంబాలలో మూడు దుర్భర దారిద్ర్యంతో బ్రతుకుతున్నాయి. వ్యవసాయాన్ని విడనాడి పల్లె ప్రాంతాలనుంచి పనుల కోసం పట్టణానికి ప్రజలు వెళ్తున్నారు. కార్మికుల వేతనాలు ఎక్కడ వేసిన గొంగళిలాగానే మిగిలిపోయాయి. నిత్యావసర వస్తువుల ధరలు రెండు వందల శాతం పెరిగాయి. ఇళ్ళ అద్దెలు మూడు రెట్లు పెరిగాయి. సైనికుల మీద పెట్టే ఖర్చు ప్రభుత్వానికి తడిసి మోపెడవుతోంది.

ఆర్థికంగానూ, సాంఘికంగానూ దేశంలో ప్రయోజనకరమయిన మార్పులు రాకపోవడంతో ఇరాన్‌లో రాజకీయ భూకంపాలు సంభవిస్తున్నాయి. ప్రజలు జరుపుతున్న ఆందోళనలని ప్రభుత్వం 'మిలిటరీ హస్తం'తో నిర్దాక్షిణ్యంగా అణచివేస్తోంది. అయితే ఇరాన్‌లో జరుగుతున్న ఆందోళనల వెనక రష్యా అదృశ్య హస్తం వుందని కొంతమంది రాజకీయ పరిశీలకుల అభిప్రాయం.

ఇరాన్‌లో నీటికన్నా నూనె చౌక! ఇరాన్ అమెరికాకి కావలసిన నూనెలో పదవ వంతు సరఫరా చేయగలుగుతోంది. అలాగే ఇరాన్‌కి కావలసిన సైనిక సామగ్రిని అమెరికా అందిస్తోంది. ఈ వాస్తవ పరిస్థితుల వెనక అసలు కథ నడుస్తోందనీ, ఇరాన్ షాకి సంపూర్ణ సహకారాన్ని రహస్యంగా అమెరికా అందచేస్తోందని వ్యాఖ్యలు వినిపిస్తున్నాయి.

వంశాచారం ప్రకారం రాజయిన షా ప్రజల మనిషిగా పెరిగి సంపాదించుకున్న మంచి పేరంతా 1978లో 'నూనె పాలయింది'. షా అధికారాన్ని తిరస్కరిస్తూ వేలాదిమంది పౌరులు సైనికుల చేతుల్లో ప్రాణాలు పోగొట్టుకుంటూ ఇరాన్ చరిత్రని మార్చడానికి ప్రయత్నిస్తున్నారు. దేశంలో అసలు పరిస్థితులు ఎందుకు తనకి వ్యతిరేకంగా మారాయో తెలుసుకోకుండా షా వ్యవహరిస్తూ అమెరికా ప్రక్కకి మొగ్గాడని కొందరి అభిప్రాయం. మొత్తం మీద 1979లోనూ ఇరాన్ ప్రపంచం దృష్టి ఆకర్షిస్తూనే వుంటుంది. ప్రస్తుతం జరుగుతున్న 'దృశ్యం' మీద ఇంకా తెరపడలేదు.

**బంగ్లాదేశ్‌లోనూ....**

అవిభక్త పాకిస్థాన్ పాలనలో తూర్పు పాకిస్థాన్ ప్రజలు బంగారు కలలు కని సాధించుకున్న 'బంగారు బంగ్లాదేశ్' ఈ రోజున ఆ కలలు పండకపోగా ప్రజలకి చీకటి రోజులనే మిగిల్చింది.

ప్రజల ఆందోళనని అణచడానికి బంగ్లాదేశ్ అధ్యక్షుడు జనరల్ జియా-ఉర్-రహమాన్ ఎంత తీవ్రంగా వ్యవహరిస్తున్నా ప్రజల చైతన్య స్రవంతినిమటుకు ఆపలేకపోతున్నాడు. జనరల్ చేతిలోని మార్షల్‌లా అతనినే ఆడుకోలేని పరిస్థితులు రావచ్చని భావిస్తున్నారు.

బంగ్లాదేశ్ విముక్తి పొంది ఏడు సంవత్సరాలు పూర్తి కావస్తున్నది. ఈ ఏడు సంవత్సరాలలోనూ నిత్యావసర వస్తువుల ధరలు అక్కడ ఐదు రెట్లు పెరిగాయి. విద్యార్థులలో తీవ్ర అశాంతి చోటు చేసుకోగా వారు జనరల్ జియా-ఉర్-రహమాన్ మీదే విశ్వవిద్యాలయ ప్రాంగణంలోనే రాళ్ళ వర్షం కురిపించారు. బ్యాంక్ ఉద్యోగులు పదిహేను రోజులపాటు సమ్మెచేసి జనరల్ జియాకి వ్యతిరేక శక్తులు దేశమంతటా వున్నాయని నిరూపించారు.

ఈ పరిస్థితులకన్నిటికి తట్టుకుని స్థిరంగా నిలబడగలననుకుంటున్న జనరల్ జియా "సాధారణ ఎన్నికలు జరుపుతాను. ఇదిగో అదిగో" అని ప్రజలకి శూన్య హస్తాలు చూపుతూ శుష్క వాగ్దానాలు చేస్తున్నాడు. దేశంలో ప్రజాస్వామ్యం పునరుద్ధరించబడడానికి పదిహేను రాజకీయ పక్షాలని కూడగట్టుకుని ఆందోళన జరుపుతున్న అటా-ఉర్-రహమాన్ ప్రభుత్వానికి పక్కలోబల్లెంగా మారాడు. జనరల్ జియా అటు ఎన్నికలు జరుపుతాననే కాక రాజ్యాంగాన్నీ మార్చి, పాలనా విధానంలో మార్పు తీసుకువచ్చి ప్రజలకి మేలు చేస్తానని మరో 'ఎత్తు' వేస్తున్నాడు.

1971లో బంగ్లాదేశ్ విముక్తి పొందడానికి భారతదేశం శక్తికి మించి సహాయం చేసింది. ఈ రోజున బంగ్లాదేశ్‌లో అనేకమంది భారతదేశాన్ని తమకి మొదటి శత్రువుగా భావిస్తున్నారు.

**జపాన్‌లో....**

జపాన్ భూకంపాలకి ప్రసిద్ధి. ఇప్పుడు అక్కడా రాజకీయ భూకంపం వచ్చింది. జపాన్ లోయర్ హౌస్ ఆఫ్ పార్లమెంట్‌లో - దీనిని 'డయెట్' అంటారు. రెండు సంవత్సరాల క్రితం ఒకే ఒక ఓటు మెజారిటీతో నెగ్గి ప్రధానమంత్రి అయిన టేకో ఫుకుడా తను సభ్యుడయిన లిబరల్ డెమొక్రటిక్ పార్టీ అధ్యక్ష పదవికి జరిగిన ఎన్నికలలో ఓడిపోయి ప్రధాని పదవికే దూరమవుతున్నాడు.

లిబరల్ డెమొక్రటిక్ పార్టీ సెక్రటరీ-జనరల్ మసయోషి ఓహిరా చేతుల్లో ఫుకుడా చిత్తుగా ఓడిపోయాడు. గత కొన్ని సంవత్సరాలుగా ప్రధాని పదవి మీదే ఆశపెట్టుకున్న ఓహిరా కలలు ఇక నెరవేరుతాయి. లిబరల్ డెమొక్రటిక్ పార్టీ అధ్యక్ష పదవికి జరిగిన ఎన్నికలు జపాన్‌లో పార్టీ విధానం ఎంత ఉత్తమంగా పని చేస్తున్నదో నిరూపించింది. ఛోటా నాయకుల పెత్తనం, నల్లధనం ప్రాముఖ్యం లేక ఈ పార్టీ ఎన్నికలు జరగడంతో ప్రజలు ఆశించిన మార్పే వచ్చింది. జపాన్ ఉభయ సభలలోనూ అత్యధిక మెజారిటీ వున్న లిబరల్ డెమొక్రటిక్ పార్టీ నాయకుడుగా ఫుకుడా స్థానంలో ఇక ఓహిరా ప్రధాని పదవిని స్వీకరిస్తాడు.

**జాంబియాలో....**

ఆఫ్రికాలోని యాభయి లక్షల జనాభా గల చిన్న దేశం జాంబియాలో ఎన్నికలు జరుగుతాయనే వార్త ఆశ్చర్యం కలిగించవలసిన అవసరం లేకపోయినా, ఎన్నికలు జరిగే పద్ధతిమటుకు బహు విచిత్రంగా వుండి, ఆశ్చర్యం కలిగిస్తుంది.

1964 నుంచి జాంబియా అధ్యక్షుడుగా కౌండా పదవిలో వున్నాడు. జరగనున్న ఎన్నికలలో ఆయన ఒక్కడే అభ్యర్థి. ఓటర్లు బ్యాలెట్ పేపర్లలో వున్న 'అవును' 'కాదు'లలో దేనినో నిర్ణయించుకుని గుర్తుపెట్టాలి. ఓటర్లు 50 శాతం కన్నా ఎక్కువ 'కాదు' అని నిర్ణయిస్తే ఆయన బదులు మరొకరు ఎన్నికలకి నిలుస్తారు. ఆయనకు అనుకూలంగా దేశంలోని అన్ని ప్రచార సాధనలనీ వినియోగించుకుని భారీ ఎత్తున ప్రచారం జరుపుతున్నారు. బ్రిటన్ నుంచి రాజకీయవేత్తలు జాంబియా వచ్చి కౌండా విశిష్టతని ప్రజలకు వివరిస్తున్నారు. అలా ఒకే ఒక 'అభ్యర్థి మధ్య' జరిగే ఎన్నికలలో కౌండా అత్యధిక మెజారిటీతో నెగ్గుతాడని ప్రభుత్వ వర్గాలు భావిస్తున్నాయి. ప్రపంచంలో చాలా చిత్రమయిన ఎన్నికగా మటుకు దీనిని భావించాలి.



ఈ నెలలో పుట్టిన రోజులుగల శిశువుల్లో - ఏడాది పిల్లల గ్రూపులో మజ్జి సుధామయి; రెండేళ్ళ గ్రూపులో శోభ; మూడేళ్ళ గ్రూపులో యస్. చందన 'పుట్టిన రోజు బహుమతుల'కు ఎన్నికైనారు. నిర్ణయింపబడిన పై ముగ్గురితోబాటు, మొత్తం మీద మూడు గ్రూపులలోనూ ఆరోగ్యంగా కనిపిస్తున్న మరో ఇద్దర్ని ఎన్నికచేసి విడిగా ప్రచురిస్తున్నాము. ఫిబ్రవరి సంచికలోని ఈ శీర్షికకు ఫోటోలు పంపేవారు - వివరాలతోసహా (ఫోటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి; ఫోటో వెనక పెన్సిల్‌తో శిశువు పేరు రాయాలి. ఫోటోలు 'క్వార్టర్' సైజుకు తక్కువ సైజులో వుండకూడదు) జనవరి 5 వ తేదీలోగా మాకు చేరేలా పంపగోరుతున్నాము.



మజ్జి సుధామయి (విశాఖపట్నం) పుట్టిన తేదీ: 12-1-78 తల్లిపేరు : ఎమ్. మాలతి

యస్. చందన (అమలాపురం) పుట్టిన తేదీ: 1-1-76 తల్లిపేరు: యస్. సౌదామిని



శోభ (బెంగళూరు) పుట్టిన తేదీ: 7-1-77 తల్లిపేరు: ఆర్. కళా కుమార్



బి. సంధ్యాకిరణ్ (బళ్లారి) పుట్టిన తేదీ: 14-1-78 తల్లిపేరు : బి. ఉషారాణి





సతీష్ (రాజమండ్రి) పుట్టిన తేదీ : 21-1-77 తల్లిపేరు : కె. సుగుణావతి

# సంస్కృత పాఠమాల

ప్రపంచ భాషలలో ప్రాచీనతమమైనవాటిలో సంస్కృతమొకటి అన్న విషయం నిర్వివాదమైన విషయం. అయితే విశ్వ సాహిత్యంలో ప్రాచీనతమమైనది సంస్కృత సాహిత్యమేనన్నది కూడా విశ్వవ్యాప్తంగా అంగీకరింపబడినదే. ప్రపంచంలో ఇతర భాషలింకా వికసించని కాలంలోనే సంస్కృత వాఙ్మయంలో ఉత్తమోత్తమ సాహిత్య గ్రంథాలు మాత్రమే కాకుండా—అర్థిక, రాజనీతి, వృక్షశాస్త్ర, వైద్యశాస్త్ర, రసాయనిక, భౌతిక, ఖగోళికాది అనేక వైజ్ఞానిక శాఖా గ్రంథాలు కూడా ప్రభవించి ఉన్నాయన్నది సత్యం. మత, తాత్త్విక, దార్శనిక, అలంకారిక, శాస్త్రాల విషయంలో యిప్పటికీ, ఎప్పటికీ సంస్కృతభాషకే ప్రథమగణ్యత.

ఉత్తరభారత భాషలన్ని సంస్కృత జన్యాలని విషయజ్ఞులు అంగీకరిస్తున్నారు. దాక్షిణాత్య భాషలైన ఆంధ్ర కన్నడ మలయాళ భాషలు సంస్కృత శబ్ద సముద్రాన్ని స్వకీయంగా చేసుకున్నాయి. అంచేత ఈ మూడు భాషలనూ సంస్కృత రూపమే పరిణమించి, నిలిచిపోయింది. తమిళభాషలో కూడా అధిక సంఖ్యలో సంస్కృత పదాలున్నాయి. పూర్వ ఆంధ్ర కన్నడ మలయాళ కవుల మాట చెప్పకపోయినా, పూర్వ తమిళ మహాకవులైన కంబ, విల్లిపుత్తూరు మొదలైన వారు సంస్కృత సాహిత్య ప్రభావితులే!

మహాత్మాగాంధి, స్వామి వివేకానంద, రవీంద్రనాథ టాగూరు, పండిత జవహర్లాలు నెహ్రూ, రాజేంద్రప్రసాద్, రాధాకృష్ణ, మదనమోహనమాలవ్యా వంటి నిస్స్వార్థ దేశభక్తులు, మానవతావాదులు – సంస్కృత భాష తెలియని భారతీయుని భారతీయత గగనకుసుమం (శూన్యం) లాంటిదన్నారు. సంస్కృతం తెలియని వారికి హిందీలో పరిపూర్ణ పాండిత్యం లభించదు. అలాగే ఏ ఉత్తర భాషలోనైనా సరే. అలాగే తెలుగులోనూ కన్నడంలోనూ మలయాళంలోనూ గూడా. అంచేత చాలా రోజులుగా వనితాలోకం కోరుతున్న సంస్కృత పాఠాల్ని స్వయం శిక్షణ విధానంగా ఈ సంచికనుంచి ప్రారంభిస్తున్నాము.

సంస్కృతం దేవభాష (గీర్వాణి) గా ప్రసిద్ధి కలిగి ఉండడం వల్లా, నాగరికమైన భాషగా గౌరవం కలిగి ఉండడం వల్లా—దీని లిపికి 'దేవనాగరి' అనే పేరు వచ్చింది.

## अक्षरमाला (అక్షరమాలా) అక్షరమాల

### स्वराः अथवा अचः (స్వరాః అథవా అచః) స్వరములు లేక అచ్చులు

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ఏ ఐ ఓ ఔ అం అః

अ आ इ ई उ ऊ ऋ ॠ ऌ ए ऐ ओ औ अं अः

### व्यञ्जनानि अथवा हलः వ్యంజనాని అథవా హలః (వ్యంజనములు లేక హల్లులు)

క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ

क ख ग घ ङ च छ ज झ ञ ट ठ ड ढ ण

త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష

त थ द ध न प फ ब भ म य र ल व श ष

స హ ళ క్ష త్ర జ్ఞ

स ह ळ क्ष त्र ज्ञ

విత్తనాలు చల్లవలసిన తరుణంలో ఉదాసీనంగా నిద్దరోయి ఊడ్పు కాలంలో గంపా కొడవళ్ళతో వెళితే పొలంలో పంట వుండదు-గడ్డి తప్ప!

రేపటి ప్రపంచం కాంతితో, సుఖ సంతోషాలతో కళకళలాడాలంటే—దానికి నేటి శిశువుల వదనాలలో నవ్వులు నాట్యం చేయాలి. సామాజిక, ఆర్థిక పథకాలు విజయవంతాలు కావాలంటే—దానికి పునాదులు వేసేవి నేటి బాలలకు వుండే వసతులు, అవకాశాలు మాత్రమే!

పిల్లలకు మాత్రమే కాదు. అందరికీ కూడా కావలసిన ప్రాథమిక వసతులను కల్పించడానికి అన్ని దేశాలలోనూ, అన్ని ప్రభుత్వాలూ, అహర్నిశలూ కృషి చేస్తూనే వున్నాయి. ఈ కృషి మరింత ఫలవంతం కావడానికి, వారి కార్యక్రమాలు సత్వరంగా కార్య రూపం దాల్చడానికి, ముఖ్యంగా పసిపాపల అభ్యుదయానికి ఐక్యరాజ్య సమితి విభాగమైన 'యూనిసెఫ్' సంస్థ సాయశక్తులా కృషిచేస్తూంది!

బంగారు పాపల్ని కనాలనీ, పాలిచ్చి లాలించాలనీ, ప్రతి తల్లి మనసూ ఆశ పడుతుంది. కలలు కంటుంది. తను కన్న బిడ్డలందరూ అమ్మకు కనుపాప ల్లాంటివారే. కాని తమ వంశానంలో ఎవరైనా బలహీనంగానో, లేదా అంగ వైకల్యంతోనో వున్నట్లయితే ఆ పాప పట్ల ప్రత్యేకమైన శ్రద్ధ చూపడం మాతృ సహజమైన లక్షణం. అదే విధంగా అభివృద్ధి చెందుతున్న దేశాలలోని పిల్లల పట్ల ప్రత్యేక శ్రద్ధను చూపించాలన్నది

# అంతర్జాతీయ బాలల సంవత్సరం



'యూనిసెఫ్' పరమాశయం!

ప్రస్తుతం భారతదేశానికి యేటా పదహారు కోట్ల రూపాయలు మాన్యంగా ఇస్తున్నది. ఈ మొత్తాన్ని కొద్ది కొద్దిగా పెంచి నలభై రెండు కోట్లవరకు పెంచగలరన్న విషయం సంతోషించవలసిన విషయమే!

ఐదారేళ్ళ ప్రాయంలోని పాపల కోసం యూనిసెఫ్ ఎన్నో పథకాలు అమలు చేస్తూన్నది. ఈ ప్రాయంలోనివారు మన దేశంలో మాత్రం సుమారు పన్నెండుకోట్లు వున్నారు. మరో పదేళ్ళకల్లా కనీసం పధ్నాలుగు కోట్లు అదనం కాగలరని నిపుణుల అంచనా! పధ్నాలుగేళ్ళకు లోబడిన పిల్లలు మన దేశంలో మాత్రమే ఇరవై మూడు కోట్లు వుంటున్నారు. వీరిలో పన్నెండు కోట్ల మందికి ప్రాథమిక అవసరాలే ఎండమావులుగా వుంటున్నాయి. ప్రపంచంలోని అభివృద్ధి చెందుతూన్న దేశాలలో మాత్రం ఏడాదికి పదిహేను కోట్ల శిశువులు ప్రాణాలు పోగొట్టుకుంటున్నారు. చాలినంత పోషకాహారం, కావలసిన వైద్య సదుపాయాలూ లేకపోవడమే దీనికి కారణం. వెనుకబడిన ప్రాంతాలలో, తరచూ అతివృష్టి, అనావృష్టికి లోనవుతూ కరువు కాటకాలతో పోరాడే ప్రదేశాలలో, పట్టణాల గుడిసె ప్రాంతాలలో వుంటూన్న పేద పిల్లల శారీరక అభివృద్ధికి, మానసిక వికాసానికి కృషిచేసి దాని ద్వారా సాంఘిక పరివర్తనం తీసుకురావడమే-యూనిసెఫ్ సంస్థ పరమార్థం!



శ్రీ చిత్ర ఆర్ట్ గాలరీ ఆఫ్ మ్యూజియమ్
కాంప్లెక్స్, త్రివేండ్రమ్
సౌజన్యంతో

కలర్ ట్రాన్స్‌పరెన్సీ :
సత్యకుమార్

"మాతృత్వం"

తైల వర్ణచిత్రం

భావికాల భాగ్యవిధాతలైన బాల బాలికలలో చాలా మందికి తమ శక్తి సామర్థ్యాలను పెంపొందించుకోడానికి కావలసిన వసతులు కనిపించకుండా పోతున్నాయి. మనం ఎలా వున్నా-కనీసం రేపటి ప్రపంచమైనా సుఖ సంతోషాలకు నోచుకోగలదన్న విశ్వాసానికి చోటు లేకుండా వుంది! అందువల్ల పిల్లల అభివృద్ధికి, అభ్యున్నతికి అనుకూలమైన వాతావరణావిష్కరణకు గత రెండు దశాబ్దాలుగా ఎన్నో పథకాలను అమలు చేస్తున్నది యూనిసెఫ్.

మనిషికి ఏది వున్నా లేకపోయినా మొట్ట మొదట కావలసింది. ఆరోగ్యం. అంచేత తల్లీ పిల్లల ఆరోగ్య పరిరక్షణకు. ఎక్కువ జాగ్రత్త తీసుకోబడుతున్నది. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు అక్కడక్కడ నెలకొల్పబడుతున్నాయి.

ఆరోగ్యానికి మొదటి మెట్టు పరిశుభ్రత. ప్రబలే రోగాలను అదుపులోకి తీసుకురావాలంటే పరిశుభ్రం చాలా ముఖ్యం. త్రాగడానికి, వంట చేయడానికి, స్నానానికి మంచినీటి సరఫరా ఈ కార్యక్రమాలలోని రెండవ అంశం!

మనిషి ప్రాణం నిలుపుకోడానికి కావలసింది తిండి. బలవర్ధకమైన ఆహారం తీసుకుంటేనే ఎవరైనా ఆరోగ్యంగా వుండడానికి అవకాశం వుంటుంది. అందుకే పిల్లలకు పౌష్ఠికాహారం అందివ్వడం కార్యక్రమంలోని ప్రముఖ అంశం!

నిరక్షరాస్యతా దాస్యం నుంచి. అజ్ఞాన తిమిరం నుంచి పిల్లలను రక్షించడానికి ప్రాథమిక విద్యా సౌకర్యాలు ఉచితంగా యేర్పరచడం మరోపథకం.

ఆరోగ్య కార్యక్రమాలలో పాల్గొనే పాఠశాల ఉపాధ్యాయులు, పౌష్ఠికాహార నిపుణులు సంఘ సేవకులు మొదలైన నిర్మాణాత్మకమైన రంగాలలో పనిచేసేవారికి ప్రత్యేకమైన శిక్షణా శిబిరాలు నెలకొల్పడం ఇంకొక అంశం.

కుటుంబ, సామాజిక జీవన సంక్షేమానికి, జాతి పురోగతికీ పాటుపడే సంస్థలను, యువజన సంఘాలను, స్వచ్ఛంద సేవా సంస్థలనూ యేర్పరచడం—ప్రోత్సహించడం—ఈ సంస్థ కార్యక్రమాల మరొక లక్ష్యం.

నేటి బాలలు రేపటి ప్రపంచాన్ని శాసించి నడిపే మేటి కార్యకర్తలుగా రూపొందడానికి ఈ ప్రాథమిక వసతులు దోహదం చేస్తాయి. యూనిసెఫ్ సంస్థ ఆవిర్భావ కారణమే అది! శిశు సంక్షేమమే దాని స్థాపనలోని పరమార్థం!

ఐతే, ప్రతి సంవత్సరం కూడా ఈ సంస్థకు బాలల సంవత్సరమే గదా—మరి అలాంటప్పుడు 1979 వ సంవత్సరాన్ని ప్రత్యేకంగా అంతర్జాతీయ బాలల సంవత్సరంగా ప్రకటించడంలోని ఉద్దేశం ఏమిటి?—అన్న సందేహం వస్తుంది.

పిల్లల అవసరాలు ఆకాశంలోని చుక్కలన్ని వున్నాయి. ఎన్ని పథకాలు రూపొందించినా మరెన్ని కార్యక్రమాలు అమలుచేసినా అవి తీరడంలో మాత్రం జాప్యం జరుగుతూనే వుంది. దీనికి కారణం - రూపొందించబడే పథకాలు సక్రమంగా నెరవేరడం లేదు - అని చెప్పాలి. అన్వేషించే మార్గాలు, తీసుకునే చర్యలు సక్రమమైన విధంగా సాగడంలేదు. ఈ నగ్న సత్యానికి ప్రత్యక్ష తార్కాణం ఎక్కడో పోయి వెతకవలసిందిలేదు. సరిగ్గా రెండు దశాబ్దాల క్రితం ఐక్యరాజ్య సమితి ప్రకటించిన బాలల హక్కులు చెవిటివాని చెవిలో చేసిన శంఖారావం లాగా మిగిలిపోవడమే దీనికి నిదర్శనం!

ఈ బాలల హక్కులను ప్రతి దేశం అమలు చేసి వున్నట్టయితే నిజంగానే ప్రపంచం ఈ వేళకు ఎంతో బాగుపడి వుండేది! కాని మనం పొద్దస్తమానం మనకు చెందవలసిన దానికోసం హక్కులు, హక్కులూ అంటూ గొంతు చించుకోడం తప్ప ఎదుటివారి హక్కులనూ, అవి నెరవేరడంకోసం మనం నిర్వహించవలసిన బాధ్యతలనూ కనీసం తలచికూడా చూడ్డంలేదు! హక్కులు, బాధ్యతలు పరస్పరాశ్రితాలు. ఆరోగ్యకరమైన జీవన విధానానికి, సాంఘిక వ్యవస్థకు అవి సంకేతాలు!

పిల్లలు ఆరోగ్యంగా పెరిగి పెద్దవారై తమను ఇంతవారిని చేసిన దేశ పురోగతికి పాటుపడాలంటే—స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతోపాటు వారికి కొన్ని హక్కులు కూడా కావాలి. తల్లిదండ్రులు, వివిధ వ్యక్తులు, స్వచ్ఛంద సేవా సంస్థలు, ప్రభుత్వాలు అంటూ వారూ వీరూ అనకుండా ప్రతి ఒక్కరు కూడా బాలల హక్కులను గుర్తించాలి. అది తమ గురుతర బాధ్యతగా భావించాలి. నిర్బంధ కర్తవ్యంగా దాన్ని స్వీకరించాలి.

ఐక్యరాజ్య సమితి ప్రకటించిన బాలల హక్కులు ఇవి:

అంతర్జాతీయ బాలల సంవత్సరం
—ప్రత్యేక చిహ్నం

ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ డిసెంబర్ 1976 లో – 1979 వ సంవత్సరాన్ని అంతర్జాతీయ బాలల సంవత్సరంగా ప్రకటించింది. వివిధ దేశాలలో బాలల అభివృద్ధి పథకాలు రూపొందించడంలో సహకరించడానికి వారు యూనిసెఫ్ (Unicef) ను ముఖ్య ప్రతినిధిగా నియమించారు.



యూనిసెఫ్ వారి ఆహ్వానంపై బాలల సంవత్సరం సందర్భంగా ప్రత్యేక చిహ్నం రూపొందించడానికి 20 దేశాల నుండి 170 మంది పాల్గొన్నారు. వీరిలో డెన్మార్కుకు చెందిన ఎరిక్ జెరిషాల్ రూపొందించిన చిహ్నం ఉచితమైనదిగా ఎన్నుకోబడింది.

అయితే ఈ బాలల సంవత్సరం అమలు జరుపుతున్న దేశాలన్నీ కూడా ఆ చిహ్నన్నే వుపయోగించాలన్న నియమం ఏమీలేదు.



ఆ విధంగానే భారతదేశం కూడా అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా ఒక ప్రత్యేక చిహ్నన్ని ఎన్నుకుంది.

ఈ చిహ్నంలో ఒక బాలుడు, బాలిక వున్నారు. వారితోపాటు సూర్యుడు, పలక కూడా వున్నాయి. సూర్యుడు ఆరోగ్యాన్ని, బలాన్నీ సూచిస్తున్నాడు. పలక విద్య యొక్క ప్రాముఖ్యతను చూపుతున్నది.

ఈ చిహ్నన్ని అహమ్మదాబాద్‌కి చెందిన శ్రీ శైలేష్ మోడి రూపొందించారు. దేశం మొత్తం మీద జరిగిన పోటీలో ఆయన రూపొందించిన ఈ చిహ్నం ఉచితమైనదిగా భావింపబడింది.

'హేపీ చైల్డ్-నేషన్స్ ప్రైడ్' (Happy child-Nation's Pride) అనే నినాదం ఉత్తమమైన నినాదంగా ఎన్నికైంది. దీనిని సృష్టించిన వ్యక్తి–రాంచికి చెందిన శ్రీ నరేంద్ర కుమార్ సిన్హా.

అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా మన ప్రభుత్వం దేశమంతటా బాలల అభివృద్ధి కార్యక్రమాలు అమలు జరపడానికి ప్రణాళికలు రూపొందించింది. అందుకై ప్రధాని శ్రీ మొరార్జీ దేశాయ్ అధ్యక్షతన 'జాతీయ బాలల సంస్థ' నెలకొల్పబడింది.

పిల్లలకు నిర్దేశించబడిన హక్కులు జాతి, మత, దేశ, భాష లింగ బేధాలు లేకుండా ప్రపంచంలోని బాలలందరికీ వర్తిస్తుంది.

బాలలకు ప్రత్యేకమైన పరిరక్షణ, సామాజిక భద్రత కల్పించబడుతుంది.

గోడ వున్నప్పుడే చిత్రం గీయడానికి సాధ్యం అవుతుంది. అందుకే ప్రతి పాపాయికి కావలసినంత పౌష్ఠికాహారం, గృహ వసతి, వైద్య సదుపాయాలు సమకూర్చబడతాయి.

శారీరకంగా, మానసికంగా, సామాజికంగా బలహీనులైన బాలలకు విద్యావైద్య సదుపాయాలలో ప్రత్యేకమైన శ్రద్ధ చూపించబడుతుంది.

బాలల పరిపూర్ణ వ్యక్తిత్వ వికాసానికి ప్రేమాను రాగాలు తొలకరిజల్లులా దోహదం చేస్తాయి. అంచేత ప్రేమపూర్వకమైన వాతావరణ సృష్టికి ప్రయత్నాలు జరుగుతాయి.

శక్తి సామర్థ్యాలను పెంచుకుని, మంచి సంస్కృతిని అలవరచుకుని, మనిషి మంచి పౌరుడుగా రూపొందడానికి చదువు సంధ్యలు దారి చూపుతాయి. అంచేత ప్రతి శిశువుకు ఉచిత ప్రాథమిక విద్యా సౌకర్యాలు యేర్పరచబడతాయి.

అత్యవసర పరిస్థితులలో శిశువుల పరిరక్షణకు ప్రత్యేకమైన ప్రాధాన్యత ఇవ్వబడుతుంది.

ఉదాసీనత, నిర్లక్ష్యం, దోపిడి, దౌర్జన్యం, క్రౌర్యం ఏ రూపంలో వున్నా ఏ వేషంలో వున్నా....వాటి బారినుంచి బాలలు రక్షింపబడతారు.

జాతి మతాల పేరుతో పక్షపాతం పాటించకుండా పిల్లలకు శ్రేయోదాయకమైన—శాంతి, స్నేహం, సోదర భావాలు గుబాళించే వాతావరణం కల్పించబడుతుంది.



ఈ హక్కులను అన్ని దేశాలలోనూ తీవ్రంగా అమలుచేసే పరిస్థితిని యేర్పరచడానికి ఈ అంతర్జాతీయ బాలల సంవత్సరంలో ప్రత్యేకంగా కొన్ని పథకాలు రూపొందించబడ్డాయి.

పిల్లల సంక్షేమ, ప్రగతి కార్యక్రమాలను ఉధృతపరచడానికి, పునః పరిశీలన చేయమని ప్రతి దేశానికి జ్ఞాపకం చెయ్యడం; ఆయా దేశ పరిస్థితులకు అనుగుణంగా జాతీయ, స్థానిక పథకాలను రూపొందించడం జరుగుతాయి.

బాలల ప్రగతి పథకాలకు, సామాన్య ఆర్థిక సామాజిక ప్రగతి పథకాలకు మధ్యవున్న సంబంధాలను పెంపొందించి మరింత పటిష్ఠంచెయ్యడం–

జాతీయ స్థాయిలోనూ, స్థానిక స్థాయిలోనూ, ఆచరణయోగ్యమైన దీర్ఘకాల, స్వల్పకాల పథకాలను రూపొందించి అవి వెను వెంటనే కార్యరూపం దాల్చే విధంగా చూడడం–

సామాజిక దురన్యాయాల పిడికిలిలో విలవిలలాడే బాలబాలికలు, బాల నేరస్థుల ఉద్ధరణకు ప్రత్యేకమైన శ్రద్ధ కనబరచడం—

బాలల సంవత్సర లక్ష్యాలు.

ఈ ఆశయాలసిద్ధికై యూనిసెఫ్–అంతర్జాతీయ బాలల సంవత్సర ప్రతినిధిగా, డాక్టర్ ఎస్టిపానియా అల్డా పాలిమ్ అన్న వనితను నిర్ణయించింది. ఆమె ఇటీవల మన ప్రధానిని కలుసుకుని తమ పథకాలను వివరించారు. దీనికి సంబంధించిన, భారత జాతీయ సంస్థకు గౌరవాధ్యక్షులుగా వుండడానికి ప్రధాని సమ్మతించారు. పర్యవసానంగా భారత జాతీయ శిశు సంక్షేమ సంస్థ ప్రత్యేక నిధి సేకరణకు పెద్దలు పూనుకోడం సంతోషించ తగ్గ విషయం. ఇదే విధంగా ప్రతి రాష్ట్రంలోనూ పెద్ద ఎత్తున ప్రయత్నాలు సాగుతున్నాయి.

ఇక ఈ విషయంలో సామాన్య ప్రజానీకం నిర్వహించవలసిన పాత్ర మహత్తరమైనది. శాశ్వతమైన ప్రాతిపదికమీద పిల్లలకు మేలుచేసే వసతులను యేర్పరచడమే లక్ష్యం కాబట్టి వీటన్నిటికీ కావలసిన ఆర్థిక వనరులు సమకూర్చడం చాలా ముఖ్యం. అంచేత ఆర్థిక వనరులను మరింత ఎక్కువ చేయడానికి తమకు తామే ముందుకు వచ్చి విరివిగా విరాళాలు పోగుజేసి అందించాలి. బాలల ప్రగతి పథకాలు జయప్రదాలు కావడానికి ప్రతి ఒక్కరూ కృషిచేయాలి. ఆ కృషి కేవలం వట్టి కబుర్లతో సరిపోకుండా గట్టి చేతలలో కనిపించాలి. □

మీ ఇంట్లో "తిరుమగళ్" ఉంటున్నదా!
భారత దేశమంతటా ఒకే మాట!!
కారణం వేరేమీకాదు. "తిరుమగళ్" కుట్టు యంత్రం కొన్న ప్రతి
ఒక్కరూ సంతోషంగా ఉండడమే మా మిషన్ల విశేష అంశం!

ఇంకా మా వద్ద "శివా" కుట్టు
మిషను మోటారులు,
కత్తెరలు,
కుట్టు మిషను
భాగాలు మొదలైనవి
లభిస్తాయి.

బయట ప్రాంతాలకు
రవాణా
ఖర్చులు అదనం!





రూ. 405
మాత్రమే



శివా కుట్టు మిషన్
మోటారులు
రూ. 400/-







గురు ఓవర్‌లాక్ మిషన్లు
రూ. 1,100/-

ఎరువు బస్తాలు కుట్టే
మిషనులు
రూ. 1,650/- పన్నులతోసహా

వివరాలకు:

# జయగజలక్ష్మి మెషినరీస్

102, బ్రాడ్వే [పై మేడమీద] మద్రాసు-600001.

ఫోన్: 22698 & 27876 GRAMS: "EMBROIDER" సంప్రతింపులన్నియు ఆంగ్లంలోనే జరుపవలెను

# గ్రామాలలో  పిల్లల పెంపకం

ఆ వూరి పేరు నందికండి.

హైద్రాబాదు సమీపంలోని పతంచేరుకి పది మైళ్ళ దూరంలో వుంది. ఆ వూళ్ళో ఒక పాడు పడిన శివాలయం వుంది. ఆ శివాలయం పక్కనే ఒక ధర్మసత్రం. ఆ సత్రం జనసందడితో కళకళ లాడుతోంది.

ఆంధ్రప్రదేశ్ శిశు సంక్షేమ బోర్డువారి కుటుంబ, శిశు సంక్షేమ శాఖకు చెందిన కార్యకర్తలు, గ్రామ సేవికలు, మహిళామండలి సభ్యులు - అంతా హడావిడిగా వున్నారు.

అక్కడ గ్రామీణ యువతులకు - పోషకాహారం, గృహ నిర్వహణ, శిశు సంరక్షణ, కుటుంబ నియంత్రణ మొదలైన విషయాల్లో శిక్షణ యిస్తున్నారు.

"ఈ శిక్షణ మాకు ఎంతో వుపయుక్తంగా వుంది. ఇటువంటి శిక్షణా శిబిరాలు దేశమంతటా నెలకొల్పితే, మన దేశం కూడా ఎంతో అభివృద్ధి సాధిస్తుంది." అంటూ తన ఆశాభావాన్ని వ్యక్తం చేసింది ఆ శిక్షణా శిబిరంలో పాల్గొన్న ఒక యువతి.

ఈ పథకంలో పతంచేరు ముఖ్య కేంద్రంగానూ, చుట్టూవున్న ఐదు గ్రామాలు వుపశాఖలుగానూ విభజించబడ్డాయి. మళ్ళా ఇందులో రెండు విభాగాలు వున్నాయి. ఒకటి వుదయం పూట కేవలం పిల్లల కోసం మాత్రమే పనిచేస్తుంది. మధ్యాహ్న సమయాలలో తలిదండ్రులకు ముఖ్యంగా తల్లులకోసం రెండవ విభాగం నడపబడుతుంది.

ఆ విధంగానే ఆ మధ్య హైద్రాబాదు సమీపంలోని చేవెల్ల గ్రామంలో హాలండు దేశపు సహకారంతో ఒక ప్రాజెక్టు ప్రారంభించారు. ఇందులో 16 ఏళ్ళ వచ్చేదాకా పిల్లలకి సంబంధించిన పెరుగుదల మొదలైన విషయాలన్నీ కూడా చూసుకుంటారన్నమాట.

అయితే నందికండి, చేవెల్లవంటి గ్రామాలు మన దేశంలో ఆరు లక్షలదాకా వున్నాయి. వీటిల్లో కేవలం ఇరవై వేల గ్రామాలకి మాత్రమే ప్రస్తుతం ఈ సంక్షేమ పథకాలు అందుబాటులో వున్నాయి.

అసలు మన దేశంలో ఆరేళ్ళలోపు పిల్లలు దాదాపు పన్నెండు కోట్లమంది దాకా వున్నారు. వారిలో ఎనభై శాతం పైగా గ్రామాలలో నివసిస్తున్నారు. వీరిలో చాలామంది సరైన పోషకాహారం లేక వ్యాధులకు లోనుకావడమో, అంగవిహీనులుగా తయారుకావడమో జరుగుతున్నది.

"పిల్లలను తీర్చిదిద్దవలసిన బాధ్యత తల్లుల మీదనే వుంది. అందుకే వారికి శిశు సంరక్షణకు కావలసిన అన్ని విషయాలలోనూ తర్ఫీదు యిస్తున్నాము. అయితే గ్రామీణ యువతులను ఈ సంక్షేమ పథకంలో చేర్పించడం కష్టమైన పని. సాధారణంగా గ్రామాలలోని స్త్రీలలో చాలామంది ఒక పక్క యింటి పనులు చూసుకుంటూ మరో పక్క పొలంలో పని చెయ్యాలి. దాంతో వాళ్ళకి తీరుబడిగా పిల్లల గురించి ఆలోచించేందుకు సమయమూ, అవకాశమూ వుండవు. అందుకు తోడు మూఢనమ్మకాలను నమ్ముకునే మన గ్రామస్థులు కొత్త పద్ధతుల మీద ఆసక్తి కనబరచడం అరుదు. కాని యిప్పుడిప్పుడు వారు కూడా ఈ సంక్షేమ పథకాల పట్ల వుత్సాహం చూపుతున్నారు"– అంటుంది ఒక గ్రామ సేవిక.

హైద్రాబాదులోని నేషనల్ న్యూట్రిషన్ ఇన్స్టిట్యూట్ వారు చుట్టుపక్కల వున్న రెండు గ్రామాల సహకారంతో పోషకాహార పథకం

సరైన పోషక ఆహారం లేకపోవడంవల్ల మనదేశంలో ఏటా ఐదు లక్షల మంది పిల్లలు చనిపోతున్నారు। కాన్పుల్లో ముప్పై శాతం చనిపోయిన బిడ్డలే పుడుతున్నారు। పుట్టిన పిల్లల్లో అరవై శాతం మందికి – పసితనంలోనే 'బుద్ధి మాంద్యత' చిహ్నాలు కనిపిస్తున్నాయి। చాలామంది పిల్లల్లో ఆరోగ్య లక్షణాలు తక్కువ; వ్యాధి నిరోధక శక్తులు తక్కువ। సరైన పౌష్టిక ఆహారం లభించకపోవడమే వీటన్నింటికీ కారణాలు. శక్తి కలిగించే ఆహారం అందరికీ లభించేది ఎప్పుడు? పిల్లలు అందరూ ఆరోగ్యంగా కలకల్లాడుతూ కనిపించేది ఎప్పుడు?—





ఒకటి రూపొందించారు. ఈ పథకం ప్రకారం స్థానికంగా లభించే పోషకాహారాలు........ఉదా : జొన్నలు, రాగులు, వేరుసెనగలతో చవకగా పోష కాహారాన్ని సమకూర్చుకోవచ్చునని తేలింది. ఆ గ్రామాలలోని 300మంది పిల్లలమీద చేసిన ప్రయో గాలు సత్ఫలితాల్నిచ్చాయి. ఇంతకీ రోజుకి ఒక్కొ క్కరికీ ఐన ఖర్చు పది పైసలు మాత్రమే!

ఈ విషయంపై ప్రస్తావిస్తూ నందికండిలోని 76 ఏళ్ళ వృద్ధురాలు యిలా అంటున్నది.

"మా చిన్నతనంలో గ్రామస్థులందరూ - పిన్నా పెద్దాతో సహా రాగిసంకటి వేసుకునే తినేవాళ్ళం. వేరుసెనగ, ఆకుకూరలూ కూడా అధికంగా అర గించేవాళ్ళం. ఆ తరువాత నాగరికత ఈ గ్రామా లలో కూడా పెరిగిపోయింది. దాంతో రాగిసంకటి స్థానంలోకి కాఫీ, టీ, నీళ్ళు ప్ర వే శిం చా యి. స్వాతంత్ర్యం వచ్చి రాజకీయ నాయకులు, ఎన్నికలు రావడంతో - 'కష్టపడి పండించే మీరు జొన్న రొట్టెలు తినడమేమిటి....కష్టమంటే ఎరగని భూకామందులు పాలిష్ అన్నం తినడమేమిటి అని రెచ్చగొట్టారు. దాంతో 'అవును గామోలు' అను కుని అందరూ పాలిష్ బియ్యానికి ఎగబడ్డారు. చివరికి ఈ రోజు మళ్ళా - వేరుసెనగలు, జొన్నలు తినండి....వాటిల్లో బలం వుంది అని చెప్పడానికి నిపుణులు కావల్సివచ్చారు."

అయితే ఈ శిక్షణ శిబిరాలు చౌకగా పోష కాహారం తయారుచేసుకోవడంలోనూ, శిశు సంర క్షణలోనే కాక వృత్తి విద్యలలో కూడా శిక్షణ యిస్తున్నాయి. దుస్తులు కుట్టడం, ఎంబ్రాయిడరీ, అల్లికలవంటి చేతి పనులు, నేర్పడంతోపాటు నిరక్షరాస్యులకు చదవడం, రాయడం కూడా నేర్పిస్తున్నారు.

ఆ విధంగానే పిల్లలకు ప్రాథమిక విద్య, మధ్యాహ్న భోజన సదుపాయాలు పాఠశాలలో కల్పిస్తున్నారు.

అసలు ప్రాథమిక విద్య ప్రధాన లక్ష్యం ఏమి టంటే - పిల్లలను తీర్చిదిద్దడం. వారికి తెలియని ఎన్నో విషయాలను వారికి అర్థమయ్యే భాషలో చెప్పడం. నిత్యజీవితంలో పాటించవలసిన విషయా లను విడమరచి చెప్పడం. అంటే దుస్తులు, పరి శుభ్రత, భోజన విషయంలో పాటించవలసిన నియ మాలను గురించి బోధించడం; పిల్లలు తాము చెప్పదలచుకున్నది సరిగ్గా, స్పష్టంగా చెప్పగలి గేందుకు తోడ్పడం అన్నమాట.

గ్రామాలలో పిల్లలకు ఈ విషయాలను బోధ పరచే వుపాధ్యాయినులను బాల సేవికలని కూడా అంటారు.

"మేము ఎంతో శ్రద్ధగా ఓపికతో పిల్లలకి చెప్పాలనే అనుకుంటాము. చెప్తాము కూడా. పరి శుభ్రంగా వుంటే ఎంత ముచ్చటగా వుంటారో.... ఎంతమంచిదో నచ్చచెబుతాము. పిల్లలకు నచ్చ చెప్పవచ్చునేమో కాని ఆ తల్లులకు మాత్రం ఆరోగ్య, పరిశుభ్రతా సూత్రాలు బోధించడం కష్టం" అంటుంది ఒక బాలసేవిక.

అయితే అంత శ్రద్ధ లేనివాళ్ళు తమ పిల్లలను పాఠశాలలకు ఎందుకు పంపడం?

"సాధారణంగా మన గ్రామాలలో చాలామంది స్త్రీలు పొలం పనులూ, అవి చేస్తూ వుంటారు. వారి పిల్లలను చూసుకునేందుకూ, ఆ అల్లరి భరిం చేందుకూ ఎవరూ వుండరుగా అందువల్ల మా వద్ద విడిచిపెట్టి వెళతారు. వారికి కావలసింది అంతే. కాని ఈ విధంగానైనా ఆ పిల్లలకు కొంత మంచి జరుగుతోంది. వారికి చిన్న చిన్న పాటలు, పద్యాలు, నీతి కథలు చెబుతూ ఆటలు నేర్పిస్తాము" అంటుంది బాలసేవిక.

కొందరైతే పాఠశాలలో లభించే వుచిత భోజన సదుపాయంకోసం తమ పిల్లలను అక్కడ చేర్పిస్తూ వుంటారట. ఇది మన దేశంలోని దారిద్ర్యానికి మచ్చుతునక!

## పిల్లల పెంపకంలో తీసుకోవలసిన కొన్ని జాగ్రత్తలు

1. ఎంతకాలం వీలైతే అంత ఎక్కువకాలం పాపాయికి తల్లిపాలు పట్టడం మంచిది.

2. నాలుగో నెల నుంచి పాపాయికి తల్లి పాలతోపాటు మృదువైన ఆహారం తినిపించవచ్చు.

3. రోజుకు ఐదారుసార్లు ఆహారం ఇవ్వాలి.

4. జబ్బుతో బాధపడే పాపాయిని ఆకలితో వుంచకూడదు.

5. పిల్లలకు విరేచనాలు, వాంతులు లాంటి వ్యాధులు సంక్రమించినప్పుడు నీళ్ళు ఎక్కువగా ఇవ్వడం మంచిది.

6. పిల్లలు జబ్బు పడినప్పుడు మామూలు చిట్కా వైద్యాలు చెయ్యకుండా దగ్గరలో వుండే ఆరోగ్య కేంద్రానికి వెళ్ళి చికిత్స చేయించడం చాలా అవసరం.

7. పిల్లలు జబ్బు పడడానికి ముందే - వేక్సి నేషన్‌లాంటి వ్యాధి నిరోధక మందులు ఇప్పించాలి.

8. తినిపించే ఆహారం మీద ఈగలు, దోమలు వాలకుండా చూసుకోవాలి.

9. ఆహారం ఇవ్వడానికి ముందు-తల్లి తన చేతుల్ని శుభ్రంగా కడుక్కోవాలి.

10. పిల్లలకు నీళ్ళు పట్టేముందు, అవి పరి శుభ్రంగా, స్వచ్ఛంగా వున్నాయా లేదా అని పరిశీలించి శుభ్రమైన నీళ్ళనే తాగించాలి.

11. ఇద్దరు లేదా ముగ్గురు పిల్లలైతేనే ముద్దు. అంతకు మించితే ఇంటికి బరువు; దేశానికి సమస్య!

12. కాన్పుకు కాన్పుకూ మధ్య కనీసం రెండు మూడేళ్ళ వ్యవధి వుండాలి. తల్లీ, పిల్లలు ఆరో గ్యంగా, ఆనందంగా వుండాలంటే ఇది చాలా అవసరం; శ్రేయస్కరం!

బాల నేరస్థులు :

చిన్న పిల్లలు కూడా దొంగతనానికి పాల్పడం గురించి మనం అప్పుడప్పుడు వింటూనే వుంటాము. అయితే వారు ఆ విధంగా మారడానికి దోహదం చేసే పరిస్థితులు ఏమిటీ - అంటే సాధారణంగా అందుకు కారణాలు ఈ విధంగా కనిపిస్తాయి.



మొదటి కారణం : కుటుంబాల్లో వుండే ఆర్థిక సమస్యలు. తల్లిదండ్రులు 'రోజు కడపడమే కష్టం'గా వుందని - ఎప్పుడూ ఆర్థిక సమస్యలతో సతమతమవుతూ పిల్లల్ని సరిగ్గా చూడకపోవడం.

రెండవ కారణం : పిల్లల పెంపకంలో తల్లిదండ్రుల అశ్రద్ధ. ఎంతసేపూ బయట ప్రపంచంలో తమ పరపతిని ఎలా పెంపొం దించుకోవడమా అని ఆలోచించే తల్లి దండ్రులు తమ పిల్లలు గురించి పట్టించుకోక పోవడం; అందువల్ల వారు అల్లరి చిల్లర సావాసాలు చేసి 'రౌడీతనం'గా తయారు కావడం.



దొంగ

మూడవ కారణం: మనవాళ్ళలో గూడు కట్టుకుని వున్న మూఢ నమ్మకాలు. పిల్లలు పెడత్రోవ పడుతూంటే మందలించకుండా - 'వాడి రాత ఎలా వుంటే అలా అవుతాడు. మధ్యలో మనమేం చేస్తాం' అని తల్లి దండ్రులు పిల్లలను గాలిలోకి వదిలేస్తారు.

ఇవే కాకుండా సినిమాల్లో మానసికోద్రే కాన్ని ప్రకోపించే సంఘటనలను చూపించడం, కొన్ని కొన్ని కుటుంబాల్లో సవతి తల్లులు పిల్లలను సరిగ్గా చూడకపోవడం, దాంతో ఆ పిల్లలు యిల్లు విడిచి పారిపోయి అల్లరి చిల్లరగా తిరుగుతూ చివరకు దొంగతనాలకు వాటికీ అలవాటు పడిపోవడం. తల్లిదండ్రుల ప్రవర్తన బాగుండకపోవడం; చుట్టుపక్కల వాతావరణం బాగుండక పోవడంతో చెడు సావాసాలు — మొదలైన కారణాల వల్ల కూడా పిల్లలు తప్పుదారిలో పడి నేరస్థులుగా మారుతూ వుంటారు.

''ఇందులో వయసును తగ్గించి దొంగ సర్టిఫికేట్లు చూపి చేర్పించేవాళ్ళు కూడా వున్నారు'' అంటారు బాలసేవికలు.

ఇక పిల్లల ఆరోగ్యం గురించి చూసుకునేందుకు అక్కడక్కడ కొన్ని గ్రామాల్లో ప్రాథమిక వైద్య శాలలున్నాయి. కాని లక్షమందికి ఒక వైద్యశాల చొప్పున వున్న ఈ ప్రాథమిక వైద్యశాలలు ఎన్ని వుంటే చాలతాయి?

అందుకే డాక్టర్లు, వ్యవసాయ శాస్త్రంలో పట్టభద్రులు, విద్యావంతులు కూడా కేవలం పట్టణాలకే కట్టుబడి వుండకుండా గ్రామాలకి తరలి వెళ్ళాలి. అక్కడివారికి సేవ చేస్తూ, వ్యవసాయ వుత్పత్తిని పెంచే నూతన పద్ధతులు బోధిస్తూ వారిని విద్యావంతులను చేయడానికి ప్రయత్నించాలి. గ్రామాల సుభిక్షత మీదనే పట్టణాల ప్రగతి ఆధారపడి వుందన్న విషయం మరచిపోకూడదు.

అసలు గ్రామాలలోనే కొంత లోపం వుంది. అక్కడి కుటుంబ విషయాలలోగాని, పిల్లల సంక్షేమ కార్యక్రమాలలోగాని పురుషులు పాల్గొనడం తక్కువ. స్త్రీలకు ఈ విషయంపై ఎంత శిక్షణ యిచ్చినా ఆమెతోపాటు ఆమె భర్త కూడా అర్థం చేసుకుని సహాయపడినప్పుడే ఆ తల్లులు తమ పిల్లల సంరక్షణకై నూతన పద్ధతులు అవలంబించగలుగుతారు.

ఈ శిశు సంక్షేమ పథకాలు అమలుజరపాలంటే అందుకు ప్రభుత్వమూ, స్థానిక సంఘాలు, కుటుంబంలోని ప్రతి వ్యక్తి కూడా కలిసి శ్రమించాలి. అప్పుడే ఈ పథకాలు విజయవంతమవుతాయి. బాలల ఆరోగ్యానికి, పెరుగుదలకు, వారి బంగారు భవిష్యత్తుకూ అవకాశం ఏర్పడుతుంది.

ఈనాడు మనం చెప్పుకునే ప్రఖ్యాతి చెందిన వ్యక్తులందరూ కూడా ఒకప్పుడు బాలలే. అలాగే నేటి బాలలు రేపు గొప్పవారు కావచ్చును. అవ్వాలి కూడా. అందువల్ల నేటి బాలలను రేపటి పౌరులుగా తీర్చిదిద్దవలసిన బాధ్యత తలిదండ్రుల మీద వుంది. ముఖ్యంగా తల్లుల పెంపకం మీద మరింత ఆధారపడివుంది. □



అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా — తమిళనాడు ప్రభుత్వం 'ముఖ్యమంత్రి బాలల నిధి'ని సేకరించడానికి నిశ్చయించుకున్నది. ఈ నిధి మొత్తం కోటి రూపాయలు! ఈ డబ్బు బాలల పురోభివృద్ధికి వినియోగింపబడుతుంది. వారి సంక్షేమానికీ, చదువులకే కాకుండా అంగవిహీనమైన వారికి కృత్రిమ అంగాలు సమకూర్చడానికి కూడా వినియోగింపబడుతుంది. వివాహాలు చేసుకున్న వితంతువుల సంతానానికీ, కులాంతర వివాహాలు చేసుకున్నవారి సంతానానికీ — (ప్రస్తుతం వెనకబడిన జాతులవారి పిల్లలకు సహాయాలు జరుగుతున్నట్టుగా) చదువుల నిమిత్తం ఉద్దేశింపబడుతుంది. అంగవిహీనులైన విద్యార్థులకు ఉచిత రవాణా సౌకర్యాలు, వాళ్ళలో పేదవారికి, స్కాలర్‌షిప్‌లూ ఇవ్వడానికి అప్పుడే ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఈ సంవత్సరంలో రాష్ట్రంలో 300 బడులు ప్రారంభించడానికీ, పాఠశాలలను పక్కా పాఠశాలలుగా మార్చడానికీ కూడా రాష్ట్ర ప్రభుత్వం నిశ్చయించుకుంది. ప్రభుత్వ సహకారంతో అనాథశరణాలయాలు నడపబడుతున్నా — ప్రభుత్వమే సొంతంగా అనాథ బాలలకు గాను — ఒక శరణాలయం కూడా (మద్రాసులో) ఆరంభించబోతున్నది.

శనివారం సాయంత్రం.

అందుకు తోడు అవి పౌర్ణమి రోజులు.

జనసందోహంతో కళకళలాడుతోంది మెరీనా బీచ్.

చంద్రుడు నీలిసముద్రంలోంచి వెన్నెల చిందిస్తూ క్రమక్రమంగా పైకి వస్తున్నాడు.

చంద్రునికి స్వాగతం చెబుతున్నట్లుగా ఎగిరెగిరి పడుతున్నాయి అలలు.

ప్రేమికుల జంటలతో, నూతన వధూవరులతో, కుటుంబాల సమూహంతో ఏటు చూసినా—ఆనందం, ఆహ్లాదం, సంతోషం, సంరంభం వెల్లివిరుస్తున్నాయి.

నా దృష్టి దూరంగా ఒక చోట ఆడుకుంటున్న పిల్లల మీద పడింది.

కొందరు ఇసుకతో ఇళ్ళు కట్టుకుంటున్నారు.

మరి కొందరు పరుగు పందెం ఆట ఆడుకుంటున్నారు.

ఇంకొందరు గవ్వలు ఏరుకుంటున్నారు.

వారిలో ఒక పిల్లాడు గాలిపటం ఎగరేస్తున్నాడు. పోనీటైలు వేసుకున్న పిల్ల అతని చెల్లెలు కాబోలు- దారం బంతి పట్టుకుని వుంది.



ఆ పిల్లలు ముద్దొస్తూ ఎంతో ముచ్చటగా వున్నారు.

కొద్ది దూరంలో మరో దృశ్యం.

గుర్రంమీద 'స్వారీ' చేస్తున్నాడు ఐదేళ్ళ పసికందు. కొయ్య గుర్రం అదిలించినట్లుగా 'చల్....చల్' అంటున్నాడు. ధైర్యం నటిస్తున్నాడే కాని ఒక పక్క భయంగానే వుంది-పడిపోతాడేమోనని. అందుకే గుర్రపు అబ్బిని ఒక చేత్తో పట్టుకున్నాడు. ఆ దృశ్యం చూసి నవ్వాపుకోలేక పోయాను.

మనసంతా ఎంతో హాయిగా వుంది. 'బాల్యం—ఎంత ఆనందదాయకమైన దశ'—అనుకున్నాను. ఆ పిల్లల మీద ఒకింత అసూయ చెందాను కూడా.

**అయితే నా ఆనందం, ఆ అసూయ ఎంతోసేపు నిలవలేదు.**

నాకు సమీపంలోనే ఒక చిన్నపిల్లాడు నిల్చొని వున్నాడు. ఆ పిల్లాడికి మహా వుంటే ఏడేళ్ళు వుంటాయి. అతడి చూపులు గాలిపటం ఎగరేస్తున్న బాలుడి మీదే వున్నాయి.

చిరిగిన చొక్కాతో, దీనమైన చూపులతో, అర్భకుడిలా వున్న పిల్లాడిని చూడగానే ఎందుకో నా మనసు కలుక్కుమంది.

"నీకూ ఆ గాలిపటం కావాలా?" అనడిగాను.

నా వైపు వింతగా చూశాడు ఆ పిల్లాడు.

తల అడ్డంగా వూపాడు. "చక్కిలాలు కొనుక్కుంటారా?" అనడిగాడు ఆశగా నా వైపు చూస్తూ.

అప్పుడే అతనివైపు పరిశీలనగా చూశాను. ఆ పిల్లాడి చేతులో ఒక డబ్బా వుంది. ఆ డబ్బాలో శనగలు, చక్కిలాలూ వున్నాయి. అవి అమ్మిపెడితే అతనికి వచ్చే జీతం....నెలకి పదిహేను రూపాయలు!

ఆ కుర్రవాడికి గాలిపటం మీద మోజువున్నా, దాంతో ఆడుకునేందుకు అవకాశం లేదు. ఆ డబ్బాలోని వస్తువులు అమ్మాలి-అదే అతని తాపత్రయం.

ఆ పిల్లాడిని చూడగానే అంతవరకూ నాలో వున్న ఆనందం కాస్తా ఎగిరిపోయింది. బాలలపై నేను నిర్మించుకున్న ఆశాసౌధం కాస్తా కూలిపోయింది. యాంత్రికంగా ఆ కుర్రాడిచ్చిన పొట్లం తీసుకుని డబ్బులు యిచ్చాను.

చుట్టూ చూశాను. అటువంటి చిన్న చిన్న పిల్లలు అక్కడక్కడ చాలా మంది కనిపించారు.

గుర్రం మీద బాలుడు స్వారీ చేస్తూనే వున్నాడు. గాలిపటం ఎగరేసిన కుర్రాడు దారపు బంతి పట్టుకుని వున్నాడు. అతని చెల్లెలు ఇప్పుడు గాలిపటం ఎగరేస్తోంది.

ఎందుకో అక్కడ వుండ బుద్ధికాలేదు. చక్కిలాల కుర్రాడి లోతు చెక్కిళ్ళు చూసిన తరువాత ఆ బీచిలో నిండుదనం లోపించినట్లుగా అనిపించింది నాకు.

ఇసుక దాటి....మెట్లెక్కి రోడ్డుమీదకి చేరుకున్నాను.

మెట్లమీద మరో దృశ్యం.

ఐస్‌క్రీం అమ్ముతున్నాడు ఒక కుర్రాడు. మహా వుంటే ఆ కుర్రాడికి పదేళ్ళు వుంటాయి. తమ





పిల్లలకి ఐస్‌క్రీం కొనిపెడుతున్న ఆ తల్లిదండ్రుల వైపే చూస్తున్నాడు—ఏదో కోల్పోయిన వాడిలా ఐస్‌క్రీమ్ కుర్రాడు.

ఎవరో తరుముతున్నట్టుగా అడుగులు వేస్తూ బస్‌స్టాండుకి చేరుకున్నాను. పారిస్ కార్నర్‌కి వెళ్ళే బస్సు వచ్చింది. మా బంధువులమ్మాయి రాసిన ఉత్తరమూ జ్ఞాపకం వచ్చింది. తనకి కావలసిన వస్తువు లేవో కొని పంపమని రాసింది. సరే—పొద్దు పోయినట్లూ వుంటుంది, అవి కొన్నట్లూ అవుతుంది కదా అని ఆ బస్సెక్కాను.



# ఈ బాలలూ భారతీయులే!



బస్సులో కూర్చున్నానన్నమాటేగానీ ఆలోచనలు....ఆ ఆలోచనల్లో ఎప్పుడో ఎక్కడో చదివిన విషయం ఒకటి జ్ఞాపకం వచ్చింది.

మన దేశంలో ప్రతి దశాబ్దానికి మన జనాభా 25 శాతం పెరుగుతోందిట. అందువల్ల పేదరికం వంటి సమస్యలు మరింత పెరుగుతున్నాయి.

అయినా పిల్లల జీవనానికి కావలసిన కనీస అవసరాలను కూడా తీర్చగల శక్తి మనకు లేనప్పుడు వాళ్ళకి జన్మ నిచ్చే హక్కు మనకి ఎక్కడిది?

ఇతర దేశాలలో, పాఠశాలలో పిల్లలు అన్ని హంగులతో చదువుకుంటూ వుంటే మనదేశంలో అధిక సంఖ్యాకులైన పిల్లలు జీవనోపాధి వెదుక్కుంటున్నారు. అసలు మనదేశ జనాభాలో పనిచేసే



వారి సంఖ్యలో 60 శాతం బాలలేనట!

బాలల భవిష్యత్తుపై తగిన శ్రద్ధ తీసుకోవలసిన బాధ్యత ప్రభుత్వం మీద కూడా వుంది. ఐక్యరాజ్య సమితి అధికార భాషలలో హిందీని ప్రవేశపెట్టడం, మద్యపాన నిషేధం అమలు జరపడం, విదేశీ గుత్తాధిపత్య సంస్థల అజమాయిషీ రూపుమాపడం- యివన్నీ ముఖ్యమైనవే కావచ్చు. కాని వీటన్నిటి కన్న ముఖ్యం, ప్రతి ప్రభుత్వం ప్రధాన కర్తవ్యం- పిల్లల భవిష్యత్తు చూడడం.

కారణం - రేపటి దేశప్రగతికి కారణభూతులు వారే!

కాని ఈ మాట వినేదెవరు? పట్టించుకునే వాళ్ళెవరు? నా ఆలోచనలు తీవ్రస్థాయి చేరుకున్నట్టే బస్సు కూడా వేగంగా ప్రయాణం చేస్తోంది. స్టాపింగు రావడంతో బస్సు ఆగింది. ఆ ఆలోచనల్లోంచి బయటపడి బస్సు దిగాను.

పారిస్ సందుల్లో నడుస్తున్నాను, ఒక్కొక్క దుకాణం చూసుకుంటూ. ఇంతలో ఒక చోట రిక్షాలో కూర్చుని యూనిఫారంలో వున్న చిన్న చిన్న పిల్లలు హడావిడిగా మాట్లాడుకుంటున్నారు. ఆటలు ఆడి ఆలస్యంగా యింటికి వెళుతున్నట్లున్నారు వాళ్లు.

రిక్షా తొక్కుతున్నవాడూ- కుర్రాడే!

చెప్పులు కుట్టేవాడు, సైకిల్‌కి గాలికొట్టే వాడూ కూడా కుర్రాళ్ళే కనిపించారు.

ఆ చెప్పులు కుట్టే కుర్రాడు దీక్షగా చెప్పు కుడుతున్నాడు.

స్కూలు నుంచి యింటికి తిరిగివెడుతున్న తన ఈడువారి సందడి - సందోహం అతను పట్టించుకోవడం లేదు.

ఆ చెప్పుకుడితే ఆ పిల్లాడికి లభించేది పావలా!

అలా ఎన్ని చెప్పులు కుడితే ఆ పిల్లాడి జీవనం గడుస్తుంది?

నోటు పుస్తకాలు తీసుకుని బడికి వెళ్ళవలసిన ఆ పిల్లల చేతుల్లో రోజు కూలి రూపాయి నోటు!

అయినా ఈ రోజేమిటి కొత్తగా నేనూ, నాతో పాటు ఈ ప్రపంచం ఈ దీన చరిత్రుల గురించి యింతలా ఆలోచిస్తున్నాము....

అంతర్జాతీయ బాలల సంవత్సరం!

అందుకేనేమో నాలో ఎన్నడూ లేనిది యింతటి పరిశీలనా దృష్టి. రోజూ చూసే ఆ పిల్లల గురించి ఇవాళే కొత్తగా పట్టించుకోవడం. ఈ సంవత్సరం కాస్తా ఐపోతే - ఆ తర్వాత ఆలోచనలకి....నాలో నేనే నవ్వుకున్నాను.

నాకు కావలసిన వస్తువులు కొనుక్కుని తిరిగి వస్తున్నాను. దారిలో - అంతవరకు రిక్షా తొక్కుతున్న బాలుడు రిక్షాలో కూర్చుని స్కూలుకి వెళుతున్నట్లుగాను, చక్కిలాలు అమ్మే కుర్రాడు సరదాగా తన చిట్టి చెల్లెలుతోపాటు బీచిలో గాలిపటం ఎగరేస్తున్నట్లుగానూ, ఐస్‌క్రీం కుర్రాడికి ఆ పిల్లాడి అమ్మా-నాన్న ఐస్‌క్రీం కొనిపెడుతున్నట్లుగానూ... చెప్పులు కుట్టే కుర్రాడు బూట్లు వేసుకుని దర్జాగా నడుస్తున్నట్లుగానూ సైకిల్‌కి గాలికొట్టే కుర్రాడు కారులో షికారు వెళుతున్నట్లుగానూ - ఊహాలోకంలో విహరించాను.

అయితే ఆ సుందర స్వప్నమూ ఆట్టేసేపు నిలవలేదు.

ఒక పిల్లల తల్లి పసికందుల్ని పెట్టుకుని పేవ్‌మెంట్ మీద కూర్చుని వుంది.

ఆకలి, రోగాలు, అజ్ఞానం, అవిద్య - అనే పద్మవ్యూహంలో కూరుకుపోయి వున్నారు వాళ్ళు.

ఆ వాతావరణంలో దైన్యం, పేదరికం విలయ తాండవం చేస్తున్నాయి.

అందరి తల్లులలాగే ఆ తల్లికీ పిల్లలపై ఎంతో ప్రేమ ఉంది. అందరిలాగే తన పిల్లలనిఉన్నతులుగా తీర్చిదిద్దాలనే ఆరాటమూ వుంది. కాని, పేవ్‌మెంట్ మీద జీవితాలు వెళ్ళమార్చేవారికి అదెలా సాధ్యం?

అక్కడే ఇద్దరు పిల్లలు రోడ్డుకి కంకరవేసే యంత్రం మీద కూర్చునివున్నారు.దాని మీద వాళ్ళి ద్దర్నీ....వాళ్ళ సరదాని చూడగానే బీచిలో గుర్రపు స్వారీ చేస్తున్న పిల్లాడు నా కళ్ళముందు మెదిలాడు.

ఏమిటీ తేడా? విధాత రాత అని వూరుకోక మనకు చేతనైనది మనం చేయాలి. ఈ పిల్లలకీ కోరికలుంటాయి. అమాయకమైన బాల్యదశలో ఆరాటమే ఎరిగిన వీరికి ఆనందంగా జీవించాలనే వుంటుంది. మరి అవి తీరేదెప్పుడో?

--లక్ష్మి

## మళ్ళ మీ రోజువారీ పనులు మామూలుగా చేసుకోవాలని ఆతృతగా ఉందా మీకు?

# గ్లాక్సోస్-డి®




dCA/GL/54/TL



# చిన్నపిల్లలా చిత్రహింసలా

అమెరికాలో ప్రతి సంవత్సరమూ పది లక్షల మంది పిల్లలు-తల్లిదండ్రుల చిత్రహింసలకి గురవుతున్నారనీ, వీరిలో రెండువేల మంది ఆ చిత్రహింసలకి తట్టుకోలేక మరణిస్తున్నారనీ, మరో పదిహేను వేలమంది అంగవైకల్యం పొందుతున్నారనీ 'న్యూయార్క్ టైమ్స్ మేగజైన్' ఈ మధ్య ప్రకటించింది. ఇది నమ్మలేని విషయమే; అయినా నిజం.

తల్లిదండ్రులు పిల్లల్ని కొట్టడం, తిట్టడం మన దేశంలో తరచు చూస్తూ వుంటాము. అయితే ఆర్థికంగామూ, నాగరికంగామూ పురోగమించిన దేశాలలో కూడా అటువంటి పరిస్థితులే వుండడం ఆశ్చర్యం కలిగిస్తాయి.

ఒక అమెరికాలోనే కాదు-ఫ్రాన్స్‌లోనూ తల్లిదండ్రుల చేతుల్లో పిల్లలు నానారకాల చిత్రహింసలకి గురవుతున్నారని, సంవత్సరానికి అలా చిత్రహింసలకి లోనయే పిల్లల సంఖ్య-పాతికవేలకి పైగానే వుంటుందని 'పారిస్ మాచ్' పత్రిక ప్రకటించింది. ఈ విషయంలో స్పెయిన్ దేశం-అమెరికా, ఫ్రాన్స్‌లకు తీసిపోదని మాడ్రిడ్ నుంచి వెలువడే 'యా' అనే పత్రిక వెల్లడించిన ఒక వార్త ఋజువు చేసింది. స్పెయిన్‌లో రెండు సంవత్సరాల బాలుడు రాత్రి పక్క తడిచేశాడని, ఆ బాలుడి తల్లి సిగరెట్‌తో అతని అంగాన్ని కాల్చి రకరకాలుగా చిత్రహింసలు పెట్టిందనీ, కొంతమంది సంఘ సేవకులు ఆ అబ్బాయిని కాపాడి చిన్నపిల్లల సంరక్షణ గృహానికి చేర్చి బ్రతికించారనీ వార్త.

ఫ్రాన్స్‌కి చెందిన ప్రముఖ వైద్యుడు ఫ్రాన్సిస్కో మార్టినో జరిపిన ఒక సర్వేవల్ల కొన్ని పశ్చిమ దేశాలలో చాలామంది పిల్లలను తల్లిదండ్రులు చిత్రహింసలు పెడుతున్నారని వెల్లడయింది. వీరిలో మరణించినవారు అదృష్టవంతులనీ, ఆ అదృష్టం లేక మతి చలించిన ఎందరో జీవితాంతమూ నరకంలో బ్రతకవలసి వస్తున్నదనీ అంటాడు డాక్టర్ మార్టినో. కోపంలో తల్లో తండ్రో పిల్లలని నెత్తిమీద కొడితే ఆ దెబ్బ మూర్ఛరోగాన్ని తీసుకురావచ్చని డాక్టర్ మార్టినో హెచ్చరించాడు. పిల్లలకి మెదడు మీద దెబ్బతగిలితే పక్షవాతం, మెల్లకన్ను, నత్తి సంప్రాప్తిస్తాయని వైద్యపరిశోధనలలో తేలింది.

విపరీతంగా మద్యం సేవించి తమ అదుపులో తాము లేని తల్లిదండ్రులు, కనీసం ప్రాథమిక విద్యాజ్ఞానం లేని పెద్దలు, ఆర్థికంగా చితికిపోయిన వారు-పిల్లలని హింసిస్తారని కొందరి అభిప్రాయం. అయితే ఇటలీ నుంచి వెలువడే 'పనోరమా' అనే పత్రిక పిల్లలని చిత్రహింసలకి లోను చేయడమనేది వంశపారంపర్యంగా వచ్చే వ్యాధని వ్రాసింది. చిన్న పిల్లలప్పుడు చిత్రహింసలకి గురయినవారు పెద్దయ్యాక తమ పిల్లలని చిత్రహింసలు పెట్టవచ్చని ఈ పత్రిక సిద్ధాంతం. ఇటలీలో పిల్లలని చిత్రహింసలు పెట్టే తల్లిదండ్రులలో నిరుద్యోగులే అధికశాతం అని 'పనోరమా' వెల్లడించింది.

అమెరికా నుంచి వెలువడే పత్రిక 'ప్రోగ్రెసివ్' తమ దేశంలోని 'ఫ్లింట్' అనే నగరంలో సేకరించిన వివరాలప్రకారం 1975 లో ఆర్థిక సంక్షోభం రావడంతో అన్ని విధాలా చితికిపోయిన ఇంటి పెద్ద-చిరునవ్వులతో ఎదురయిన పిల్లలను చితక కొట్టేవాడని తేలింది. కొన్ని పశ్చిమ దేశాలలో నిరుద్యోగులు మూడు కోట్లకు పైగా వున్నారనీ, గృహాన్ని స్వర్గసీమగా మార్చుకోవాలంటే స్థిరమయిన ఉద్యోగాలు వీరికి లభించాలనీ 'ఇంటర్నేషనల్ హెరాల్డ్ ట్రిబ్యూన్' పేర్కొంది. అప్పుడే బాలలలో భగవంతుని వీరు చూడగలరని కూడా ఈ పత్రిక వెల్లడించింది.

అయితే సోవియట్ రష్యా తదితర సోషలిస్టు దేశాలలో రేపటి పౌరులుగా ఎన్నో అర్హతలతో అన్నివిధాలా అభిమానానికి నోచుకుని, అనురాగాన్ని దోచుకుని పిల్లలు హాయిగా వున్నారని పశ్చిమ దేశాలకి చెందిన ప్రముఖులు అభిప్రాయపడుతున్నారు.

బాలల ప్రాముఖ్యతను గుర్తించి వారి ప్రపంచంలో వారిని బ్రతకనిస్తూ మన ప్రపంచంలోకి వారిని తీసుకువచ్చే ప్రయత్నాలు జరగాలని 1979 ని 'బాలల సంవత్సరం'గా అందరూ స్వాగతం చెప్తున్నారు.

—బోడపాటి కృష్ణవేణి

## మెదడు

మనిషి తెలివి తేటలకు, మేధస్సుకూ ఆధారం-మెదడు. ఐతే, తల పెద్దదిగా వున్నంత మాత్రాన వారిని మేధావంతులని చెప్పలేము. ఎంచేతంటే పెద్ద తలలో పెద్ద మెదడు వుండాలనో, వారిలో ఎక్కువ తెలివి తేటలు వుంటాయనో రూఢిగా చెప్పలేము.

సరాసరి పురుషుని మెదడు కొలత 50 ఔన్సు లయితే స్త్రీ మెదడు 45 ఔన్సులు మాత్రమే. ఈ బరువు, ఆయా వ్యక్తుల వయసు, శరీర పరిమాణం, బరువూ మొదలైన వాటిని అనుసరించి వుంటుంది.

మెదడు పెరుగుదల శిశువు మొదటి మూడు సంవత్సరాలు చాలా వేగంగా, ఎక్కువగా వుంటుంది. తర్వాత కొద్దికొద్దిగా తగ్గుతూ ఇరవై ఏళ్ళు నిండగానే పెరుగుదల పూర్తిగా ఆగిపోతుంది. ఆ పైన కాస్త తగ్గడం కూడా సాధ్యమే-అంటారు వైద్యవేత్తలు.

ఒకరి తెలివితేటలకు, వారి మెదడు పరిమాణానికి, బరువుకూ అంతగా సంబంధం లేదు-అంటారు వైద్య పరిశోధకులు.

వాల్టర్ స్కాట్, ఐజాక్ న్యూటన్ లాంటి మేధావంతుల తల, మెదడుల పరిమాణం సగటు మెదడు కన్నా కాస్త చిన్నదిగా వుండడం కూడా ఈ సత్యాన్ని రుజువు చేస్తుంది.

మరి మనిషి తెలివితేటలలో భేదం వుండడానికి కారణం ఏమిటి?—మెదడులో వుండే 'కార్టెక్స్' అనబడే మడతలే ఈ వ్యత్యాసాలకు కారణం అంటారు విజ్ఞానవేత్తలు. మడతలు ఎక్కువగా వున్న మెదడు; అవి తక్కువగా వున్న మెదడు కన్నా చాలా చురుకుగా, తెలివిగా పని చేస్తుందట.

ఇకపోతే తెలివితేటలు పెంపొందించుకోవాలంటే, మెదడు బాగా పని చెయ్యాలంటే ఏదైనా టానిక్ వుందా? అంటే వుంది. అదే దానికి ఎప్పుడూ మంచి పని కల్పిస్తూ వుండడం. మెదడు ఒక కండరం లాంటిది. దానికి బాగా పని కల్పించడమే చక్కని వ్యాయామం. దాని ఆరోగ్యానికి, అభివృద్ధికి ఇదే ఉత్తమమైన మార్గం, మంచి టానిక్ అంటారు – విజ్ఞానవేత్తలు, వైద్య పరిశోధకులూ. అంచేత, మీ పిల్లలు ఊరికే గోళ్లు గిల్లుకుంటూనో వృథా కాలయాపన చేస్తూనో కూచోకుండా— మీరు చూడాలి!

పెద్దకథ:

# తెలిసి చేసిన పాపం

— పాటిబండ్ల విజయలక్ష్మి

రావుగారి జీవితంలో మధురమైన వరం శోభాదేవి. అన్యోన్యమైన దాంపత్యం వారిది. చీకూచింతా లేని జీవితం, తనకోసం ప్రాణమైనా యివ్వడానికి వెనుకాడని భార్య శోభ....వంశోద్ధారకుడుగా పుట్టిన దినేష్ ఏనాడూ దేనికీ బాధపడటమంటే ఏమిటో కూడా తెలీకుండానే పాతిక సంవత్సరాల సంసార జీవితం సాఫీగా హాయిగా సాగిపోయింది. పాతిక సంవత్సరాలు గడిచిపోయినట్టే తెలీలేదు రావుగారికి.

అందరికీ లభించని అరుదైన అదృష్టం శోభ రూపంలో బీద విద్యార్థిగా వాళ్ళింట స్థానాన్ని సంపాదించిన వేణుగోపాలరావును వరించింది. ఆమెతోపాటే అతని జీవితంలో వెలుగూ వెన్నెలా ఒక్కసారిగా వచ్చిపడ్డాయి. ఆ తర్వాత ఎప్పుడూ అంధకారమయమైన గత దినాల ఒంటరితనం, ఏకాకినన్న ఆక్రందన, అతనికి జ్ఞాపకం రాకుండా చేసింది ఆమె సాన్నిహిత్యం.

ఒక్కగానొక్క గారాలపట్టి శోభ అభీష్టాన్ని కాదనే ధైర్యం లేని రాజారాంగారు, అనాథైన వేణుగోపాల్‌ను అల్లుడిగా చేసుకోక తప్పలేదు. తల్లిలేని శోభ మనసు నొప్పించడం యిష్టం లేక ఆమె యిష్టప్రకారం వారి వివాహం చేశారు. కానీ ఆ తర్వాత కూడా ఎప్పుడూ ఆయన వేణును అల్లుడిగా చేసుకున్నందుకు పశ్చాత్తాపపడలేదు. తనకు కొడుకుల్లేని లోటు వేణు తీర్చాడనే గర్వంగా చెప్పుకునేవారు. తమ యింటి అల్లుడైన మరు క్షణం నుంచీ అతని మంచి చెడ్డల బాధ్యతను తను తీసుకున్నారు. తనకు సమానంగా గొప్ప హోదా గల ఆఫీసర్‌ను చేయాలనుకున్నారు.

రాజారాంగారి ఆశయాల కనుగుణంగా శ్రద్ధగా చదివి గోల్డ్‌మెడల్ సంపాదించడమే కాకుండా, అతి స్వల్ప వ్యవధిలో ఐ. ఏ. యస్ ఆఫీసర్ కాగలిగాడు వేణుగోపాలరావు. అల్లుడూ కూతురూ రెండు కళ్ళుగా, వాళ్ళ ఆనందమే తన ఆనందంగా భావించేవారు రాజారాంగారు.

వేణుగోపాలరావు కలెక్టరైన సంవత్సరమే రాజారాంగారికి బాగా జబ్బు చేసింది. నగరంలోని పెద్దపెద్ద డాక్టర్లందరూ ఎంతో జాగ్రత్తగా దగ్గరుండి వైద్యం చేశారు. మంచితనానికి మారుపేరుగా మకుటంలేని మహారాజుగా పేరు తెచ్చుకొని ఓ అనాథ విద్యార్థికి అండగా నిలిచి, అతడినే అల్లుడిగా చేసుకొని ఆదర్శ వివాహాలకు అంకు రార్పణ చేసిన లక్షాధికారి రాజారాంగారిని రక్షించ డానికి డాక్టర్లు చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. ఆస్తి యావత్తూ అల్లుడి పేర వ్రాసి నిశ్చింతగా అల్లుడు వేణు చేతుల్లోనే కళ్ళుమూశారు.

అప్పటికే గర్భవతిగా వున్న శోభను కంటికి రెప్పలా కాపాడుకొని తండ్రి దూరమైన దుఃఖం ఆమెకు తెలీకుండా చేయడానికి తన శాయశక్తులా ప్రయత్నించి, తన ప్రేమాదరణలతో శోభ దుఃఖాన్ని మరపించగలిగాడు వేణుగోపాలరావు. మరో ఆరు మాసాలకే దినేష్ పుట్టడంతో, రాజారాం గారే మళ్ళీ ఆ రూపంలో అవతరించాడని వేణూ శోభలు ఆనందపడ్డారు.

మామగారి మరణం వేణుగోపాల్ జీవితంలో ఓ అపశ్రుతిలా తోచినా, దినేష్ ఆగమనంతో మళ్ళీ మనసున పన్నీటి జల్లులు కురిశాయి. శోభ కూడా వేణు ప్రేమలో దినేష్ సంరక్షణలో పడి, త్వరగానే తండ్రి దూరమైన దుఃఖాన్ని మరచిపో గలిగింది.

దినేష్ రాక వారి జీవితాల్లో నవ వసంతాలను నింపింది. వాడికి తను తండ్రి ననుకుంటే ఎంతో గర్వంగా ఫీలయ్యేవాడు వేణుగోపాల్‌రావు. తనకు తల్లెవరో తండ్రెవరో తెలీదు. కానీ తన బిడ్డ దినేష్ కలెక్టర్ కొడుకు. తనకు లేని అదృష్టం తన కొడుక్కు కలిగింది. తల్లీదండ్రీ యిచ్చే ఆప్యాయత, అనురాగం ఎలాంటివో తనకు అనుభవంలోకి రాకపోయినా తన కొడుక్కు దేనికీ లోటులేదు. సమాజంలో ఓ లక్షాధికారి మనవడిగా తన కొడుకుగా, వాడికోగుర్తింపు వుంది. అది వేణు హృదయానికి అంతులేని ఆనందాన్ని కలిగించేది. ఇంతటి అదృష్టానికి తను నోచుకున్నాడంటే అందుకు మానవ రూపంలో వున్న దేవత తన శోభే కారణం.

దినేష్‌ను క్రమశిక్షణతో పెంచడమే కాకుండా, ప్రతి విషయంలో అతని అభిరుచులు తెలుసుకొని

అందుకనుగుణంగా ప్రోత్సహించేవారు.

చూస్తుండగానే సంవత్సరాలు యిట్టే గడిచి పోయాయి.

*



ప్రస్తుతం దినేష్ అమెరికాలో వున్నాడు. తన క్లిష్టమైన సబ్జక్ట్ తీసుకొని రిసెర్చి చేయాలనే వుద్దేశ్యంతో అమెరికా వెళతానన్న కొడుకును వదిలి వుండటం కష్టమనిపించినా అతని అభివృద్ధికి అవరోధం కలిగించటం యిష్టంలేక, బాధను మనసులోనే దిగమ్రింగి అతన్ని అమెరికా వంపారు దంపతులిద్దరూ.

ఐ. ఏ. యస్ ఆఫీసర్‌గా, వి. జి. రావ్‌కు నగరంలో మంచి పేరూ పలుకుబడీ పెరిగాయి. కొడుకు పెళ్ళీడుకు వచ్చినా రావుగారిలో వృద్ధాప్యం చోటు చేసుకోలేదు-అది ఆమడ దూరానే నిలిచి పోయింది. నిజానికి వీళ్ళిద్దరినీ ఒక్కచోట చూస్తే అన్నదమ్ములనుకుంటారు తప్ప తండ్రీ కొడుకు లంటే నమ్మరు. దినేష్‌కు తండ్రి పర్సనాలిటీ తల్లి రంగూ వచ్చినా తండ్రి ముఖంలో వున్న ఠీవీ, రాజసం కొరవడ్డాయి. అందుకే రావుగారిలో ఏదో తెలీని అందం చాలామంది సొసైటీ లేడీస్‌ను ఆకర్షించేది.

అయినా ఆయనెప్పుడూ మహిళామండలి సభ్యురాండ్రకు సాధ్యమైనంత దూరంగా పారిపోయేవాడు. వాళ్ళు ఏదో వంకతో ఆయన దగ్గిరకు వచ్చినా శోభని వాళ్ళమీద ప్రయోగించి తను తప్పుకుంటుండేవారు.

దినేష్ అమెరికా వెళ్ళిన రెండు సంవత్సరాలకు ఇంటికోసమని చక్కటి ప్లాన్ పంపాడు. ఆ ప్లాన్ ప్రకారం ఇల్లు కట్టించి, దాంట్లోకి షిఫ్ట్ అవమని, తను వచ్చేటప్పటికి మమ్మీ, డాడీ ఆ పాత ఇంటిని వదలి కొత్త ఇంట్లోచేరి స్వాగతమివ్వాలని వ్రాశాడు.

దినేష్ కోరిక విని నవ్వుకున్న రావుగారు ఆ మర్నాడే తను కొత్తగా కొన్న ప్లాట్ దగ్గరకు ఓ మంచి ఇంజనీర్‌ను తీసుకుని వెళ్ళి ఆ ప్లాన్ ప్రకారం ఇల్లు కట్టమని ఆజ్ఞలు జారీ చేసి వచ్చేశాడు.

అంతటితో పూరుకోకుండా రోజూ అక్కడికి వెళ్ళి పనులు సక్రమంగా అవుతున్నాయో లేదో చూసి వచ్చేవారు. శోభతోసహా వెళ్ళి దగ్గరుండి ఆ పనులు చేయిస్తుంటే అనిర్వచనీయమైన ఆనందమేదో రావుగారి అణువణువునూ స్పృశించి పులకరింపజేసేది.

శోభనూ, ఆ ఇంటినీ వున్నత విద్యావంతుడై త్వరలో తమను చేరబోతున్న దినేష్‌నూ, తలుచుకుంటూంటే.... మనసులో అనంతమైన తృప్తితో పాటు, అంత సాధించగలిగిన తన అదృష్టానికి మురిసిపోయేవాడు వేణుగోపాలరావు.

అనుకున్న టైమ్‌కు ముందే భవన నిర్మాణం పూర్తయింది. ఇల్లు కట్టడానికి ముందే వేసిన మొక్కలు రకరకాల పూలతో ఆ యింటికి మరింత అందాన్ని సౌరభాన్ని కలిగిస్తుంటే అది చూసి చిన్నపిల్లల్లా మురిసిపోయేవారు శోభాదేవి, రావుగారు.

పాత భవనాన్ని వదలి కొత్త యింటికి వెళ్ళుతుంటే ఆ యింటితో పెనవేసుకున్న మధుర స్మృతులు రావుగారిని శోభాదేవినీ బాధ పెట్టాయి. రాజారాంగారు స్వయంగా కట్టించిందా "దేవీ నిలయం". అందుకే దినేష్ పాత యింటిని అమ్మేయమని రాసినా రావుగారు ఆ యింటిని అలాగే వుంచి కొత్త ఇల్లు కట్టించారు. కన్నీళ్ళతో దేవీ నిలయం వైపు చూస్తూ కార్లో కూర్చుంటున్న శోభాదేవి ముఖం తన చేతుల్లోకి తీసుకుంటూ—

"శోభా! బాధ పడుతున్నావా? మనకు రావాలనిపించినప్పుడల్లా యిక్కడికే వచ్చి వుందాం. అదీ దినేష్ వచ్చేంతవరకూ. ఆ తర్వాత వాడికి పెళ్ళి చేసి ఆ యిల్లు వాడికి అప్పగించి, నేను రిటైర్‌మెంట్ జీవితం ప్రారంభిస్తే, మళ్ళీ మనం మన దేవీ నిలయంలో!" అంటూ ప్రేమగా చూస్తూ కళ్ళు తుడుస్తున్న రావుగారి వైపు తృప్తిగా చూస్తూ చిన్నగా నవ్వింది శోభాదేవి.

కొత్త యింటికి నెమ్మదిగా అలవాటు పడుతున్నారు రావుగారు శోభాదేవి. వారింటికి ఒక ప్రక్కనే యిళ్ళున్నాయి. మరో ప్రక్క ప్లేగ్రౌండ్. సాయంత్రం పూట ఆ కాలనీ పిల్లలందరూ గుంపులుగా చేరి టెన్నిస్ ఆడుకుంటారు. శోభాదేవికి మంచి కాలక్షేపంగానే వుంది. అయితే రావుగారు ఆఫీసు కెళ్ళిన దగ్గర నుంచీ వచ్చేంతవరకూ తోచదమే కష్టంగా వుండేది. వంట మనిషి, తోట మాలి, పని మనిషి ఎంతమంది వున్నా వాళ్ళతో తను మాట్లాడే మాటలేముంటాయి?

సాయంత్రం రావుగారు ఆఫీసు నుంచీ రాగానే ఇద్దరూ గార్డెన్‌లో కుర్చీలు వేయించుకుని కబుర్లు చెప్పుకునేవారు. మధ్య మధ్య ప్లేగ్రౌండ్‌లో చేరిన పిల్లల అల్లర్లూ తగవులూ వింటూ నవ్వుకునేవారు.

*

ఆ రోజు రోజూలాగే ఓ అర్ధగంట ముందుగా ఆఫీసుకు బయలుదేరారు రావుగారు. క్రొత్త యిల్లు ఆఫీసుకు దూరం కావడంతో తొందరగా బయలుదేరక తప్పడం లేదు. దానితో శోభాదేవికి మరింత ఒంటరితనంగానూ దిగులుగానూ అనిపిస్తోంది. ఈ మధ్య మరీ దినేష్ త్వరగా వచ్చేస్తే బావుండుననిపిస్తోంది.

డ్రైవర్ తలుపు తీసి ప్రక్కన నుంచున్నాడు. రావుగారు డ్రైవింగ్ సీట్లో కూర్చున్నారు. ఆయనకెప్పుడూ సెల్ఫ్ డ్రైవింగ్ అంటే యిష్టం. డ్రైవర్ ఎప్పుడూ బాక్ సీట్లో కూర్చోవాల్సిందే. ఒక్కోసారి ఆయనకే నవ్వొస్తుంటుంది. కొద్ది నిముషాలైనా డ్రైవర్ కలెక్టర్‌గా ఫీలవ్వవచ్చు; తనని అతని డ్రైవర్‌గా అనుకోవచ్చని. ఆ మాట విని శోభ పగలబడి నవ్వేది! "మంచి ఆలోచన. వాడు నిజంగానే మీలా ఆలోచించడం మొదలుపెడితే ఆఫీసు చేరుకున్న తరువాత కూడా, వాడు అలాగే కూర్చుని వుంటాడు, మీరు దిగి వాడి దగ్గరకెళ్ళి డోర్ తెరచి పట్టుకోవాలి. అప్పుడు చూడాలి మన రాము ముఖం" అంటూ నవ్వుతున్న అమ్మగారి వైపు భక్తిగా చూస్తూ తలవంచుకునేవాడు రాము, సిగ్గుపడుతూ.

ఆ మాటలు జ్ఞాపకం వచ్చి శోభాదేవి వైపు చూస్తూ "శోభా? నిన్న మన రామూ నువ్వన్నంత పనీ చేశాడు తెలుసా?" అంటూ పగలబడి నవ్వుతున్న రావుగారి వైపు వినయంగా చూస్తూ శోభాదేవి వైపు తిరిగి "ఉత్తదేనమ్మగారూ అయ్యగారు ఆటపట్టిత్తన్నారు నన్ను" అంటూ చిన్నగా నవ్వాడు. వాడికి ఆ యింట్లో కావలసినంత చనువూ స్వతంత్రం వున్నాయి. వాడిని డ్రైవర్‌గా కాకుండా తమ యింట్లో మెంబర్లా చూసుకుంటారు. అందుకే ఆ యింట్లో పనివాళ్ళందరికీ ఆ దంపతులంటే పార్వతీ పరమేశ్వరులే అనిపిస్తుంది.

"వస్తాను శోభా!" అంటూ కారెక్కి శోభాదేవి వైపు చూస్తూ చెయ్యి పూపిన రావుగారి కళ్ళు అప్రయత్నంగానే ప్రక్కింటి పిట్టగోడ వైపు తిరిగాయి. అలవాటుప్రకారం అక్కడ వుండే రెండు అందమైన కళ్ళు విస్ఫారితంచేసుకొని నవ్వుతున్నాయి. అమాయకంగా కనిపించే, పదిహేడు సంవత్సరాల అందమైన అమ్మాయి ఆయన వైపే చూస్తోంది. ఆయన చిన్నగా నవ్వారు. ప్రతిగా నవ్వుతూ కళ్ళు వాల్చేసిన ఆ అమ్మాయి కారు స్టార్ట్ అయి ముందుకు దూకటంతో కళ్ళెత్తి అటే చూస్తూ నుంచుంది – తీగమీద ఆరేసిన బట్టలు సర్దుతూ. కారు కనుమరుగవ్వగానే నెమ్మదిగా ఆరిన బట్టలు తీసుకొని తమ వాటాలోకి వెళ్ళిపోయింది హర్ష.

ఇది రావుగారు ఆ యింట్లో ప్రవేశించిన నెలరోజులుగా క్రమం తప్పకుండా జరుగుతూనే వుంది. తెలీకుండానే ఆ అమ్మాయి మీద ఓ రకమైన అభిమానం ఏర్పడింది రావుగారికి. శోభాదేవితో కూడా చెప్పారు. "నీకు మరీ తోచకుండా వుంటే ఆ పాపను పిలిచి కూర్చోబెట్టుకో. కాలక్షేపమవుతుంది" అని. ఆ అమ్మాయి అలా రోజూ తను వెళ్ళబోయే సమయానికి అక్కడికెలా వస్తుందో ఎందుకొస్తుందో రావుగారికి తెలీదు. బహుశా ఆ అమ్మాయికి కూడా తెలీదేమో కానీ....అదో అపురూపమైన అనుభవం. అప్రయత్నంగానే అలా ఆ అమ్మాయిని రోజూ చూడటం ఆయనకూ అలవాటైంది. ఏ రోజైనా ఆమె కనిపించకపోతే ఏదో ఒకటి మాట్లాడుతూ తాత్సారం చేసేవారు. యింతలో ఆ అమ్మాయి కనిపించేది. కారు స్టార్ట్‌చేసి నవ్వుతూ వెళ్ళిపోయేవారు.

*

ఆ రోజు మరీ బోరుగా ఒంటరిగా అనిపిస్తే,

శోభాదేవి పనిమనిషి లక్ష్మిని పిలిచి పక్కింట్లో వుండే పాపను పిలుచుకురమ్మని పంపింది. లక్ష్మి వెళ్ళి అయిదు నిముషాల్లో హర్షతో తిరిగివచ్చింది.

నవ్వుతూ "లోపలకి రామ్మా!" అంటున్న శోభాదేవి వైపు బెరుకుగా చూస్తూ లోపలికొచ్చిన హర్ష-'అర్థగంటలో ఆవిడను' ఆంటీ అని పిలుస్తూ అన్ని విషయాలూ ఫ్రీగా మాట్లాడటం మొదలు పెట్టింది.

హర్షకు తల్లిలేదనీ స్కూల్‌లో చదువుతూనే చదువుకోస్టాప్ పెట్టవలసి వచ్చిందనీ, తను తప్ప తోబుట్టువులెవరూ లేరనీ, తండ్రి తాలూకాఫీసులో యు. డి. సి. గా వున్నాడనీ, అన్ని వివరాలూ శోభాదేవి అడక్కుండానే చెప్పేసింది. ఇల్లంతా తిరిగి చూసి "అబ్బ! ఎంతందంగా కట్టారుఆంటీ! ఎన్నాళ్ళుగానో మీ యిల్లు చూడాలనుకుంటున్నాను. కానీ అంకుల్ ఏమన్నా అంటారేమోనని లోపలికి రాలేదు. మీ గార్డెన్‌లో అన్ని పూలు పూస్తాయా ఆంటీ—మీ మాలి ఒక్కటంటే ఒక్క పువ్వు యివ్వమన్నా యివ్వడు. అమ్మో! అయ్యగారు కోప్పడతారు అని బెదిరిస్తాడు. ఈ కర్టెన్లు ఎక్కడ తెప్పించారాంటీ! ఇది రేడియోగ్రాం కదూ! మా పక్కింటి వాళ్ళదగ్గర చిన్నది వుంది. దానికే వాళ్ళు మహా పోజు కొడతారు. ఇలా ఫుల్‌స్టాపులూ కామాలూ లేకుండా మాట్లాడి, ఎదురుగా వున్న రాజారాంగారి ఫోటో చూసి "అమ్మో! ఎంతపెద్ద మీసాలో! ఆయనెవరాంటీ?" యిలా ప్రశ్నల మీద ప్రశ్నలు కురిపించి తమయింటి వివరాలన్నీ చెప్పటమే కాకుండా ఆ యింటి వివరాలన్నీ తెలుసుకుంది.

ఆ రోజు టైమ్ యిట్టే గడిచిపోయింది. కారు హారన్ వింటూనే కాఫీ కప్పు టేబుల్ మీద పెట్టేసి 'అమ్మో! అంకుల్ వచ్చేశారు. మళ్ళీ రేపు వస్తానాంటీ' అంటూ పరుగెడుతున్న హర్షను శోభాదేవి ఆపే ప్రయత్నం చేసేలోపల రావుగారికి ఢీకొట్టబోయి తప్పుకుని చిన్నగా నవ్వుతూ తమ యింట్లోకి పరుగెత్తింది హర్ష.

ఆ రాత్రి శోభాదేవి చాలా ప్రొద్దుపోయేవరకూ హర్ష కబుర్లు చెబుతూనే వుంది. వింటూనే నిద్ర లోకి జారుకున్నారు రావుగారు.

*

అలా ఆ యింటికి అలవాటైన హర్ష క్రమం తప్పకుండా రోజూ శోభాదేవి దగ్గర కూర్చుని కబుర్లు చెబుతూ మధ్య మధ్య రికార్డ్స్‌పెట్టి వింటూ ఆ యింట్లోని ప్రతి అందమైన వస్తువునూ చేత్తో పట్టుకుని చూస్తూ ముచ్చటపడుతుండేది. పసి పిల్ల లాంటి మనస్తత్వం యింకా వదలలేదు హర్షను అనుకునేవారు శోభాదేవి.

ఆ రోజు ఆల్బమ్ తిరగేసి చూస్తూ రావుగారి ఫోటో దినేష్ ఫోటో ప్రక్క ప్రక్కనే చూసి "ఈయన ఎవరు ఆంటీ అంకుల్‌కు తమ్ముడా?" అంది. పెద్దగా నవ్వుతూ "అది దినేష్ ఫోటో" అని శోభాదేవి చెబుతుంటే అలాగే చూస్తూ కూర్చుంది హర్ష.

హర్ష ఏదో ఆలోచనలో వుండడం చూసి చిన్నగా నవ్వుకుంటూ—

"నువ్వు చూస్తూండు హర్షా. నేను స్నానం చేసి వస్తాను" అంటూ లోపలికెళ్ళారు శోభాదేవి.

రావుగారి ఫోటో చూస్తుంటే హర్షకు ఆయనో గ్రీక్ రాకుమారుడిలా కనిపిస్తున్నారు. అంత వయసు వచ్చినా ఆయనలో వున్న అందం పదో వంతు కూడా దినేష్‌కు లేదు. మంచి పర్సనాలిటీ అతనిది కూడా, కానీ కనుముక్కు తీరు రావు గారిలా తీర్చిదిద్దినట్లుండదు.

రోజూ ఆయన స్వయంగా కారు డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళుతుంటే ఎంత అందంగా హుందాగా కనిపిస్తారు! చూస్తుంటే అలాగే చూస్తూ వుండి పోవాలనిపిస్తుంది.

ఆయన ఫోటోవైపు చూస్తూ అలా మైమరచి కూర్చుని వున్న హర్షకు అలా ఎంతసేపు గడిచి పోయిందో తెలీలేదు.

స్నానం చేసి వచ్చిన శోభాదేవి—

"ఏమిటి హర్షా యింకా ఆల్బం చూడ్డం కాలా? మా అబ్బాయికి దిష్టి తగిలేను. అదే పనిగా చూస్తున్నావు" అనడంతో వులిక్కిపడి ఆల్బమ్ మూసివేసి లేచి నిల్చుంది.

అప్పుడప్పుడూ వున్నట్లుండి అలా మౌనంగా మారిపోయే హర్ష మీద అంతులేని దయా సానుభూతి శోభాదేవికి. ఆడపిల్లలు లేని ఆమె మనసుకు హర్షను చూస్తే ఏదో తెలీని ఆప్యాయత, ఆత్మీయత.

తల్లి లేకపోవడం వల్ల యింట్లో పనంతా తనే చూసుకోవాలని, తను కోరుకున్నట్లు చదువుకోలేక పోయానని బాధపడే హర్షను చదివించాలనే బలమైన కోరిక కలిగినా హర్ష తండ్రికి అంతకంటే ఎక్కువ చదివించడం ఏ మాత్రం యిష్టం లేదని విన్న తర్వాత ఆ కోరికను మనసులోనే దాచుకుంది శోభాదేవి.

ఏదో ఆలోచనలో మునిగిపోయిన హర్షను చేయి పట్టుకుని కూర్చోబెడుతూ 'నీకు జడ వెయ్యనా హర్షా! ఇవ్వాళ మన మాలి చేత నీకు

[28 వ పేజీ చూడండి]

[లోకజ్ఞానం: సమాధానాలు]

1. పారిస్ నగరంలో.
2. సిరియస్ ఏ. ఈ నక్షత్రానికి 'డాగ్ స్టార్' అని మరో పేరు వుంది. సూర్యునికంటె 26 రెట్లు అధికంగా కాంతిని వెదజల్లుతుంది ఈ నక్షత్రం.
3. జస్టిస్ హిదయతుల్లా.
4. భరతనాట్యం, కథక్, కథకళి, కూచిపూడి, మణిపూరి, ఒడిస్సీ నృత్యాలు.
5. భూమి మీద ఏర్పడే కేంద్రోద్గామిశక్తి అనబడే 'సెంట్రిఫ్యూగల్ ఫోర్స్' వల్ల మనుష్యులతో పాటు జీవరాశులన్నీ కూడా గాలిలో తేలడం ప్రారంభిస్తాయి.
6. 1885లో. అల్లన్ అక్టావియమ్ హ్యూమ్ స్థాపించారు.
7. విశ్వభారతి. పశ్చిమబెంగాల్‌లోని శాంతినికేతన్‌లో ఈ విశ్వవిద్యాలయాన్ని టాగూర్ స్థాపించారు.
8. హిందూ కళాశాల, కలకత్తా. 1817లో ప్రారంభించబడిన ఈ కళాశాల ప్రస్తుతం ప్రెసిడెన్సీ కళాశాలగా వ్యవహరింపబడుతోంది.
9. డాక్టర్ ధర్మేంద్ర ప్రఖ్యాతి చెందిన కుష్ఠువ్యాధి నిపుణుడు. కుష్ఠువ్యాధి నిర్మూలనకు ఆయన చేసిన కృషికి గుర్తింపుగా 1970లో డాలియన్ డాట్టన్ అవార్డు పొందారు. ఈ బహుమతి పొందిన ప్రప్రథమ భారతీయుడు ఈయనే.
10. ట్రాన్స్‌వాల్, దక్షిణాఫ్రికా. ద్వితీయ స్థానం సోవియట్ రష్యాకు చెందుతుంది.

మొట్టమొదట మొదటి చిత్రంలో వున్న ప్రకారం చుక్కలు పెట్టుకోవాలి. ఆ తర్వాత రెండవ చిత్రంలో చూపినప్రకారం, నాలుగు వైపులా పొంగలి కుండలు, ప్రమిదల దీపాలు దిద్దాలి. ఆపైన మధ్య వుండే చిన్న ముగ్గును పూర్తిచేయాలి. రంగు రంగుల ముగ్గుల పొడితో తగిన విధంగా అలంకరించినట్లయితే ఇంకా చాలా ఆకర్షణీయంగా, కన్నులపండుగ చేస్తుందీ సంక్రాంతి ముగ్గు!

—మోహన

# సంక్రాంతి ముగ్గు



"నేను మామూలు మనిషిని. నన్ను గురించి వ్రాసేందుకేముంటుంది?" అన్నారామె.

'అల్లాకాదు, మనవాళ్ళకి మిమ్మల్ని గురించి తెలుసుకోవడం యిష్టంగా వుంటుంది' అని నచ్చచెప్పాక, కబుర్లు చెప్పడం ఆరంభించారు శ్రీమతి సావిత్రీ చెన్నారెడ్డి—మన ముఖ్యమంత్రి డాక్టర్ మర్రి చెన్నారెడ్డిగారి సతీమణి.

"నాకు తొమ్మిది సంవత్సరాల వయస్సున్నప్పుడు మా అమ్మ రాజ్యలక్ష్మి, మా నాన్నగారు కె. వి. నారాయణరెడ్డిగారు-యిద్దరూ చనిపోయారు. పెదతండ్రి కె. వి. రంగారెడ్డిగారు పెంచారు. అమ్మ, నాన్న పోయిన దిగులుతో నేను వూరికే ఏడుస్తుండేదాన్ని. నాకొక మాస్టరుగారుండేవారు—బిదురు వెంకటశేషయ్యగారు. ఆయన నన్ను చేరదీసి, చాలా ధైర్యం చెప్పేవారు. భగవంతుడనేవాడు వున్నాడు అనే భావం గట్టిగా నాలో కలిగించారాయన. ఆయన కొకసారి గుండెపోటు వస్తే, నేను ప్రార్థన చేసి 'ప్రసాదం పట్టుకొచ్చి యిచ్చి మిమ్మల్ని రక్షిస్తానని' అంటే, ఆయన నవ్వారు. నాకు కృష్ణుడంటే యిష్టం అని చెప్పాను. 'ఆ కృష్ణమూర్తి ఫొటో పెట్టుకుని, నీ సంగతులన్నీ చెప్పుకుంటూ వుండమ్మా!' అన్నారాయన. అప్పటికీ, యిప్పటికీ అదే గురి నాకు.

తల్లిదండ్రులు పోయిన మూడేళ్ళకు మేనత్త కొడుకు చెన్నారెడ్డిగారితో పెళ్ళి చేశారు. నేను ఐదోఫారంలో వుండగా, పెద్దబ్బాయి కడుపులో పడ్డాడు. మానేశానింక చదువు. మళ్ళీ పిల్లలతో కలిసి, డాక్టర్‌గారి ప్రోద్బలంతో మళ్ళీ నేను చదువుకుని, మెట్రిక్కు, బి. ఏ. ప్యాసైనాను. ముఖ్యంగా మా పెద్దబ్బాయే నన్ను చదివించేవాడు! కాని—నా దురదృష్టం—1961 వ సంవత్సరంలో బి. ఏ. రిజల్ట్సు యింకా రాకపూర్వమే చనిపోయాడు ఆ పెద్దబాబు. దాంతో ప్రవాహానికి కొండ ఎదురైతే, ఎల్లా ఒక మలుపు తిరిగిపోతుందో, అల్లా తిరిగిపోయింది—నా మనస్సు. అప్పట్నుంచీ నాకు దేనిమీదా లేదు. నా కృష్ణుడు నాకు యిప్పుడు ఒక బిడ్డ. అన్నీ కృష్ణుడికే-పండు, పువ్వు, కాయా, ఏది దొరికినా. ఉత్తరప్రదేశ్‌లో గవర్నరుగా వారు వున్నప్పుడు—కృష్ణుడు పుట్టి పెరిగిన మధుర, బృందావనాలు తనివితీరా చూశాను. గోవర్ధనగిరి చుట్టూ ప్రదక్షిణాలు చేశాను." అంటూ చెప్పుకుపోయారు, సావిత్రీ చెన్నారెడ్డిగారు. వారి యింట్లో చాలా వున్నాయి కృష్ణ విగ్రహాలు—మురళిని అలవోకగా పట్టుకుని చిరునవ్వు చిందిస్తూ.

# సావిత్రీ చెన్నారెడ్డి

సావిత్రిగారిని కలుసుకోవడానికి వెళ్ళే ముందు-ఆమెను బాగా ఎరిగివున్నవారితో మాట్లాడుతున్నాను. ''సావిత్రమ్మగారు ఆదర్శ గృహిణి. 'వండనలయదు వేవురు వచ్చిరేని, అన్నపూర్ణకు నుద్దియే నతని గృహిణి' అన్నట్టుగా, ఏ సమయంలో ఎందరు రానీ, డాక్టరుగారితో సహా ఎందరు భోజనానికి కూర్చోనీ, ఆమె ఏర్పాట్లు చేసేస్తారు.'' అని చెప్పారు. నేనీమాటే సావిత్రిగారితో అంటే, ఆమె



నవ్వి, ''మనం ఎంత పెడుతూంటే కృష్ణుడు అంతా యిస్తాడు. నిజానికి మావారికి కూడా ఒక్కరూ కూచొని భోంచేసే అలవాటు లేదు.'' అన్నారు.

''చిన్నప్పట్నుంచీ మిమ్మల్ని పెంచిన రంగారెడ్డిగారూ, మీవారూ కూడా రాజకీయరంగంలో మునిగిపోయిన వ్యక్తులే. కానీ మీకు ఏమాత్రం ఈ రంగంతో సంబంధం లేదు. ఏంచేత? స్త్రీలు రాజకీయరంగంలో పని చేయడం గురించి మీ అభిప్రాయం ఏమిటి?'' అనడిగాను.

''నేను కూడా అవసరంపడ్డప్పుడు బయటికి వెళ్ళాను.

రజాకార్ ఉద్యమంలో బన్సాలీగారి వెంట వెళ్ళాను. సంగం లక్ష్మిబాయిగారు, మిసెస్ హెడా-వీరితో కలిసి వెళ్ళాను. విజయవాడకు పాదయాత్ర చేశాం. అల్లాగే తెలంగాణా ఉద్యమంలో, ఆవేశంతో పాల్గొన్నాను. ఎప్పుడుగానీ, వారిదీ, నాదీ ఏకాభిప్రాయం మరి.

ఆడవాళ్ళు రాజకీయాల్లో పాల్గొనాలంటే, అన్నిటికీ తట్టుకోగలిగి వుండాలి. కానీ ఇప్పుడు మునుపటిలా కాదు. బాగా సమర్థులైనవారే నెగ్గుకుని రాగలరు.'' అన్నారామె.

''మీవారిని బట్టి మీరు కొంతైనా కమిటీల్లో, ఉద్యమాల్లో పాల్గొనవలసి వుంటుంది కదా?'' అన్నాను.

''నాకు ఏ కమిటీల్లోనూ వుండడం యిష్టం లేదు. పట్టి బలవంతాన, మర్యాద కోసం ఏదో ఫంక్షన్‌కి వెళ్తాను గానీ నాకు దేనిలోనూ ఆసక్తి లేదు. పేరైనా, వూరైనా అన్నీ వారివే. వారి నీడనే నేను.'' అన్నారు శ్రీమతి సావిత్రీ చెన్నారెడ్డి.

సంగీతం, సాహిత్యం, సినిమాలని గురించి ఆమెకు ఆసక్తివుందా అనడిగితే.- ''చిన్నప్పుడు చదివేదాన్ని కానీ, యిప్పుడు ఇంట్రెస్టు పోయింది. దేన్ని గురించి చదవాలి యిప్పుడు? సినిమాలకుపోతే నాకు నిద్ర వస్తుంది. భక్తి ప్రధానమైన పిక్చరు ఏదైనా వస్తే పిల్లతో కలిసి పోతాను. వెకిలి డ్యాన్సులు, చేష్టలు చూస్తే మాత్రం నేను సహించలేను!'' అన్నారామె నిష్కర్షగా.

—జె. ఆర్.

[ పెద్దకథ : 25వ పేజీ నుంచి ]

కావలసిన పూలన్నీ కోయించాను. మాల కట్టి పెడ తాను.'' అంటున్న శోభాదేవి మాటలతో మళ్ళీ మామూలుగా అయిపోయి, నవ్వుతూ ఆమె ముందు కూర్చుంది హర్షజడ విప్పుకుంటూ.

హర్షకు జడ వేస్తుంటే, పూలు పెడుతుంటే, ఏదో తెలీని తృప్తి ఆనందం శోభాదేవికి. తమకు యింక పిల్లలు పుట్టే యోగం లేదు. అది దినేష్ పుట్టగానే తెలిసింది. అందుకే దినేష్‌ను అపురూపంగా పెంచుకున్నారు.

దినేష్ యిండియా వచ్చి త్వరగా పెళ్ళి చేసుకుంటే మనవరాలినైనా ఎత్తుకుని మురిసి పోవాలని వుంది. అందుకే వాడి రిసెర్చి ఎప్పటికి పూర్తవుతుందో, ఎప్పటికి తిరిగి వస్తాడో అనుకుంటూ వుంటుంది. ఆడపిల్లలంటే ఆమె కున్న ముచ్చట తీర్చే చిన్నపిల్లలెవరూ దొరకలేదు ఆమెకు. ఇన్నాళ్ళకు హర్ష దొరకడంతో, మనసులో మరుగున పడిన కోరికలు తలలెత్తుతున్నాయి. హర్షను అలంకరించి అందంగా చూసుకోవాలనిపిస్తోంది.

హర్షకూ శోభాదేవి ఆదరణ — ఎప్పుడో చనిపోయిన తల్లిని గుర్తుకు తెస్తుంటే మౌనంగా ఆవిడ చేసే అలంకరణలన్నీ స్వీకరించుకుంటుండేది. రావుగారు వచ్చేవరకూ ఆ యింటికి సర్వాధికారిణిలా ఆ యింట్లో తిరిగే హర్ష, ఆయన రాగానే జారుకునేది. శోభాదేవి ఎంతో ఆపాలని ప్రయత్నించినా ఆగేదికాదు.

*

ఆ రోజు రోజూ కంటే ముందుగా ఆఫీసు నుంచి వచ్చేసిన రావుగారికి, గుమ్మంలో అడుగు పెడుతూనే సోఫాలో వాలుగా పడుకొని, స్టీరియో నుంచి వినిపిస్తున్న పాటకు అనుగుణంగా గొంతు కలిపి పెద్దగా పాడుతున్న హర్ష హాల్లోనే దర్శనమిచ్చింది.

ఎప్పుడు ఎదురుపడినా బిడియంగా తప్పుకొని పారిపోయేది హర్ష. హర్షను గురించిన కబుర్లు శోభ ద్వారా వినడం తప్ప హర్షతో స్వయంగా ఎప్పుడూ మాట్లాడే అవకాశం కలగలేదు. 'కలక్టర్ అంటే దెయ్యమో భూతమో అనుకుంటుందా హర్ష?' అనేవారు రావుగారు.

"ఏమో దానికలాగే కనిపిస్తున్నారేమో!'' అంటూ చిలిపిగా నవ్వేది శోభాదేవి.

బూట్లు టకటకలాడించుకుంటూ హడావుడిగా హాల్లో అడుగుపెట్టిన రావుగారిని చూసి వులిక్కిపడి, పాట తక్కున ఆపేసి, లేచి నుంచుని పారిపోవడానికి ప్రయత్నిస్తున్న హర్ష-పెదవులు సన్నగా కంపిస్తుండగా, సిగ్గుతో ఎర్రగా గులాబీల్లా మారిన బుగ్గలను రాసుకుంటూ ఏం చేయాలో ఎలా తప్పించుకోవాలో, తోచని అయోమయ పరిస్థితిలో చిక్కుబడిపోయింది.

హర్ష లేవగానే వెనక్కెళ్ళి నవ్వుతూ గుమ్మాని కడ్డంగా నుంచున్న రావుగారిని దాటుకునిపోయే అవకాశంలేదు. లోపలి కెళ్ళి వంటగదిలో నుంచి పారిపోదామంటే ఆయన ఏమనుకుంటారోనని భయం. తను ఆ యింట్లో అంత చనువుగా తిరుగుతుందని ఆయనకు తెలుసోతెలీదో! ఏం చేయాలో తోచని సంకట పరిస్థితి. ముందుకూ పోలేదు వెనక్కూపోలేదు.

మౌనాన్ని భంగం చేస్తూ మళ్ళీ లోపలికి రెండడుగులు వేసిన రావుగారు చిన్నగా నవ్వుతూ-"ఇంత లాభం లేదు కూర్చో హర్షా! నిలబడిపోయావేం!'' అంటూ తనూ ఓ సోఫాలో కూర్చున్నారు.

తప్పనిసరిగా సోఫాలో కూలబడ్డ హర్ష ఓసారి కళ్ళెత్తి రావుగారివైపు చూసింది ధైర్యంచేసి.

అందంగా టక్ చేసిన వైట్ పాంటూ షర్టూ; తెల్లటి గీతలున్న బ్లూ కలర్ టై; అందంగా ముఖాన అల్లల్లాడుతున్న వుంగరాలు తిరిగిన క్రాపూ. మచ్చుకైనా ఒక్క వెంట్రుక కూడా తెల్లబడలేదు. నవ్వుతున్నప్పుడు కొద్దిగా వంపు తిరిగే ఆ పెదాలూ, అవన్నీ అలా అంత దగ్గరగా చూస్తుంటే.... హర్షకు ఓ అద్భుత సౌందర్య మూర్తిని చూస్తున్న భావన.

ఆయనలో వయసు తెచ్చిన మార్పు లేమీలేవు. పాతిక ముప్ఫై ఏళ్ళ యువకులెవరూ ఆయనకంటే అందంగా ఆరోగ్యంగా వుండరు. వుండలేరు. ఆయన వయసును మోసం చేసిన వ్యక్తి. రెప్ప వాల్చకుండా తనవైపే చూస్తూ ఏదో తన్మయంలో మునిగిపోయిన హర్ష ముఖభావాలకు ఏదోలా అయిపోయిన రావుగారు—

"శోభా! కాఫీ!'' అంటూ కేకేశారు. టై విప్పుకుంటూ. సర్దుకొని కూర్చుంటూ నెమ్మదిగా కళ్ళు వాల్చేసిన హర్ష అంతసేపూ ఆయన్నలా చూసిన తన తెలివి తక్కువతనానికి కించపడుతూ మౌనంగా తల వంచుకొని కూర్చుంది.

పెద్దపెద్ద కనురెప్పలు క్రిందకు వాల్చి బుద్ధిగా కూర్చుని అరచేతులు రుద్దుకుంటున్న హర్షనూ, నెమ్మదిగా బూట్లు విప్పుకుంటున్న రావుగారినీ, చూసి నవ్వుతూ వచ్చిన శోభాదేవి—

"ఏం హర్షా! ఒక్కసారే అలా మూగదానివై పోయావేం! మీ అంకుల్‌ను చూస్తే మాటలు రావడం లేదా! ఇప్పటివరకూ హాలు కప్పు లేచిపోయేట్లు పాటలు పాడిందండీ!'' అంటూ ఓ కప్పు రావుగారికిచ్చి మరో కప్పు హర్ష ముందుంచి, తనో కప్పు తీసుకుంటూ కూర్చుంది.

సిగ్గుగా తల మరింత వంచేసిన హర్ష - పెదాల మీద విరిసీ విరియని నవ్వుతో నెమ్మదిగా లేచి నుంచుని—

"ఆంటీ! యింక నేనింటికి వెళతాను. నాన్న గారు వచ్చే టైమైంది.''

"కాఫీ తీసుకో హర్షా! వెళ్ళొచ్చులే! మీ నాన్నగారు యిప్పుడే రారని నాకు తెలుసులే. ఒక్కదానివీ బిక్కుబిక్కుమంటూ వుండాలి'' అంటూ హర్ష చేయి పట్టుకొని కూర్చోబెడుతూ రావుగారి వైపు తిరిగి -

"ఏవిటీ రోజు దొరగారు వెందలాడే వేంచేశారే! క్లబ్బు మిత్రులెవరూ తగల్లేదా?'' అంది నవ్వుతూ.

"అలాగేం కాదు లేవమ్మా! ఈరోజు ముందుగా రావాలనే వచ్చాను. చాలా రోజుల్నుంచీ సినిమా కెళ్ళాలనుకుంటుంటే తీసుకెళ్ళడం లేదని సణుగుతున్నావు కదా అందుకని. త్వరగా తయారవండి పిక్చర్ కెళదాం. ఈలోపు డ్రైవర్‌ను పంపి టికెట్స్ తెప్పిస్తాను'' అంటూ నవ్వుతూ కప్పు టీపాయ్ మీద పెట్టి లోపలికెళుతున్న రావుగారివైపు చూసి, తన కప్పు కూడా టీపాయ్ మీద పెట్టేసి దిగ్గున లేచి—

"ఆంటీ : మరి నే వెళ్ళొస్తాను. మీరు పిక్చర్ కెళ్ళండి.'' అంటున్న హర్షను వారిస్తూ—

"నో! నో! అలా వీల్లేదు. మధ్యాహ్నమేగా చెప్పావు ఈ రోజు నాన్నగారు రాత్రి పదకొండు గంటలకుగానీ రారని. పద అంకుల్ రమ్మంటున్నారుగా, నువ్వూ మాతోపాటు పిక్చర్‌కు రా. మీ నాన్నగారికి మాలి చెపుతాడులే.''

"ఆంటీ!''

"మరేం మాట్లాడకు. వెళ్ళి ముఖం కడుక్కో'' అంటూ బాత్‌రూంవైపు తోసింది శోభాదేవి.

తప్పనిసరిగా ముఖం కడుక్కుని వచ్చిన

హర్షకు జడవేసి తలనిండా జాజిపూలు తురిమి తన ప్రక్కనే కూర్చోబెట్టుకొని తృప్తిగా చూసుకుంటున్న శోభాదేవిని రావుగారు హెచ్చరించడంతో తనూ లేచి డ్రస్ మార్చుకొని వచ్చింది. ఈలోపల రావుగారు అడిగిన ప్రశ్నలకు సమాధానాలు చెబుతూ కూర్చున్న హర్షకి బెరుకు తగ్గింది. ఆయనంటే వున్న అభిమానం ఆయనతో మాట్లాడిన తర్వాత మరింత పెరిగింది.

"హర్షా యిలారా!" అంటూ బెడ్‌రూమ్ నుంచి కేక వేశారు శోభాదేవి.

"ఇప్పుడే వస్తాను అంకుల్" అంటూ లోపలికెళ్ళింది హర్ష.

బీరువా ముందు నుంచుని చీరలవైపు, హర్షవైపూ చూసిన శోభాదేవి—

"హర్షా! నువ్వీ చీర కట్టుకో బావుంటుంది" అంటూ హర్ష వొంటిమీద వున్న బ్లూ జాకెట్‌కు మాచ్ అయ్యే బ్లూ మీద ఎరుపూ తెలుపూ కలిపి ఎంబ్రాయిడరీ చేసిన షిఫాన్ చీర ముందుకు జరిపింది.

ఆ చీరను ఓసారి చేతుల్లోకి తీసుకొని దాని మెత్తదనాన్ని స్పృశించి చూచిన హర్ష-

"వద్దు ఆంటీ. నేనిలాగే వస్తాను. నాకు యింత మంచి చీర వద్దు. మీరు మరోలా అనుకోకండి." అంటూనే అభిమానంగా వెనక్కు తిరిగిన హర్ష భుజం పట్టుకొని ఆపుతూ—

"హర్షా! నా దగ్గర యిలాంటి చీరలు చాలా వున్నాయి. ఇవి యిప్పుడు నేనెలాగూ కట్టలేను. ఎవరో ఒకళ్ళు కట్టుకుంటే నయం కదూ—అలా బీరువాలో పడేసి వుంచే కంటే. నాకు ఆడపిల్లలెవరూ లేరు. వుంటే వాళ్ళు నీలా అని వుండేవాళ్ళు కారు. నీకు బలవంతంగా కట్టించాలని నా అభిమతం కాదు. ఇది నువ్వు కట్టుకుంటే నాకు తృప్తి. నీకిష్టం లేకపోతే వద్దు." అంటూ బయటకు అడుగులువేసిన శోభాదేవిని చూస్తూ— కళ్ళలో చిప్పిల్లిన నీటిని నెమ్మదిగా చేతుల్తో అద్దుకొని మౌనంగా ఆ చీర తీసుకొని కట్టుకుంది హర్ష.

ఎదురుగా డ్రెస్సింగ్ మిర్రర్‌లో కనిపిస్తున్న తన రూపం తనకే క్రొత్తగా అనిపించింది.

హాల్లో సోఫాలో కూర్చొని మాట్లాడుకొంటున్న రావుగారూ, శోభాదేవి యిద్దరూ, ఆ చీర కట్టుకొని బయటకు వచ్చిన హర్షవైపు రెప్పవాల్చకుండా చూశారు. శోభాదేవి కళ్లు తృప్తిగా మెరిశాయి.

రావుగారి కళ్ళు వో క్షణం ఆ అద్భుత సౌందర్యాన్ని చూసి వెలిగినా, అంతలోనే ముకుళించుకుపోయింది హృదయం. శోభ బాధ అర్థమైన ఆయనకు ఆమె హర్ష మీద అంతటి ఆత్మీయత పెంచుకోడం ఎందుకో మంచిది కాదేమో అనిపించింది. ఎంతైనా పరాయిపిల్ల తమ పిల్ల కాదు గదా! అనుబంధాలు పెంచుకుంటే తెంచుకోలేక శోభ బాధపడాల్సి వస్తుందేమోనని ఆయన భయం.

పిక్చర్ చూస్తున్నంతసేపూ హర్షకు అందులోని హీరోని తన అంకుల్ రావుగారితో పోల్చుకోడం, చివరకు ఆ హీరోకంటే అంకుల్ ఎన్నో రెట్లో బావున్నారనే నిర్ణయానికి రావడం జరిగింది.

అలా రెండు మూడు సందర్భాల్లో వాళ్ళతో కలసి బయటకు వెళ్ళడం వారితోపాటే భోం చేయడం వీటితో హర్ష పరాయిపిల్ల అన్న భావనే లేకుండా పోయింది శోభాదేవిలో. రావుగారితో కూడా కూర్చుని చర్చలకు దిగే హర్షను చూస్తే ముచ్చట వేసేది.

దానికి తగ్గట్టు పుస్తకాల పురుగు హర్ష. సాహిత్యమంటే మొదటినుంచీ ఉత్సాహం ఎక్కువైన రావుగారు—యింట్లో పెద్ద లైబ్రరీయే పెట్టుకున్నారు. రోజూ ఓ పుస్తకం చదవడం దానిలో పాత్రల గురించి తనకు తెలిసిన భాషలో ఆయనతో వాదించి తన మాట నెగ్గించుకోడానికి ప్రయత్నం చేయడం హర్ష ముఖ్యమైన పనుల్లో ఒక పని. కొంచెం సేపు సరదాగా వాదించినా హర్షను నొప్పించడం యిష్టం లేక హర్షకు అనుకూలంగా చివరికి వాదాన్ని అంగీకరించి, అంకుల్ ఓడిపోయారని మెరిసే కళ్ళతో చూస్తూ పకపకానవ్వే హర్షను మరింత నవ్వించి, చూడటం రావుగారికి ఓ దిన చర్యగా మారిపోయింది.

దినేష్ అమెరికా వెళ్ళిపోయిన తర్వాత ఆ ఇంట్లో గూడు కట్టుకున్న నిశ్శబ్దం హర్ష కిలకిల నవ్వులతో, రోజూ సాయంత్రం రావుగారి తోటలో కుర్చీలు వేసుకొని కూర్చుని చేసే చర్చలతో, కాలం అతి త్వరగా పరుగులు తీస్తోంది. శోభాదేవికి యిప్పుడు తోచక పోవడమన్న సమస్య లేదు. కావల్సినంత కాలక్షేపం హర్ష. తండ్రి ఆఫీసుకెళ్ళగానే రావుగారింట్లో వచ్చి వాలేది.

సాయంత్రం రోజూ వంట చేసే వచ్చి ఏ పది గంటలకో తండ్రి రాగానే వాళ్ళింటికి చేరుకునేది. అప్పుడప్పుడు ఏవైనా బయటకెళ్ళే కార్యక్రమాలు వుంటే తండ్రికి ముందే చెప్పి ఆ రాత్రికి రావుగారింట్లో దినేష్ రూమ్‌లో పడుకునేది. హర్ష తండ్రికి కూడా యిప్పుడు రాత్రి ఎంత ప్రొద్దుపోయొచ్చినా హర్ష ప్రశ్నలకు జవాబులు చెప్పే బాధ తప్పింది. హాయిగా ఏ ఫ్రెండ్‌తోనో కూర్చుని పేకాడుతూ తెల్లవార్లూ అక్కడే వుండిపోయినా యిప్పుడు హర్షను గురించిన భయం లేదు. రావుగారింట్లో సురక్షితంగా వుంటుందన్న ధైర్యం అతనికి ఓ నిశ్చింతను కలిగిస్తోంది. [సశేషం]

## చిల్డ్రన్స్ చార్టర్



బాలల హక్కులను పరిరక్షించడానికి ప్రప్రథమంగా 1942లో 19 దేశాలకు చెందిన విద్యావేత్తలు లండన్‌లో సమావేశమయ్యారు. వారు రూపొందించిన చార్టర్‌లో ఆరు ప్రధానాంశాలు వున్నాయి. అవి:

1. బాలల వ్యక్తిత్వ వికాసమన్నది పవిత్రమైనదిగా భావించాలి. బాలల ముఖ్యావసరాలలో చక్కటి విద్యా విధానం కూడా ఒకటి అన్నది మరువకూడదు.
2. ప్రతి బాలునికి/బాలికకు, సరైన ఆహారం, బట్ట, యోగ్యమైన నివాస స్థలం - వీటిని కల్పించాల్సిన బాధ్యత ఆ దేశం మీద వుంది. అంతేకాదు - అవే తాము నిర్వహించవలసిన ప్రప్రథమ కార్యక్రమాలుగా ఆయా దేశ ప్రభుత్వాలు భావించాలి.
3. ప్రతి బాలునికి/బాలికకు వైద్య సదుపాయాలు కల్పించాలి.
4. బాలలందరికీ కూడా తమ విజ్ఞానాన్ని పెంపొందించుకునేందుకు అన్ని అవకాశాలు అందుబాటులో వుండేటట్లు చూడాలి.
5. పిల్లలకి ఉదయం నుంచి సాయంత్రం దాకా వుండే పాఠశాలలు తెరిపించాలి.
6. సంస్కృతికి, నైతిక విలువలకీ సంబంధించిన శిక్షణ కూడా పిల్లలకు లభించేటట్లు చూడాలి.

# 'సంక్రాంతి'కి స్వీట్సు



మిల్క్ బర్ఫీ :

## మలాయ్ టోస్ట్ :

కావలసిన పదార్థాలు : 8 బ్రెడ్ స్లైసులు, 3 కప్పుల పాలు, $\frac{3}{4}$ కప్పు పాలకోవా, 1 కప్పు పంచదార, ఏలక్కాయలు 4, జీడిపప్పులు 12, 1 $\frac{1}{2}$ టేబుల్ స్పూను నెయ్యి.

ముందుగా బ్రెడ్ ముక్కల్ని ముక్కోణం ఆకారంలో కోసుకోవాలి. ఈ త్రికోణం ఆకారం బ్రెడ్ ముక్కలకి రెండు వైపులా నెయ్యిరాయాలి. స్టవ్‌మీద తావా పెట్టి, ఆ తావామీద బ్రెడ్ ముక్కల్ని బంగారు వన్నె రంగు (రెండు వైపులా) వచ్చేదాకా వేయించుకోవాలి. వీటిని విడిగా తీసివుంచుకోవాలి. జీడి పప్పుల్ని కూడా



మలాయ్ టోస్ట్

విడిగా వేయించి వుంచుకోవాలి.

ఆ తరువాత పాలకోవా, పంచదార కలిపి ఒక పాత్రలోకి తీసుకుని స్టవ్‌మీద వుంచాలి. ఈ మిశ్రమం చిక్కగా అయ్యేదాకా ఆ విధంగా స్టవ్ మీదే వుంచాలి. ఇక యిప్పుడు బ్రెడ్ ముక్కలని పాలకోవా–పంచదార మిశ్రమానికి కలపాలి. బాగా వుడికేదాకా–10 నిమిషాలసేపు ఈ బ్రెడ్ ముక్కల్ని ఆ మిశ్రమంలో స్టవ్ మీద వుంచాలి. అలా వుడుకుతున్నప్పుడు వీటికి ఏలక్కాయల పొడి చేర్చాలి.

బ్రెడ్ ముక్కల్ని జాగ్రత్తగా తీసి ఒక పెద్ద పళ్ళెం తీసుకుని అందులో అమర్చుకోవాలి. వీటి మీద చిక్కగావున్న పాలను బ్రెడ్ ముక్కల చివరంటా అంటేటట్లుగా పోసుకోవాలి. ఈ బ్రెడ్ ముక్కలమీద, వేయించి వుంచుకున్న జీడిపప్పులు అమర్చితే, చూడ ముచ్చటగానూ, తినడానికి రుచిగానూ వుంటాయి.

మిల్క్ బర్ఫీ :

కావలసిన పదార్థాలు : 1 కప్పు పాలు, ¼ కిలో పాలకోవా, రుచికి కాస్త పంచదార, జీడిపప్పు ముక్కలు కొన్ని, రంగుల హంగులు వుంటే బాగుంటుందని అనుకునే వాళ్ళు వాళ్ళకి కావలసిన రంగు–(Food colour) వుపయోగించవచ్చును.

పాలకి కోవా, పంచదార కలిపి బాగా కలియ బెట్టాలి. ఈ మిశ్రమాన్ని ఒక పెద్ద బాణలిలోకి తీసుకుని సన్నటి సెగమీద వుంచాలి. చిన్నచిన్న వుండలుగా చేసుకోగలిగేంతవరకూ ఈమిశ్రమాన్ని కలియబెడుతూ వుండాలి. ఇప్పుడు దీనికి మనకి కావలసిన రంగు కలిపి మళ్ళీ కలియబెట్టాలి. నెయ్యి పూసిన పళ్ళెంమీదకిగాని కంచంలోకిగాని ఈ మిశ్రమాన్ని వంపుకోవాలి. కొద్దిసేపు ఆ విధంగానే వుంచితే చల్లారిన తరువాత అది గట్టిపడుతుంది.

ఇప్పుడు మిల్క్ బర్ఫీ తయారై సిద్ధంగా వుందన్నమాట. ఈ బర్ఫీని మనకి కావలసిన ఆకారాల్లో కోసుకోవచ్చును. వీటిపైన జీడి పప్పులను అమర్చి తింటే రుచిగా వుంటాయి.

మలాయ్ టోస్ట్, మిల్క్ బర్ఫీ రెండు కూడా పాలతో చేసినవే కాబట్టి బలవర్ధకమైనవి. వీటిని తినడానికి పిల్లలు కూడా ఎంతో యిష్టపడతారు. పండగలనేవి పిల్లల సరదాలు తీర్చటానికి కూడా కాబట్టి, మీరు వాళ్ళకి యివి చేసిపెడతారు కదూ!





## నిధి సేకరణ

ప్రతి జిల్లా కేంద్రంలోనూ బాల భవన్‌లు నిర్మించి, పోషకాహార కార్యక్రమ నిధులను లక్ష యాభై వేల నుంచి రెండు లక్షల ఎనభై వేల వరకు విస్తరింపచేయాలని మన రాష్ట్ర ప్రభుత్వం సంకల్పించింది! ఇందుకు కావలసిన నిధులు సేకరించడానికి గుర్రపు పందాలను, రాఫిల్‌ను నిర్వహించదలచుకున్నట్టూ, సినిమా టిక్కెట్ల మీద సర్‌చార్జి విధించదలచుకున్నట్టూ రాష్ట్ర స్త్రీ సంక్షేమ శాఖా మంత్రి శ్రీమతి రోడామిస్త్రీ వెల్లడించారు. 'బాలల సంవత్సరం' సందర్భంగా బలహీనవర్గాల బాలల పురోగతి కోసం మన రాష్ట్ర ప్రభుత్వం చేపట్టదలచిన పథకాలలో ఇది ఒకటి!



పిల్లల సంరక్షణ కోసం ప్రారంభించబడిన మొట్టమొదటి సంస్థ – 1884లో బెంజమిన్ వాఘ్ స్థాపించిన 'నేషనల్ సొసైటీ ఫర్ ది ప్రివెన్షన్ ఆఫ్ క్రూయల్టీ టు చిల్డ్రన్'. బాలలపై హింసాత్మక చర్యలను నిరోధించడానికి జాతీయ స్థాయిలో ఇంగ్లండులో వెలసిన సంస్థ యిది. మనదేశంలో పిల్లల సంక్షేమం దృష్ట్యా తొలిసారిగా–ఒక చట్టం అంటూ ఏర్పడింది – తమిళనాడులో. 1920 లో అప్పటి సంయుక్త మద్రాసు రాష్ట్రంలో 'మద్రాసు చిల్డ్రన్స్ ఏక్ట్స్' పేరిట ఈ చట్టం అమలులోకి వచ్చింది.

మదర్ పేణీలు (స్వీటు)

కావలసిన వస్తువులు : మంచి మైదా—¼ కేజీ బొంబాయిరవ్వ - ½ కేజీ పంచదార-150 గ్రాములు వెన్న లేక నెయ్యి - 150 గ్రాములు బియ్యపుపిండి అర (½) గిద్దెడు ఉప్పు–స్పూను

చేయవలసిన పద్ధతి :–ఈ స్వీటు తయారు చేయటానికి రెండు గంటల ముందుగా రవ్వను శుభ్రంగా బాగుచేసుకొని కొద్దిగా ఉప్పు కలిపి పూరీపిండిలా కలిపి పెట్టుకోవాలి. పంచదారను మెత్తగా పొడి చేసుకొని ఉంచుకోవాలి. మెత్తని బియ్యపు పిండిలో వెన్నపూస లేక నెయ్యి కలిపి పెట్టుకోవాలి. నానబెట్టిన రవ్వముద్దను రోటిలో వేసి మెత్తగా కుమ్మాలి. ఈ పిండిని కొంచెం లావుగా పూరీ కన్న కొద్దిగ పెద్ద సైజులో గుండ్రంగా చేసి, కలిపి ఉంచుకున్న వెన్నపూస ముద్దను పూరీనిండా రాసి మరల పైన పూరీ వేయాలి. ఇలా 3 సార్లు చేసిన తరువాత గుండ్రంగా చుట్టి ముక్కలుగా కోయాలి. పిండి మొత్తాన్ని ముక్కలుగా చేసి, నూనెను మరగనిచ్చి ఈ ముక్కను కొద్దిగా పొడవుగా నొక్కి నూనెలో వేయాలి. వేగినతరువాత తీసి పంచదార పొడిని దానిపై చల్లాలి.

వీటినే 'మదర్ పేణీలు' అంటారు. ఇవి తినటానికి – రుచిగా ఉండి, ఎన్ని రోజులైనా నిలువ ఉంటాయి.



సగ్గుబియ్యం వడలు

కావలసిన వస్తువులు : సగ్గు బియ్యం - ¼ కేజీ పెరుగు - ½ (అర్ధశేరు) బియ్యపు పిండి - ¼ కేజీ ఉల్లిపాయలు-4 పెద్దవి; పచ్చిమిర్చి - 10–అల్లం చిన్న ముక్క; నూనె - ¼ కేజీ ఉప్పు – తగినంత (3 స్పూన్సు) కొత్తిమిరి కొద్దిగా.

చేయవలసిన పద్ధతి:- రెండు గంటల ముందుగా సగ్గుబియ్యాన్ని పెరుగులో నానబెట్టాలి. ఉల్లిపాయలు, పచ్చిమిర్చి, అల్లం, కొత్తిమిరి సన్నగా తరిగి పెట్టుకోవాలి.

ఈ తరిగిన ముక్కలను, బియ్యపు పిండిని, నానబెట్టిన సగ్గు బియ్యంతో కలిపి ఉప్పువేసి ముద్దగా చేసి మరిగిన నూనెలో చిన్న చిన్న గారెలుగా వేసుకోవాలి.

పెరుగులో నాని ఉండటం వల్ల సగ్గు బియ్యం ఉబ్బి అవి కరకరలాడుతూ తినటానికి రుచిగా ఉంటాయి.

—వై. వెంకటేశ్వరమ్మ

# బొమ్మగారి పేజీ

విన్నారర్రా—

ఈ కొత్త సంవత్సరాన్ని మన సాంఘిక సేవా సంస్థలన్నీ 'అంతర్జాతీయ బాలల సంవత్సరం'గా గుర్తించి-పిల్లల వికాసానికీ, ఆరోగ్యానికీ, చదువుకీ ఎక్కువగా కృషి చేస్తాయట. అవును మరి! బాలల ఆరోగ్యం ఇవాళ బాగుంటేనే గదా— రేపటి పెద్దల ఆరోగ్యం బాగున్నట్టు!....అప్పు డప్పుడైనా ఇలాంటివి ఏర్పాటు చేస్తూవుంటే, దేశానికీ, తద్వారా ప్రపంచానికీ ఎంత మేలు!!

అయితే,

ఈ సందర్భంలో నేను కూడా పిల్లలకు సంబంధించి-కొన్ని విషయాలు చెబుతానర్రా. అంటే వాళ్ళని ఎలా పెంచాలి? ఎలా బుద్ధిగా వుండమని చెప్పాలి?—అనికాదు, అవన్నీ మీకూ బాగా తెలిసిన విషయాలే.

మరేమిటీ—

ఎదుగుతున్న పిల్లలకి ఎన్నో విషయాలు తెలుసుకోవాలని వుంటాయి. వాళ్ళలో తెలుసుకోవాలన్న తపన ఎక్కువగా వుంటుంది. కాని, మనం ఏంచేస్తాం— వాళ్ళు అడగ్గానే కొట్టిపారేస్తాం— "చచ్చు ప్రశ్నలూ నువ్వూనూ" అని. దాంతో వాళ్ళు వూరుకుంటారు. మళ్ళీ ఎప్పుడైనా ఏదైనా సందేహం వచ్చినా, అడగడానికి వెనకాడతారు. అంచేత, వాళ్ళేది అడిగినా, మనం ఓపిగ్గా వాళ్ళకి అర్థమయేలా విడమరచి చెప్పాలి. దానివల్ల వాళ్ళు కొత్త సంగతులు ఎన్నో తెలుసుకోగలుగుతారు.

పిల్లల విషయంలో పెద్దవాళ్ళు చేస్తున్నది నాకొకటి నచ్చదర్రా—ఏమిటనుకున్నారు? రాత్రి పూట వాళ్ళకి దెయ్యాల కథలు, భూతాల కథలూ చెప్పడం! అయితే, అలాంటి కథలు వినడానికి వాళ్ళకి ఉత్సాహంగానే వుంటుందనుకోండి—ఏదో ఒక భయం, ఉద్రేకం కలుగుతూ వుంటాయి గనక, మానసికమైన ఆ ఉద్రిక్తత కోసం వాళ్ళు అలాంటి కథలు వినడానికి ఉత్సాహం చూపిస్తారు. కాని, అది మంచి పద్ధతి కాదు. పిల్లలకి కథలు చెప్పాలి! అయితే, ఇలాంటివా-ఇవి చెప్పకూడదు. మామూలుగా, సరదాగా వుండేవీ నీతిదాయకమైనవీ కథలు చెప్పాలిగాని-"ఒక పెద్ద దెయ్యం వచ్చింది-దానికి ఇంతంతకళ్ళు...." అంటూ వర్ణించి చెప్పకూడదు. అవి, పసివాళ్ళ మనసుల్లో అలజడి కలిగిస్తాయి. ఇహ ప్రతిదానికి 'దెయ్యం అని దడుసుకునే ప్రమాదం వుంది. అది బుర్రలో ప్రవేశించి, రాత్రి నిద్దట్లో కొందరు భయపడతారు కూడా!

అయితే మామూలుగా పిల్లలకి నిద్రలో ఏవో కలలు వస్తాయి; వాటికి వాళ్ళు భయపడతారు; ఉలిక్కిపడి లేచి, ఏడుస్తూ కూచుంటారనుకోండి-అది మామూలే. దానికితోడు ఇలాంటి కథలు కూడా విన్నారంటే, అవే వాళ్ళకి కలల్లో కనిపించవచ్చు. అంచేత, అలాంటి ఉద్రిక్తతను పిల్లలకు మనం కలిగించకూడదు.

మరి—

పిల్లల్ని ఆడుకోడానికి వెళ్ళనిస్తూ వుండాలి. కాని, ఆడుకునే చోట్లు ఎలాంటివో చూసుకోవాలి. మేడల మీద, డాబాల మీద పిల్లలు ఆడుకోడం ప్రమాదం. అనుకోకుండా వాళ్ళు పిట్ట గోడలెక్కుతారు; జారిపోతారు. లేదా, కంగారు కంగారుగా మేడమెట్లు దిగుతూ పడిపోతారు. అంచేత, ఇలాంటి చోట్లలో వాళ్ళని ఆడనివ్వనేకూడదు. అందుకే కొందరు మేడ మీద వరండాల్లోనూ, డాబాల పక్కనా కంచెల్లాంటివి వేయిస్తారు. అవి దాటి రావడానికి వాళ్ళు ప్రయత్నించరు గనక, అవి వాళ్ళని రక్షిస్తాయి. అలాగే వాళ్ళని ఒంటరిగా స్నానాల గదుల్లోకీ, వంట ఇళ్ళల్లోకీ వెళ్ళనివ్వకూడదు. వీధి తలుపులు వేసి వుంచకపోతే, వీధిలోకి వెళ్ళిపోతారు. మందులు, మాకులూ, సీసాలూ, అద్దాలూ ఇలాంటివేవీ అందుబాటులో వుంచకూడదు. ఒకవేళ వుంచితే, అలమార్లలో వుంచాలి; వాటికి తాళాలు వెయ్యాలి. పిల్లలు అనుక్షణం ఇలాంటి ప్రమాదకరమైన స్థలాల్లో మసలుతూ వుంటారు, చూశారా!

కొద్దికొద్దిగా నడవడం వస్తున్న పిల్లలు అల్లరి చేస్తున్నట్టు కనిపిస్తారు. అంచేత, వాళ్ళని తలిదండ్రులు కేకలు వెయ్యడం, తిట్టడం చేస్తూ వుంటారు. అది మంచి విధానం కాదు. ఆ వయసులో వాళ్ళు పెద్దవాళ్ళని అనుకరిస్తారు. తల్లి గిన్నెలు కడిగితే, వాళ్ళూ కడగాలనుకుంటారు. మొక్కలకి నీళ్ళు పోస్తే వాళ్ళూ పొయ్యాలని ప్రయత్నిస్తారు. అలాగే, పెద్దవాళ్ళలా తామూ మాట్లాడాలని "తత్తత్త" అని ఏదో అనేస్తూ వుంటారు.

పిల్లలు మాట్లాడ్డం నేర్చుకున్నప్పట్నుంచీ, ఏడుపు తగ్గిపోతుంది. అయితే అలాంటప్పుడు వాళ్ళకి ఏదో నేర్పేయాలని మనం ఏంచేస్తాం—"అలా కాదు - ఇలా" అంటాం. "ఇలా చెప్పు" అంటాం. అప్పుడే వాళ్ళు పూర్తిగా ఏదీ చెప్పలేరు.

ప్రయత్నిస్తారు. మనం పదిసార్లూ వాళ్ళ చేత, ఆ వయసులో చెప్పించాలనుకోకూడదర్రా. దాంతో వాళ్ళ ఓర్పు నశించిపోతుంది. అంచేత, వాళ్ళేదైనా అంటే, చిరునవ్వు నవ్వి, తల వూపితేచాలు.

పిల్లలు బాగా నిద్రపోవాలి. కొందరు తల్లులు చూశారా-రాత్రి వేళల్లో పక్క యిళ్ళకి వెళ్ళి ఏదో బాతాఖానీ కొడుతూ వుంటారు. అలాంటప్పుడు పిల్లల్ని తీసుకెళ్తారు. 'నిద్దరొస్తోంది' అని పిల్లలంటే, వాళ్ళ మీద విసుక్కుంటారు. ఇవన్నీ మంచి పద్ధతులంటారా?—

వాళ్ళని చక్కగా నిద్రపోనివ్వాలి. రెండో ఆట సినిమాలకి వాళ్ళనీ తీసుకెళ్ళడం, అక్కడ వాళ్ళు వాళ్ళో పడుకుని నిద్రపోకపోతే. విసుక్కోడం, చిరాకుపడడం—ఏం పద్ధతీ?

అయితే, ఇంకోటుందర్రా-మరి కాస్త వయసు వస్తున్న కొద్దీ పిల్లలు దూకడం, చెట్లు ఎక్కడం సైకిలు తొక్కాలనుకోడం - ఇవన్నీ చేస్తూ వుంటారు. దానికీ మనం కేకలు వెయ్యకూడదు. వాళ్ళు చెట్టు ఎక్కుతానంటే ఎక్కనివ్వాలి. అయితే, ఎలా ఎక్కాలో చెప్పాలి. ఎక్కుతున్నప్పుడు 'ఇలాగా' అని నేర్పాలి, ఎక్కుతున్నప్పుడు, జాగ్రత్తగా వాళ్ళని గమనించాలి. అంతే గాని, 'వొద్దురా-పడిపోతావూ" అని వీపుమీద ఛెళ్ళుమని చరవకూడదు. వాళ్ళకి ఏమేం ఇష్టంగా వుంటాయో గమనిస్తూ, వాటిల్లో మంచివాటిని ప్రోత్సహించాలి. ఆటలు ఆడించాలి; సైకిలు తొక్కడం నేర్పాలి; ఈతకొట్టడం నేర్పాలి. అయితే, మనం ఎవరమూ లేకుండా వాళ్ళు ఈతకొట్టకుండా చూడాలి; సైకిలు తొక్కకుండా చూడాలి. అది ముఖ్యం!

ఇలాంటి వెన్నో వున్నాయి. మరి, ఇవన్నీ చూసుకుంటూ పిల్లల్ని జాగ్రత్తగా పెంచాలి. మనకి ఓపిక, తీరిక లేదని వాళ్ళేదైనా చేస్తామంటే-గసురుకోవడం మంచిదికాదు. ఒకవేళ ఆ రోజు కాకపోతే, మరో రోజు నేర్పుతాను - అని నెమ్మదిగా నచ్చచెప్పాలి. నెమ్మదిగా నచ్చజెప్పితే, పిల్లలు ఎంతో శ్రద్ధగా వింటారు.

కదర్రా మరీ— □



# ప్రశ్నలకు జవాబులు

**కొమ్మి నాగమ్మ, పొంగూరుగ్రామం**

బామ్మగారూ! మా యింటి రూపం-క్రింద పొందు పరుస్తున్నాను. ఇందులో వాస్తు విరుద్ధాలు ఏమైనా వున్నాయా? ఉంటే సవరణ తెలుపగోర్తాను. ఇల్లు 77లో ఆరంభించాము. 78లో దిగాము. కాని, చేరిన దగ్గర్నుంచీ ఆర్థికమైన ఇబ్బందులు ఎక్కువయినై. ప్రశాంతంగా లేదు. మనస్తాపాలు ఎక్కువయినై. "దీనికి కారణం వాస్తుశాస్త్ర ప్రకారంగా ఇల్లు లేకపోవడమే" నని ఒకరన్నారు. ఇదంతా దాని ఫలితమేనంటారా?

మీరు చెప్పిన ప్రకారం మీ యింటికి ఏడు ద్వారాలున్నాయి. ఏడు ద్వారాలు వుండడం శాస్త్రరీత్యా మంచిది కాదు. అలా వుంటే, ఋణబాధలు, అనారోగ్యం కలుగుతాయి అని శాస్త్రం చెబుతోంది. దక్షిణంలో ఎరువు గుంట. ఖాళీ ఎక్కువగా వుండడంతో డబ్బు ఖర్చు ఎక్కువ వుంటుంది; అప్పులు చెయ్యక తప్పదు! అలా వుండడం వల్ల - మగ సంతానంలో అవకతవకలు జరగవచ్చని కూడా శాస్త్రంలో వుంది. ఏమైనా, మీరు మీ యింటి ప్లానును విశదంగా ఎవరైనా వాస్తుశాస్త్రజ్ఞునికి చూపిస్తే మరి కొన్ని సలహాలు ఇవ్వగలరు. ప్రస్తుతానికి నేను చెప్పేదేమిటంటే - 7 ద్వారాల్ని 6గా చెయ్యండి; లేదా 8గా చెయ్యండి. దక్షిణంలో వున్న గుంటను కప్పిపెట్టండి. అక్కడ ఏదైనా కొంత మార్పు కూడా చెయ్యండి. స్నానాల గది ఉత్తరపు హద్దును ఆనుకుని వుండడం కూడా మంచిది కాదంటారు. ఏది ఏమైనా, బాగా శాస్త్రం తెలిసినవారికి, దగ్గరుండి ఇల్లంతా చూపిస్తే, వారు కారణాలతో సహా మార్పులు సూచిస్తారు.

**కె. సత్యవాణి, కటక్**

బామ్మగారూ! బయటికి వెళ్ళేటప్పుడు చాలామంది శకునాలు చూస్తారు. అవి ఎంతవరకూ నిజం అవుతాయంటారు?

శకునాలు చూడడం అన్నది మనకి ఎంతో కాలంగా వస్తున్న ఒక సంప్రదాయం. వాటికి ఆధారాలున్నాయా అంటే చెప్పలేముగాని, అదొక నమ్మకం. ఆ నమ్మకం వున్నవాళ్ళకి అవి బాగానే పని చెయ్యొచ్చు. ఏమైనా, మంచి క్షణం, మంచి వేళ - చూసుకుని బయల్దేరడంలో నష్టం ఏమీ లేదుగదా....

**వి. శ్రీలక్ష్మి, జగ్గయ్యపేట**

ప్రతి నెలా స్త్రీ బహిష్టు అయితే, మూడు రోజుల పాటు విడిగా కూర్చుని, నాలుగో రోజు లోపలికొచ్చి పన్లు చేస్తుంది. విడిగా అలా కూర్చోపెట్టడంలో గల అంతర్యం ఏమిటి? బ్రాహ్మణుల ఆచారం ప్రకారం, నాలుగోరోజున స్నానం చేసినా కూడా పన్లు చెయ్యడానికి వారు పనికిరారు. ఈ బహిష్టులోని మంచి చెడ్డలు తెలియజేస్తారా?

ఆ మూడు రోజులూ శరీరానికి మంచి విశ్రాంతి కావాలి. ఐతే, స్త్రీకి. అందులోనూ గృహిణికి విశ్రాంతి ఎలా దొరుకుతుంది? అంచేతనే, మన పెద్దలు విడిగా ఒక మూల కూచోవాలనీ, ఎవర్నీ ముట్టుకోకూడదనీ, ఆంక్షలు విధించారు. అలా అన్నప్పుడుగాని, తగిన విశ్రాంతి దొరకదుకదా అని! మరీ అంత చాదస్తంగా కూచోనక్కర్లేకపోయినా, బాగా విశ్రాంతిగా కూచోడం మాత్రం ముఖ్యం. పట్టణాల్లో ఉద్యోగాలు చేసే స్త్రీలు, స్నానాలు చేసేసి, ఆఫీసులకి వెళ్ళి పన్లు చేస్తూనే వున్నారనుకోండి-అయినా, అంత కఠినంగా పాటించకపోయినా-కొంత విశ్రాంతి మాత్రం బాగా అవసరం. దానికి తగ్గట్టుగా పరిస్థితి వచ్చినట్టు వాళ్ళు చేసుకుంటూనే వున్నారు. బహిష్టుకాలంలో జరిగే స్రావం నాలుగో రోజున కూడా వుండొచ్చు. బ్రాహ్మణ కుటుంబాలు మరీ ఆచారం పాటిస్తాయి గనక, ఆ రోజు కూడా పన్లు చెయ్యనివ్వరు.

**అల్లంరాజు లక్ష్మి, ఉల్లాస్‌నగర్**

సుద్ద, బియ్యం, మట్టిబెడ్డలు, సున్నం-ఇలాంటివి తినాలన్న కోరిక పిల్లలకి ఎందుకు కలుగుతుంది? అవి అణచుకోవాలంటే ఎలాటి జాగ్రత్తలు తీసుకోవాలి?

చిన్న పిల్లలకి ఒక్కోరకమైన వాటి మీద మోజు కలుగుతుంది. మట్టి వాసన, గోడ సున్నం వాసనా - వాళ్ళకి తినాలనిపించేలా వుంటాయి. అందుకని వెళ్ళి తినేస్తూ వుంటారు. పెద్దవాళ్ళు కేకలేస్తే, దొంగతనంగా వెళ్ళి తింటారు. అలాంటివి, జాగ్రత్తగా మానిపించాలి. వాళ్ళకి తినాలనిపించినప్పుడు, ఏ తీపి పదార్థమో, వాళ్ళకిష్టమైంది, ఇచ్చి తినిపించాలి. ఏదైనా ఒకటి తిన్న తర్వాత, అదే అలవాటయిపోతుంది. అలాంటిదే బియ్యం కూడా. చాలామంది చూడండి, బియ్యం బాగుచేస్తున్నప్పుడల్లా నాలుగేసి గింజలు నోట్లో వేసుకుంటూనే వుంటారు. అయితే అందులో ఏదో రుచి వుందనికాదు - అంతే, అదో అలవాటు! అంచేత, ఏదీ అలవాటుగా మారకముందే అలాంటి వాటిని నెమ్మదిగా మానిపించేస్తూ వుండాలి.

**కె. ఆర్. లలితకుమారి, ముచ్చనపల్లి**

ఆకుకూరలు తినడం ఆరోగ్యం - అని అందరికీ తెలుసు. కాని, ఈ మధ్య రేడియోలో - చిల్లులున్న ఆకుకూరలు తినవద్దనీ, తింటే సూక్ష్మజీవులు శరీరంలో ప్రవేశించి, ఆరోగ్యాన్ని పాడు చేస్తాయనీ చెప్పారు. మరి, మనం ఆకు కూరను ఉడికించినప్పుడు, క్రిములు నశించవా బామ్మగారూ?

'చిల్లులున్న ఆకుకూర తినకూడదు' అనడం ఎందుకంటే, దానికి పురుగుపట్టిందని. పురుగు పడితేనే గదా, ఆకు చిల్లులు పడుతుంది! పురుగు పట్టినదాన్ని తినడం, ఉడికించినాసరే, మంచిది కాదు. ఉడికించినప్పుడు, జీవం చచ్చిపోవచ్చు గాని, క్రిమి ఏమవుతుంది?—

*

# ఆదాచేసి ఆదాయం పొందండి!

## మీకు నచ్చే పథకములు

| మంచి వడ్డీ, బహుమతులు పొందే అవకాశం. | ఉచిత బహుమతులు పొందే అవకాశం. |
|---|---|

నేడే మీ సమీపములో గల బ్రాంచీలందు సంప్రదించండి!




## ఆంధ్రప్రదేశ్ సేవింగ్ & ఫైనాన్సు

**రాజమండ్రి - 533101.**

ఫోన్: 4411. పి.బి: నెం. 47. గ్రాము: సేవింగ్.

రీజినల్ ఆఫీసులు:- స్టేషన్ రోడ్, నాంపల్లి. హైదరాబాద్.
రాఘవయ్య పార్కు ఎదురుగా. విజయవాడ.

బ్రాంచీలు:-
కడప, కర్నూలు, అనంతపురం, ఖమ్మం, కాకినాడ, పాలకొల్లు
భీమవరం, కొత్తగూడెం, నల్లగొండ, కేసవరం, అనకాపల్లి, ఆదోని, రాజంపేట,
విజయవాడ, సికింద్రాబాద్, కోయిలకుంట్ల, మండపేట. నూజివీడు,
గుంటూరు. తిరుపతి, పెద్దాపురం, గిద్దలూరు, నందలూరు, మదనపల్లి,
ధర్మవరం, ఏలూరు, కొయ్యలగూడెం, చిత్తూరు, బూర్గంపాడు.



ANU

# సమస్యలూ సలహాలూ

**నిర్వహణ : కమలా వసంతకుమార్**

సి. ఎ.

మాకు ఏడుగురు సంతానం. నలుగురు మగపిల్లలు, ముగ్గురు ఆడపిల్లలు. అయితే ఒకపాప దక్కలేదు. ఉన్న ఆరుగురులో పెద్దది అమ్మాయి పెళ్ళీడు కొచ్చింది. రెండవ వాడికి పదహారేళ్ళు. మా సమస్యంతా వీడి గురించే. చిన్నప్పట్నుంచీ చదువు మీద వీడికి ఉత్సాహం లేదు. రెండు మూడు స్కూల్సు మార్చాము. ఏమైనా వాడికి చదువు అబ్బ లేదు. అందుకని వాడిని బలవంతపెట్టలేదు. ఇంటి దగ్గరైనా చదువుకుంటాడేమోనని చూశాము. కాని, లాభం లేకపోయింది. చదువు లేకపోతే మరీ మొద్దుబారిపోతాడేమోనని, అప్పుడప్పుడు మేము కేకలు వేసేవాళ్ళము. అయితే, ఒంటరిగా ఎక్కడికీ వెళ్ళడు–సిగ్గు, బిడియం. క్రమేణా ఇంట్లో అందరితోనూ కూడా మాట్లాడ్డం మానేశాడు. ఎవరైనా పలకరిస్తే కోపగించుకుంటాడు; చిరాకు ప్రదర్శిస్తాడు. విశాఖపట్నం పెద్ద ఆసుపత్రిలో చూపించి, ఏవో మాత్రలు వాడాము. ప్రయోజనం కలగలేదు. ఎవరో చెబితే, భూతవైద్యాలు చేయించాము, దిష్టి తీయించాము. వాటివల్లా ప్రయోజనం లేకపోయింది. వాడేమో దినదినానికీ మరీ అదోలా అయిపోతున్నాడు. మమ్మల్నేం చెయ్యమంటారు?

**మీ అబ్బాయి మానసికంగా ఏదో బాధపడుతున్నారు. విశాఖపట్నంలో చికిత్స చేయించామన్నారు, మానసిక వైద్యునికి చూపించారా? ఆ విషయం మీ ఉత్తరంలో స్పష్టంగా లేదు. ఏమైనా, మీ అబ్బాయికి మానసిక వైద్యుని సలహా, చికిత్స చాలా అవసరం. దానికోసం అక్కడ ప్రయత్నించండి. లేదంటే, మీకు సావకాశం వుంటే మద్రాసులోని మానసిక వైద్యశాల సూపరింటెండెంట్ డాక్టర్ శారదామీనన్‌ను సంప్రతించండి. వారు తెలిసి, ఇలాంటి కేసుల్ని ఆమె తొందరగా, చక్కగా నయం చేస్తారు.**

**అయితే, ఒక్క చికిత్స మాత్రమే చాలదు. చుట్టూ వున్నవాళ్ళందరూ అతన్ని అర్థం చేసుకోవాలి. అతనితో సహకరించాలి. మీ యింట్లో వున్న తక్కిన సభ్యులందరూ అతన్ని తక్కువగా చూడకుండా, ప్రేమగా, అభిమానంగా చూడాలి. అతనింకా చిన్నవయసులోనే వున్నాడు కాబట్టి, అతని జీవితాన్ని తొందరగా గాడి పట్టించవలసిన బాధ్యత మీ మీదే వుంది.**

**సాధారణంగా చాలామంది తల్లులు - 'మా వాడు అల్లరివాడుగా పుట్టాడమ్మా నేనేం చెయ్యను' అని వాపోతూ వుంటారు.**

**కాని పిల్లల పెంపకం విషయంలో తలిదండ్రులే ప్రధాన పాత్ర వహిస్తారు. ప్రతి శిశువుకి కూడా తనకు పుట్టుకతో అబ్బిన విద్యలను మెరుగుపరచుకునేందుకు తలిదండ్రుల తోడ్పాటు అవసరం, వాళ్ళని ఆడించడమూ, లాలించడమూ వాళ్ళు చెప్పే అమాయకపు కబుర్లకి నవ్వడంతోనే సరిపెట్టుకో కూడదు.**

**ఆ పిల్లలు వేసిన బొమ్మలను మెచ్చుకోవడం, వాళ్ళు చెప్పే కథలు శ్రద్ధగా వినడం, వాళ్ళ. చక్కటి కథలు చెప్పడం వంటివి కూడా చెయ్యాలి. ఇవన్నీ కూడా పిల్లల వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేస్తాయి.**

**తనకు అవసరమైనవన్నీ పొందాలనుకున్న శిశువు కోరికలు – ఆహారం, ఆప్యాయత, ఆదరణకి ధైర్యవచనాలు – వీటిలో ఏదైనా కానివ్వండి – లభించిన శిశువులు భవిష్యత్తులో ఎంతో చక్కటి ఆశాజీవులుగా రూపొందుతారు. అలా కాకుండా కర్రపెత్తనం చేస్తూ 'ఎందుకొచ్చిన సంతరా భగవంతుడా' అనుకుని పెంచే పిల్లల వ్యక్తిత్వం పెద్దయ్యాక బాగా దెబ్బ తింటుంది. ఒక విధమైన 'కాంప్లెక్సు'కు గురి కావడంతో పిల్లలు – అనుమానపరులుగానో, పిరికివాళ్ళుగానో, నిరాశావాదులుగానో తయారవుతారు.**

**కాబట్టి పిల్లల బంగారు భవిష్యత్తుకు బాటవేయగల పరిస్థితులు కల్పించవలసిన బాధ్యత ముఖ్యంగా తల్లుల మీద ఎంతైనా వుంది.**



శిశువుకి సంఘంతో మొదటి పరిచయం, నెలల పాపగా వున్నప్పుడు తనని చూసి చిరునవ్వు నవ్వే వారితో ప్రారంభమవుతుంది. ఆ తరువాత క్రమక్రమంగా పిల్లలు చిరునవ్వులు చిందిస్తూ, వారి భాషలో వింత వింత శబ్దాలు చేస్తూ ఆ పరిచయాన్ని దృఢతరం చేసుకునేందుకు ప్రయత్నిస్తారు. ఆ తరువాత చేతులు వూపడం, నిదానంగా మాట్లాడటం నేర్చుకుంటారు.



డి. కె. పి.

మా వారు ఒక క్లబ్బులో మెంబరయినారు. రెండు సంవత్సరాలనుంచి ఆయన క్లబ్బుకే అంకితం అయిపోయారు. రోజూ సాయంకాలం అక్కడికి వెళ్తే మర్నాడు ఉదయమే వస్తారు. రాత్రి ఏదైనా విషయంగా క్లబ్బుకి ఫోన్ చేస్తే "లేరు" అని చెప్పిస్తారు. మర్నాడు ఉదయం వచ్చిన దగ్గర్నుంచి ఇంట్లో నిద్రపోతారు. వ్యాపారం చూసుకోరు. "పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారు. వాళ్ళ గురించి పట్టించుకోకపోతే ఎలా?" అని అడిగితే సమాధానం చెప్పరు. మరీ ఏదైనా గట్టిగా అడిగితే– "నా డబ్బు! నా ఇష్టం!" అని కోప్పడతారు. ఈ విషయం పిల్లలకి, చుట్టుపక్కల వాళ్ళకి, బంధువులకీ ఎవరికీ తెలియకుండా ఎలాగో పరువు కాపాడుకుంటూ వస్తున్నాను. ఎవరికి తెలిసినా హేళన చేస్తారని భయం. మానసికంగా నాకు శాంతిలేదు. ఎన్ని దేవుళ్ళకి మొక్కినా ప్రయోజనం లేకుండా పోతున్నది. నా మనసు మరీ పూర్తిగా పాడయిపోతోంది. నన్నేమి చెయ్యమంటారు?

క్లబ్బులకి వెళ్తూ 'క్లబ్ పక్షులు' అయిన వాళ్ళ కుటుంబాలు ఇలాగే బాధ పడుతూ వుంటాయి.

సాధారణంగా భార్య, భర్తల మధ్య ఏవైనా విభేదాలు వచ్చినా, అనంగీకారం లాంటిది కలిగినా వాటికి కారణం వాళ్ళిద్దరి మధ్య వుండే భావసాన్నిహిత్యం. ఉదాహరణకి స్నేహితులు, ఆలోచనలు, ఉద్దేశాలు, అభిప్రాయాలు - ఇవన్నీ భార్య భర్తల మధ్య ఒకేరకంగా లేకపోతే—ఇలాంటివి జరుగుతూ వుంటాయి. స్నేహితుల దగ్గర కూచుంటేనే, తనకి హాయిగా వుండే భావన కలుగుతుంది భర్తకి. మరి, మీ ఉత్తరంలో ఇలాంటిదేదీ వున్నట్టుగా మీరు రాయలేదు. అంచేత, నేను సరిగ్గా చెప్పలేను. ఏమైనా మీరే ఆయన్ని దారికి తీసుకురావాలి; తీసుకురాగలరు. ఆయనకు కోపం తెప్పించే మాటలేవీ మాట్లాడకుండా, నిదానంగా చక్కగా సంభాషించండి. క్లబ్‌లోలేని ఆకర్షణ ఇంట్లో వున్నదని నిరూపించండి. మీ ప్రవర్తన, నడవడికలతో, ఆయనను మరలించడానికి ప్రయత్నించండి. ఆయనకు ఇష్టమైన కబుర్లు, మాటలతో కాలక్షేపం చేసి చూడండి.

యస్.

నా వయసు 18 సంవత్సరాలు. నా చిన్నతనంలోనే మా నాన్నగారు మా పిన్నిని ప్రేమించారు. ఆమె సాక్షాత్తూ మా అమ్మకు చెల్లెలు. ఉద్యోగం చేస్తున్నది. అందమైనదేం కాదు. మా పెద్దవాళ్ళ ప్రేరేపణల వల్ల, మా పిన్నికి స్వేచ్ఛలభించింది. ఇద్దరూ కలిసి తిరగడం ఆరంభించారు. అమ్మకి తెలిసిన తర్వాత, తాను నిలవేసి అడిగినా ప్రయోజనం లేకపోయింది. బయటి ప్రపంచానికి వీరి విషయం తెలిసిపోయింది. అందరికీ తెలిసి పోయిందని అమ్మ బెంగ పెట్టుకుని, గుండె జబ్బు తెచ్చుకుంది. దానికితోడు_ఈ మధ్యనే పిన్ని, నాన్న పెళ్ళి కూడా చేసుకున్నట్టుగా కూడా తెలిసింది. కాని, అమ్మకి ఈ విషయం తెలియదు. తెలిస్తే ఏమయిపోతుందోనని నా భయం! అప్పటికీ నేను_"పర్వాలేదమ్మా, మనం స్వతంత్రంగా బ్రతుకుదాం" అని ధైర్యం చెబుతూనే వున్నాను. అయినా, నాకు నిత్యం భయమే! ఈ విషయం అమ్మతో చెప్పడమా? మానడమా?—కన్నతల్లిని కాపాడ్డం నా లక్ష్యం. చెబితే ఏమవుతుంది? చెప్పకపోతే ఏమవుతుంది? నాకు సలహా చెప్ప గోర్తాను.

మీరు – జరిగిన విషయాన్ని మీ అమ్మగారికి చెప్పడం – మంచిది. చట్ట ప్రకారం, ఒక భార్య జీవించివుండగా, మరో భార్యని వివాహం చేసుకో డానికి హక్కులేదు – మొదటి భార్యకు విడాకులిస్తే తప్ప. అలాంటిది జరిగితే, మీ తండ్రిగారు మీ అమ్మగారి జీవితానికి దారి చూపించాల్సిన అవసరం కలుగుతుంది. అంచేత, మీకు మీ అమ్మగారిని చూసుకోడంలో, ఇబ్బంది వుండకపోవచ్చు. మీరు కూడా ఏదైనా చిన్న ఉద్యోగం లాంటిది చూసుకోగలిగినా, ఏదైనా పని పాట చేసుకోగలిగినా, ఆ రాబడి కూడా మీ కుటుంబానికి సహాయపడ గలుగుతుంది. అయితే ఈ విషయమై మీరేం భయపడవలసిన అవసరం లేదు. ఉన్న నిజాన్ని—నిదానంగానే, మీ తల్లిగారికి చెప్పండి. □

చిత్ర కథ పోటీ:

# వెంటాడే-చిన్నతనం

టి. సీతాలక్ష్మి

గత సంచికలో ఇచ్చిన 'చిత్ర కథ పోటీ'కి అసంఖ్యాకంగా కథలు రావడం— మెచ్చుకోదగ్గ విషయం। వచ్చిన కథల్లో బాగున్నదనిపించిన కథ—'వెంటాడే చిన్న తనం' అన్న ఈ కథ. ఈ కథను రాసినవారు - టి. సీతాలక్ష్మి (కొత్తపల్లి) ప్రకటించిన ప్రకారం పంపుతామన్న 'బహుమతి'ని ఆమెకు పంపివేశాము.

కమలకి కష్టాలంటే చాలా బాగా తెలుసు. ఇప్పుడు కమలకి ఇరవై సంవత్సరాలైనా తన జీవితంలో జరిగిన సంఘటనలవల్ల ఆమె ఇప్పుడు ముప్ఫయి ఏళ్ళ జీవితానుభవం సంపాదించింది।

నెల రోజుల క్రితమే సవతి తల్లి మరణించింది. తండ్రి గుమస్తాగా పని చేస్తున్నాడు. ఇంటికి ఆడ దిక్కు కమలే అని చెప్పాలి. సవతి తల్లికి పిల్లలు లేని మూలంగా తోబుట్టువుల తోడు కూడా లేదు కమలకి. అందుకనే ఎప్పుడూ ఒంటరిగా కూర్చుని బాధ పడుతూ వుంటుంది.

తెల్లవారగానే లేచిన కమల తొందరగా తయారై బజారుకి బయలుదేరింది. ఉదయాన్నే టిఫిన్ చేయాలి తండ్రికి. ఇంట్లో గోధుమనూక కూడా లేదు. టిఫిన్ చేయకపోతే ఇంట్లో జరిగేరగడకి అంతులేదు. గబగబా అడుగులు వేస్తున్న కమలకి ఒకరింటి అరుగు మీద ఒక ఐదేళ్ళ పిల్ల కూర్చుని ఏడుస్తూ కనిపించింది. కమల ఆగింది.

జాలిగా ఆ పిల్లని చూసింది. ఆ అమ్మాయిని చూసిన కమలకి తన చిన్నతనంలో జరిగిన సంఘటన గుర్తుకి వచ్చింది....

ఆ రోజు కమల పుట్టిన రోజు. తల్లి బతికివున్న రోజులలో ఆ దినం ఆ పసిపిల్లకి అదొక పండగలా ఉండేది। కాని సవతి తల్లి ఆ విధంగా సాగనిచ్చేది కాదు. ఆ రోజు చివరికి హాయిగా బడికి కూడా పంపేదికాదు। ఇంట్లో వున్న మాసిన బట్టలన్నీ వేసి ఉతకమనో దొడ్డి అంతా వూడ్చమనో ఏదో విధంగా వంకబెట్టి స్కూల్ టైమ్ దాటిపోయేలా చూసేది. చివరికి మధ్యాన్నం దాటు వేసి అన్నం పెట్టేది. "పిన్నీ। ఈ రోజు నా పుట్టిన రోజు. మా అమ్మ నాకు పరమాన్నం వండి పెట్టేది" అంటూ అమాయకంగా ఆశగా అడిగేది కమల.

దాంతో ఛర్రుమనేది ఆమె. "నీ మొహానికి పుట్టిన రోజు కూడానా। నీ ఉసురే నాకు పిల్లలు లేకుండా చేసింది" అంటూ నాలుగు అంటించేది. చేసేది లేక అన్నం వదిలి వీధిలోనికి పోయి కూర్చుని వెక్కి వెక్కి ఏడ్చేది పాపం। ఈ విధంగా చిన్నతనం గుర్తు తెచ్చుకుంటే కమల కళ్ళల్లోకి నీళ్ళు వచ్చాయి.

ఇంతలో ఆ ఇంట్లో నుంచి ఒకామె వచ్చి వీధిలో కూర్చుని ఏడుస్తున్న పిల్లని చూచి "ఒసేయ్। దరిద్రపు మొఖమా। శుక్రవారం పూటా వీధి గుమ్మంలో కూర్చుని ఏడుస్తావేం?" అంటూ ఒక్క ఊపున క్రిందికి తోసేసింది। క్రింద పడిన ఆ పిల్ల బావురుమంటూ రోడ్డు మీదకి పరుగెత్తింది....

ఈ దృశ్యం చూసిన కమల అక్కడ నిలవలేక పోయింది। ఆ పిల్ల కూడా తనలాగే సవతి పిల్లా!! కమల గబగబా అడుగులు వేయసాగింది. "అమ్మో। నా చిన్నతనం మళ్ళీ నా వెనకే వస్తోంది" అంటూ భయభయంగా పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ నడవసాగింది కమల।





# భారతీయ వైద్యవిధానం

"పెద్ద పెద్ద జబ్బులను, తీరని దీర్ఘ వ్యాధులను చిన్న చిన్న మూలికల కలయికతో తయారు చేసే చూర్ణాలతో, లేహ్యాలతో సులభంగా నయం చేసే వారు మన పెద్దలు"—అనే బామ్మల మాటలు మనం తరచూ వింటూ వుంటాం. కాని కాలం చెందిన మార్పు ప్రభావంతో ఆధునిక వైద్యశాస్త్రం రాకెట్ వేగంలో పయనిస్తూంది. అంచేత దానితో పోటీ పడలేక, కావలసిన ప్రోత్సాహం లేకపోవడం వల్ల ప్రాచీన భారతీయ వైద్యవిధానం ఎలాంటి ఎదుగూ బొదుగూ లేకుండా అలాగే వుంటూంది. ఇటువంటి స్థితిని మార్చడానికి — భారతీయ వైద్యశాస్త్రానికి కూడా కొంత చేయూతనివ్వాలి—అన్న ఉద్దేశం తమిళనాడు రాష్ట్రప్రభుత్వానికి కలిగింది.

ఈ ప్రయత్నానికి ఒక ప్రత్యక్ష నిదర్శనం— మద్రాసు అరుంబాకం ప్రాంతంలో ప్రశాంతమైన వాతావరణంలో నెలకొల్పబడిన భారతీయ వైద్య శాల. ఇక్కడ ఉద్యోగం చేస్తున్న డాక్టర్ ఏ. నీలావతి — తమిళనాడు భారతీయ వైద్యవిధాన విభాగానికి డైరెక్టర్‌గా వుంటున్నారు. ఈ పదవిని నిర్వహించే మొదటి వనిత ఈమే.

భారతీయ వైద్యశాస్త్రం గురించి పాఠకులకు పరిచయం చేసే ఉద్దేశంతో డాక్టర్ నీలావతితో జరిపిన ఒక చిన్న గోష్ఠిని ఇక్కడ పొందు పరుస్తున్నాము.

"భారతీయ వైద్యశాస్త్రం గురించి కొంచెం క్లుప్తంగా చెబుతారా డాక్టర్?"

"తప్పకుండా. సాధారణంగా మూలికలు ఉపయోగించి జబ్బును నయం చేసే ప్రాచీన పద్ధతిని భారతీయ చికిత్సా విధానం అని చెప్పవచ్చు. పాద రసం, దానికి సంబంధించిన పదార్థాలు, ధాతువు, వివిధ రకాల స్థావర జంగమ వస్తువుల నుంచి ఒక ప్రత్యేకమైన పద్ధతి ప్రకారం ఔషధాలు తయారు చేస్తారు."

భారతీయ వైద్యాన్ని ముఖ్యంగా సిద్ధ, ఆయుర్వేద, యూనాని అని మూడు భాగాలుగా విభజించవచ్చు. ఈ మూడింటిని గురించి డాక్టర్ నీలావతి క్లుప్తంగా వివరించారు.

"ఈ మూడు రకాలలో ముఖ్యంగా సిద్ధవైద్యమే ఇక్కడ ఎక్కువ ఉపయోగంలో వుంటూంది. ఈ పద్ధతిని గురించి మన పూర్వీకులు, సిద్ధపురుషులు ఎన్నో సందర్భాలలో పద్యాలుగా, పాటలుగా రాసి వుంచారు. ఈ వైద్యానికి సంబంధించిన గ్రంథాలు చాలవరకు తమిళ భాషలోనే వున్నాయి. అందువల్ల అది ఇక్కడి వారికి చాలా అనుకూలంగా వుంది."

"రసం, ఉపరసం-అనే వాటిని విషపదార్థాలుగా మార్చి, వాటిలో 'ముప్పు' అనే ఒక రకమైన మట్టిని (పూనీర్) కలిపి సిద్ధ ఔషధాలు తయారు చేస్తారు. అయితే ఈ పూనీర్ కనుగొనడం చాలా కష్టం. చెట్టూ చేమా లేని చౌటి నేలలో, బీళ్ళలో తై నెల (జనవరి 15 నుంచి ప్రారంభం) పౌర్ణమి రోజున ఉదయం సూర్యోదయానికి ముందు భూమి నుంచి కాంతిరేఖల రీతిగా ఇది పైకుబుకుతుంది. ఆ సమయం చూసి వాటిని తీసుకురావాలి. దీనితో మూలికలు కలిపి మందులు తయారుచేయడంవల్ల అవి ప్రత్యేకమైన ఔషధ గుణాలు సంతరించు కుంటాయి."

"ఆయుర్వేద విధానంలో పక్వం చేసిన ఔషధా లకు కొంచెం బెల్లం కలిపి-భూమికి అడుగు భాగంలో పొట్టు పుటం వేసి, నలభై అయిదు రోజులు పాతి వుంచుతారు. దీనివల్ల ఆ మందులకు నాలుగు నుంచి పది శాతం వరకు సారాయి గుణం (Alcoholic Effect) వస్తుంది. ఇలా చేయ డంవల్ల చాలా కాలంవరకు ఆ మందులు చెడిపో కుండా నిలువ వుండడానికి వీలవుతుంది."

"ఆయుర్వేద ఔషధ విధానం గురించిన వివరాలతో నిండిన విషయాలుగల గ్రంథాలు సంస్కృత భాషలో విరివిగా వున్నాయి."

"లేహ్యాలకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చే చికిత్సా విధానం యునాని. దీనిని గురించిన పుస్తకాలు ఎక్కువగా ఉర్దూ భాషలోనే వున్నాయి."

విభాగాలు మూడయినప్పటికీ భారతీయ వైద్య కుటుంబంలో ఈ మూడింటికీ సమమైన ప్రాము ఖ్యత వుండడం గమనించదగ్గ విషయం.

డాక్టర్ నీలావతి పర్యవేక్షణలో—ఈ వైద్య శాలలో "పంచకర్మ వైద్యం" అన్న ఆయుర్వేద వైద్య చికిత్సా విధానం అనుసరించబడుతూంది. మర్దనం, ధారా, నవరక్కిళి, వస్తి, నశ్యం—అనే పద్ధతులు మన పూర్వులు ఏ ఏ రీతిలో రోగాలు నయం చేసేవారో విశదం చేస్తాయి.

మర్దనం: మాలిష్ పద్ధతిలో ఈ చికిత్స చేస్తారు. రోగి శరీరమంతా, ఔషధ తైలం రాసి అరగంట అలాగే వుంచి స్నానం చేయిస్తారు. సుమారు పదిహేను రోజుల వరకు వరుసగా ఈ చికిత్స చేస్తారు.

ధారా: రోగి తలకు పై భాగంలో ఒక కుండను వ్రేలాడదీస్తారు. అందులో ఔషధ తైలం వుంటుంది. కుండకు అడుగు భాగంలోని చిన్న చిన్న రంధ్రాల ద్వారా ఒక క్రమపద్ధతిలో రోగి బాధ వున్న చోట ఈ ఔషధ తైలం పడుతూ వుంటుంది. విపరీతమైన శిరో బాధలాంటి రుగ్మతల నివారణకు ధారా పద్ధతిని అనుసరిస్తారు.

నవరక్కిళి: మలబారు ప్రాంతంలో లభించే 'నవర' బియ్యాన్ని సగంగా పగులగొట్టి గుడ్డతో చిన్న చిన్న మూటలుగా కడతారు. పాలు, కషాయం కలిసిన ఒక రకమైన మిశ్రమం పొయ్యి మీద పెట్టి వేడి చేస్తారు. అది వేడి కాగానే ఆ బియ్యం మూటలు ఒక్కొక్కటిగా అందులో వేస్తారు. కొంచెం వెచ్చగా వేడెక్కిన తర్వాత వెలికితీసి రోగి శరీరం మీద పిండుతూ మర్దనం చేస్తారు.

వస్తి: మందు ఆకులను బాగా నూరి, తేనె

లోనో, ఆముదంలోనో కలిపి 'ఎనిమా' ఇచ్చే విధంగా ఇస్తారు. మలబద్ధం నివారించడానికి ఉత్తమమైన ఈ పద్ధతి ద్వారా - నడుం క్రింది భాగంలో యేర్పడే పార్శ్వ వాయువులాంటి నొప్పులను నయం చేయడానికి సాధ్యమవుతుంది.

నశ్యం: మూలికల రసం తీసి ముక్కు ద్వారాల్లో - ఒక ద్వారం మూసి, మరో ద్వారం గుండా బొట్టు బొట్టుగా శరీరంలోకి పంపే పద్ధతిని 'నశ్యం' అంటారు. తలనొప్పి, సైనస్ తల నొప్పులు, ముఖ పార్శ్వవాయువు మొదలైన వాటిని ఈ విధంగా నయం చెయ్యవచ్చు.

"రోజుకు పదమూడు వందల మందికి పైగా ఈ భారతీయ వైద్య విధానం ప్రకారం ఈ ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నారు. పసిపిల్లలకు వచ్చే పోలియో, పక్షవాతం, చర్మవ్యాధులు, కీళ్ళ నొప్పులు, మొదలైన వాటికి ఇక్కడ ప్రత్యేకంగా చికిత్స చేయబడుతోంది."

**"ఇన్ని విషయాలు తెలియజేసినందుకు చాలా సంతోషం. ఏమీ అనుకోకుండా వుంటే ఒక చిన్న సందేహం. మీరు ఈ విభాగంలో ఎంత కృషి చేసినప్పటికీ "టెస్ట్ ట్యూబ్ బేబీ"ని సృష్టించగలిగినంత ప్రగతి సాధించిన ఆధునిక వైద్యశాస్త్రంతో పోటీపడి ఏదైనా సాధించగలమని మీరు అనుకుంటున్నారా డాక్టర్ ?"**

"చాలా చక్కటి సందేహం వెలిబుచ్చారు. నిజం ఒప్పుకోడంలో నాకెలాంటి నామోషీ లేదు. ఆధునిక విజ్ఞానం అభివృద్ధి చెందినంతగా ప్రాచీన భారతీయ వైద్యశాస్త్రం ప్రగతి సాధించలేదు. నిజమే. కాని మనదేశంలో ఎక్కడ చూసినా మంచి మూలికలు కనబడుతాయి. అవి మట్టిలో మట్టిగా కలిసిపోకుండా వాటిని మన ఆరోగ్య వికాసానికి ఉపయోగించుకోడంలో తప్పు లేదు గదా. అది చాలా అవసరం కూడా. ఆధునిక విజ్ఞానశాస్త్రం ఎంత అభివృద్ధి సాధించినా, కేన్సర్ వ్యాధి నయం చేసే మందును కనుగొనడానికి జరిగే పరిశోధనలకని - మనం సర్వ సాధారణంగా, మామూలుగా చూసే - 'నిత్యకల్యాణి' మొక్కలను విదేశాలకు విరివిగా ఎగుమతి చేసే విషయం మీకు తెలుసు అనుకుంటాను. మనలోని ఎన్నో విషయాల ప్రాముఖ్యత గురించి - విశిష్టత గురించి మనకే అంతగా తెలియదు. అలాంటి వాటిలో మన ప్రాచీన భారతీయ వైద్యవిధానం కూడా ఒకటి అనుకుంటాను."

—కస్తూరి

# సంక్రాంతి ముగ్గు

**ఈ** ముగ్గు వెయ్యటానికి ముందుగా **21** చుక్కలు ఒకదాని కొకటి సమాన దూరంలో వుండేటట్లు పెట్టుకోవాలి. తరువాత రెండేసి చుక్కలు, మధ్య ఒక్కొక్కటి చొప్పున అంటే **20, 19, 18, 17, 16, 15, 14, 13, 12, 11** వచ్చేవరకు పెట్టుకోవాలి. రెండోవైపు కూడా యిదే విధంగా పెట్టుకున్న తర్వాత మొదటి చిత్రంలో చూపబడినట్లుగా కలుపుకుంటే మొత్తం చక్కటి పువ్వుల ముగ్గు తయారవుతుంది. ఆ పువ్వులలో అక్కడక్కడ గొబ్బిళ్ళు అమర్చితే అందమైన "సంక్రాంతి ముగ్గు" ప్రత్యక్షమవుతుంది.

—ఎ. జయలక్ష్మి





# వైద్య సలహాలు



'-డాక్టర్'

శ్రీమతి ఎస్.

నా వయసు ఇరవైమూడు సంవత్సరాలు. ఎటువంటి మేలి రకమైన స్నో, పౌడర్ రాసుకున్నా ముఖమంతా చెమటలు పోసి, ఐదునిమిషాల కల్లా ముఖం జిడ్డుగా తయారవుతుంది. ఏవీ వాడకుండా వుంటే ఇక చెప్పనవసరం లేదు. మరీ జిడ్డుజిడ్డుగా వుంటుంది. ఒక వారం వరకు తలకు నూనె రాసుకోకపోయినా, శిరోజాలు నూనె రాసుకున్నట్టే వుంటాయి. ముఖం పొడిగా తాజాగా వుండాలంటే ఏం చెయ్యాలో చెప్పండి డాక్టర్.

**స్నోలు, పౌడర్లు వాడితేమాత్రం చాలదు. రోజుకు నాలుగైదుసార్లు మంచి సబ్బుతో ముఖాన్ని శుభ్రంగా కడుక్కోవాలి. వారానికి కనీసం రెండుసార్లు తల స్నానం చేసి శిరోజాలు శుభ్రం చేసుకుంటూ వున్నట్టయితే ముఖం జిడ్డుగా తయారు కాదు.**

శ్రీమతి కె. ఆర్.

నా వయసు ఇరవైయేడు సంవత్సరాలు. పెళ్ళయి పదేళ్ళు అవుతోంది. ముగ్గురు పిల్లలు వున్నారు. నాలుగేళ్ళకు ముందే కుటుంబ నియంత్రణ శస్త్రచికిత్స చేయించుకున్నాను. గత రెండేళ్ళుగా ఉదయం నిద్ర లేచేటప్పుడే నడుము బాధగా వుంటోంది. అప్పుడప్పుడు తెలుపు పడుతుంది. పెళ్ళికి పూర్వం నుంచే యోగాసనాలు వేస్తున్నాను. యోగాసనాలకు, తెలుపు పడడానికి ఏమైనా సంబంధం వుందా? దీనిని నివారించడం ఎలా?

**యోగాసనాలకు దీనికీ సంబంధం వుందని చెప్పలేము. తెలుపు పడడానికి ముఖ్యమైన కారణం గర్భాశయంలో పుండు వుండడమే. మంచి వైద్యుల దగ్గర వైద్యపరీక్ష చేయించుకుని చికిత్స పొందడం మంచిది. రక్తలేమి, పాండురోగం లాంటివి కూడా తెలుపు పడడానికి కారణం కావచ్చు. దీనికి ఇనుముశక్తి వుండే మంచి మాత్రలు, టానిక్కులు వాడడం, బలవర్ధకమైన ఆహారం తీసుకోవడం శ్రేయస్కరం.**

శ్రీమతి ఎ. వి.

ఉదయం నిద్ర నుంచి లేవడానికే బద్ధకంగా, బలహీనంగా, ఒళ్ళంతా నొప్పులుగా వుంటోంది. లేవగానే ఇంటిపనులు చేసుకోడానికి కూడా చాలా కష్టంగా వుంటోంది. పది పన్నెండురోజులకోసారి కాళ్ళు చేతులు నొప్పి పట్టుకుంటాయి. దీనికేం చెయ్యమంటారు డాక్టర్?

**శారీరక బలహీనత, నరాల బలహీనతే దీనికి కారణం. రాత్రుళ్లు పడుకోబోయే ముందు పాలు, పళ్ళు తీసుకోడం మంచిది. ఒక నెల రోజులపాటు బి కాంప్లెక్స్ మాత్రలు వాడినట్టయితే మంచి ఫలితం కనిపించవచ్చు.**

శ్రీమతి ఎన్.

నా వయసు ఇరవైతొమ్మిదేళ్ళు. ఐదేళ్ళు, మూడేళ్ల ప్రాయంలో ఇద్దరు పాపాయిలు వున్నారు. రెండోసారి గర్భం ధరించినప్పటి నుంచి, లైంగిక క్రియలో పాల్గొన్న కొంతసేపటికి కడుపు క్రింది భాగంలో ఒక విధమైన బాధ ఏర్పడుతుంది. కాళ్ళ నరాలు విపరీతంగా బాధ పెడతాయి. పది, పదిహేను నిమిషాలకు ఒకసారి మూత్ర విసర్జన చెయ్యవలసి వస్తుంది. లైంగికక్రియలో పాల్గొనకుండా వుంటే ఎలాంటి ఇబ్బందీ వుండడం లేదు. దీనికి కారణం ఏమిటి?

**మూత్రంలో క్రిములు చేరడం వల్ల–'యూరినరీ ఇన్‌ఫెక్షన్' అయి వుండవచ్చు. అంచేత వెంటనే మూత్ర పరిశోధన చేయించుకుని తగిన చికిత్స పొందినట్టయితే సులభంగా నయమైపోతుంది. దీని కోసం దిగులు పడవలసిన అవసరం లేదు.**

శ్రీమతి కె.

నా వయసు నలభై సంవత్సరాలు. పదేళ్ళకు ముందు గర్భనిరోధ చికిత్స చేయించుకున్నాను. ఇప్పుడు సుమారు ఆరు నెలలుగా ఋతుస్రావం జరిగిన పదిహేడవ రోజు నుంచి తర్వాత ఋతుస్రావం అయ్యేవరకు కింది కడుపు విపరీతంగా బాధ పెడుతుంది. ఋతుస్రావం అయిందంటే ఆ తర్వాత ఎలాంటి బాధ వుండడం లేదు. ఈ బాధ తప్పడానికి ఏదైనా దారి చెబుతారా డాక్టర్?

**గర్భనిరోధ శస్త్రచికిత్స చేసుకున్నందువల్లనే ఈ బాధ వచ్చిందని చెప్పలేము. ఎందుకంటే శస్త్రచికిత్స చేసుకుని దాదాపు పదేళ్ళవరకు మీ కెలాంటి బాధ కలగలేదు. గర్భాశయంలో వ్రణం వుంటేనో లేదా వాపు వుంటేనో ఇటువంటి బాధ కలుగుతుంది. డాక్టర్‌ను సంప్రదించి మందులు తీసుకుని కింది కడుపుకు విద్యుత్ కాపడం చికిత్స (ultra-short-wave therapy) చేయించుకున్నట్టయితే ఇది తప్పకుండా నయమవుతుంది.**

కుమారి టి. టి.

మా చెల్లెలు వయసు పదిహేడు సంవత్సరాలు. నాలుగు అడుగులా పది అంగుళాల ఎత్తు వుంది. మా ఇంట్లో అందరూ బాగా ఎత్తుగా వుంటారు. అంచేత తను మాత్రం పొట్టిగా వుందని బెంగపడిపోతోంది. ఆమె ఎత్తుగా పెరగడానికి ఏమైనా మందులు, ప్రత్యేకమైన శరీర వ్యాయామాలు ఏవైనా వుంటే దయచేసి చెప్పగలరా?

**ఒకరి ఎత్తును నిర్ణయించేవి – కన్నవారి తాత ముత్తాతల ఎత్తు; శిశు ప్రాయంలో తీసుకునే ఆహారం; చేసే శరీర వ్యాయామం మొదలైనవి. అయినా మీ చెల్లాయికి ఇప్పుడు పదిహేడు సంవత్సరాలే కదా – మరి ఇంతలోనే బెంగపడిపోవడమెందుకు? పెరగడానికి ఇంకా కాలంవుంది. మంచి బలవర్ధకమైన ఆహారం తీసుకుంటూ, స్వింగింగ్, స్కిప్పింగ్ లాంటి వ్యాయామాలు చేయడం ద్వారా మరికొంత ఎత్తుగా పెరగడానికి అవకాశం వుంది!**



**రేపు ఉదయం తలంటు పోసుకుంటారనగా ముందు రోజు రాత్రి, మెంతులు ఒక చిన్న గరిటెడు నీళ్ళలో నాన బెట్టాలి. తెల్లవారికి ఆ మెంతులు బాగా నాని వుంటాయి. వాటిని రోట్లో వేసి మెత్తగా రుబ్బి తలంతా పట్టించుకుని ఒక గంటసేపు నానిన తర్వాత తల స్నానం చేస్తే జుట్టు వూడడం తగ్గుతుంది.**

—ధూర్జటి విజయలక్ష్మి

# ఎదురు తిరిగిన కథ



కుమారి లక్ష్మిగారికి,

నమస్కారం!

ఎవరీ అపరిచిత వ్యక్తి నాకే ఉత్తరం రాస్తున్నదీ అని మీరు ఆశ్చర్యపోతున్నారు కదూ!

అవును. నేను మీకు అపరిచితుణ్నే.

కాని-మీరు నాకు అపరిచితులు కారు. మిమ్మల్ని నేను ముఖాముఖీ చూడకపోయినప్పటికీ, మీతో మాట్లాడకపోయినప్పటికీ, మీ ఫొటో, మీరు రాసిన ఉత్తరాలు రాజు దగ్గర చూశాను. (రాజు ఎవరో మీకు తెల్సు. కాని రాజుకి నేనే విధంగా దగ్గరో మీకు తెలియకపోవచ్చు. రాజూ నేనూ రూం మేట్స్ మి!)

మీ ఫొటో చూచినప్పుడే మీరు నన్నెంతగానో ఆకర్షించారు. అప్పుడే మీకు ఉత్తరం రాయాలని కూడా అనుకున్నాను. అయితే మీ అడ్రసు సంపాదించేందుకు యింతకాలం పట్టింది. ఇంత కాలానికి ఎలాగో మీ అడ్రసు సంపాదించి (అంత కంటే దొంగిలించి-అనడం మంచిది. మిత్రద్రోహం అనుకుంటే క్షమించండి. ఇంక అంతకంటే గత్యంతరం లేకపోయింది) మీకీ ఉత్తరాన్ని రాస్తున్నాను.

ఇంతకీ నా గురించి మీకేమీ తెలీదుకదూ! అవును. ఎలా తెలుస్తుందీ నేను చెప్పనిదే! అందుకే నన్ను నేను పరిచయం చేసుకుంటాను.

నా పేరు ఆనందరావు. ఫైనలియర్ బి. ఇ. చదువుతున్నాను. ఎత్తు అయిదు అడుగుల పది అంగుళాలు. రంగు చామనఛాయ. నాకు లలిత కళలన్నా, కథలు రాయడమన్నా యిష్టం. ఆటలంటే మహా భయం. ఆఖరికి రేడియోలో క్రికెట్ కామెంటరీ కూడా నేనెప్పుడూ వినడానికి ఉత్సుకత చూపించలేదు. అడపాదడపా సినిమాలు చూస్తాను.

ఇకపోతే మా కుటుంబాన్ని గురించి మరికొన్ని విషయాలు.

మా తల్లిదండ్రులకి నేనొక్కడ్నే సంతానం. మా నాన్నగారు విజయవాడలో ఓ ప్రైవేటు సంస్థలో మాంచి పొజిషన్‌లో వున్నారు. మాకో సొంత డాబా, ఓ పదెకరాల మాగాణి భూమీ, ఓ కారూ, ఇంటిముందు ఓ పూలతోటా, ఇంట్లో మేమెంతో ప్రేమగా పెంచుకొనే ఓ బొచ్చుకుక్కా యింకా యిలాంటివి కొన్ని వున్నాయి....

క్షమించండి! ఇంత సోదీ ఎందుకు రాస్తున్నానా? అని మీకో అనుమానం రావొచ్చు. కాని మీరు తీసుకోబోయే నిర్ణయానికి నేను పైన చెప్పిన విషయాల్లో కనీసం కొన్నైనా అవుసరం రావచ్చుననే ఉద్దేశంతో చెప్పవలసి వచ్చింది.

అవుసరం లేదనుకుంటే డిలీట్ చెయ్యొచ్చు. నో అబ్జెక్షన్!

(అవసరం పడుతుందని ఈ ఉత్తరంతోపాటు నా ఫొటోని జతపరుస్తున్నాను. పరిశీలించండి.)

లక్ష్మిగారూ!

ఇక అసలు విషయానికి వస్తాను.

మొదటిసారిగా మీ ఫొటో రాజు దగ్గర చూడ

గానే మీరు నన్నెంతగానో ఆకర్షించారు. ఎందుకు? ఏమిటి? అని అడిగితే నేను చెప్పే సమాధానం ఒక్క-టే-లవ్ ఎట్ ఫస్ట్‌సైట్, దట్సాల్! మీరు రాసిన ఉత్తరాల వల్ల మీ భావాలు, మీ ఆదర్శాలూ, అభిప్రాయాలూ నన్ను ఆకట్టుకున్నాయి. (ఉత్తరాలు కూడా దొంగతనంగానే చదివాను. మరో సారి సారీ!) అప్పుడే మీరు నా హృదయంలో ఒక ప్రత్యేకమైన స్థానాన్ని సంపాదించుకోగలిగారు. అందుకే ధైర్యం చేసి ఈ ఉత్తరాన్ని రాస్తున్నాను.

నాకు మొదటి నుంచీ ప్రేమించి పెళ్ళి చేసుకోవాలనే కోరిక వుంది. అందుకే మిమ్మల్ని చూసిన తర్వాత (ఫొటోలోనే) మిమ్మల్ని ప్రేమించాను. ఈ ఉత్తరం అందిన వెంటనే మీ అభిప్రాయం తెలియజేస్తే మా నాన్నగారితో మీ విషయం చెప్పి మన వివాహానికి ఏర్పాట్లు చేస్తాను.

నేనిలా మొదటి పరిచయంలోనే (మొదటి ఉత్తరంలోనే!) హద్దు మీరి ప్రవర్తించినందుకు, మీకు నా మీద చులకనభావం కలిగినా, నా మనసులోని మాటను నిర్మొహమాటంగా, బాహాటంగా మీ ముందు వుంచగలిగినందుకు నా కెంతగానో ఆనందంగా వుంది.

మరో ముఖ్య విషయం. రాజు కీ విషయం తెలియజేయకండి. నాకు తెలుసు-రాజుకీ విషయం తెలిస్తే బాధపడతాడనీ, నా స్నేహాన్ని అపార్థం చేసుకుంటాడనీ. అయినా నా స్వార్థం కోసం మిమ్మల్ని భార్యగా పొందాలనే ఆరాటంతో, అభిప్రాయంతో నేనీ కార్యానికి సాహసించాను. మరో దారి కనిపించలేదు. క్షమించండి.

లక్ష్మిగారూ!

ఇప్పటికే చాలా రాసి విసిగించానేమో! క్షంతవ్యుణ్ణి.

మీ జవాబు కోసం, మీ సుముఖాభిప్రాయం కోసం ఎదురుచూస్తూ—

మీ

ఆనందరావు

## 2

మహారాజశ్రీ ఆనందరావుగారిక్కి,

నమస్కారాలు!

మీ ఉత్తరమూ, ఫొటో యింతకుముందే అందాయి.

మీ ఫొటో చూడగానే (ఫొటోలో మీరు అచ్చం తెలుగు సినిమా హీరోలా వున్నారు. నిజం.) వెంటనే బోల్డంత ఆశ్చర్యపోయినా, మీ ఉత్తరం సాంతం చదివిం తర్వాత మీ మీద జాలి కలిగింది. నా మీద ఏర్పరచుకున్న అభిప్రాయానికి చాలా చింతిస్తున్నాను.

మీరు ధైర్యంచేసి నాకు ఉత్తరం రాసినందుకు నేను అన్యథా భావించడం లేదుగాని, ఒక ఆడదాన్ని అంత తక్కు-వగా అంచనా వేయగలిగినందుకే బాధగా వుంది.

ఆనందరావుగారూ!

మీ ఉద్దేశంలో ఆడది ఎంతమందినయినా ప్రేమించగలదు - అని మీరు అనుకోవచ్చు.

కాని - అది పొరపాటు.

ఆడది జీవితంలో ఒకడినే ప్రేమిస్తుంది. తన హృదయంలో ఒకడికే చోటిస్తుంది. ఆ వ్యక్తినే ఆరాధిస్తుంది. ఆ వ్యక్తి కోసమే ఎన్ని కష్టాలనయినా భరిస్తుంది. ఆ వ్యక్తి కోసరమే ఆఖరికి ప్రాణాలను కూడా అర్పిస్తుంది - అని మీరు అనుకోరేమో పాపం! మీరే కాదు, చాలామంది మగవాళ్ళు అలా అనుకోరు. అది ఆడది చేసుకున్న దురదృష్టం కాక మరేమవుతుంది. చెప్పండి.

ఆనందరావుగారూ!

నేను రాజుని ఎంతగానో ప్రేమించాను. ఒక్క-మాటలో చెప్పాలంటే అతన్ని ప్రేమించినంతగా నన్ను కూడా నేను అంతగా ప్రేమించుకోలేదు. అతి త్వరలోనే పెళ్ళి చేసుకోవాలని కూడా అనుకున్నాం. అయితే ఈ విషయం మీకు రాజు-చెప్పలేదో, లేక చెప్పినా మీ స్వార్థం కోసం మీరు నాకీ ఉత్తరం రాశారో నాకు అర్థం కావటం లేదు.

కనీసం ఈ ఉత్తరం చూసిన తర్వాతైనా మీరు మీ అభిప్రాయాన్ని మార్చుకోగలిగితే సంతోషిస్తాను. మీ ప్రేమను (మీరు చూపించినది కూడా ప్రేమేనా? ఏమో!) నిరాకరిస్తున్నాననీ, నేనీ విధంగా ఉత్తరం రాస్తున్నాననీ మీరు భావిస్తే అందుకు నేను బాధ్యురాల్ని కాదు. (ఒక వేళ మీ ప్రేమ ఫలించలేదని మీరు తెలుగు సినిమా హీరోలా గడ్డం పెంచుకుని, విరహగీతాలు పాడుకుని, ఆఖరికి ఆత్మహత్యా ప్రయత్నం చేసుకుని ఆస్పత్రిలో అడ్మిట్ అయితే, మిమ్మల్ని రక్షించడానికి, మీ ప్రేమను అర్థం చేసుకుని, మిమ్మల్ని అంగీకరించడానికి నేను తెలుగు సినిమా హీరోయిన్‌ని మాత్రంకాదు. ఇది సినిమా కథ కాదు ఎలా బడితే అలాఏ డైరెక్టరో, నిర్మాతో, ఆఖరికి ఏ హీరో యిష్ట ప్రకారమో మలుచుకోడానికి, ఇది జీవితం.) ఒక వేళ మీరు నా మీద ప్రేమతో ఆత్మహత్య చేసుకున్నా (ఆ మాట ఎందుకన్నానంటే — లవ్ ఎట్ ఫస్ట్‌సైట్ — అని మీరే అన్నారు కాబట్టి) అందుకు కూడా నేనే విధంగానూ బాధ్యురాల్నికాదు.

ఏది ఏమైనా, మీరు నా అడ్రసు సంపాదించడానికి (దొంగతనం మాత్రం అంత సులభమా?!) తీసుకున్న శ్రమకూ, ధైర్యానికీ, ధైర్యం చేసి రాసిన ఉత్తరానికీ — మీకు థాంక్స్!

ఇట్లు

లక్ష్మి

## 3

మైడియర్ లక్ష్మీ!

నేను క్షేమమే! నువ్వూ క్షేమమని తలుస్తాను.

నువ్వు ఆనందరావుగాడికి రాసిన ఉత్తరం చదివాను. నాకు చాలా చాలా మాటల్లో చెప్పలేనంత ఆనందమూ. సంతోషమూ కలిగింది,

(అదేమిటి అలా ఆశ్చర్యపోతున్నావ్? వాడికి రాసిన ఉత్తరం నేనెలా చదివాననా? చెప్తా విను. వాడు నాకు ప్రాణంతో సమానం. చిన్నప్పటి నుండీ మేమిద్దరం ప్రాణస్నేహితులం. ప్రస్తుతం క్లాసుమేట్స్‌మి కూడా)

డియర్ లక్ష్మీ!

మొదట్లో ఆనందరావు నీకు ఉత్తరం రాయటానికి ఇష్టపడకపోయినా, ఆఖరికి నా బలవంతం మీద నీకు ఉత్తరం రాయవలసి వచ్చింది. అందుకు అతడి తరపున నేను క్షమాపణలు చెప్పుకుంటున్నాను. సారీ!.... వెరీ వెరీ సారీ!!

నా కెందుకో ఈ మధ్య ఓ అనుమానం తలెత్తింది. అదేమిటో చెబితే బహుశా నువ్వు నన్ను అసహ్యించుకోవచ్చు. అయినా నీ దగ్గర దాపరికం దేనికి? చెప్తాను విను.

నువ్వు నన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నదీ,

డాక్టర్ టి. విమల

లేనిదీ తెలుసుకోవాలనే ఓ పిచ్చి ఆలోచన నా మెదడులో ఈ మధ్యనే జనించి, కుమ్మరి పురుగులా నన్ను పీడించసాగింది. అనుక్షణం దాన్ని గురించే ఆలోచించేవాడిని. అదీగాక - నీ కారెక్టర్‌ని పరీక్షించాలనే మరో పిచ్చి ఆలోచన కూడా కలిగింది. (అలా నీ కారెక్టర్ని శంకించడం ఒక విధంగా నా మీన్ మెంటాలిటీ కావొచ్చు. క్షమించు) ఆఖరికి ఈ విషయం నా మిత్రుడు ఆనందరావుకి చెప్పి, అతడి సహాయం అర్థించాను. అందుకు అతడు నీకు ఉత్తరం రాయడమూ, నీ అభిప్రాయాన్ని నిష్కర్షగా తెలియజేయడమూ జరిగాయి. అందుకు ఆనందరావుకి నేనెంతో ఋణపడి వున్నాను. అతన్ని అపార్థం చేసుకోవద్దని అతని తరఫున మరోసారి నిన్ను అర్థిస్తున్నాను.

డియర్,

నీకు నా మీద వున్న నమ్మకానికీ, ప్రేమకి నేనెంతో కృతజ్ఞుణ్ణి. నువ్వు నన్నింతగా ప్రేమిస్తున్నావని ఊహించలేకపోయాను. నీ మీద ఏవేవో అపోహలు పడి, నీ పవిత్రమైన ప్రేమను శంకించాను. పాపిష్టివాడ్ని. క్షమాపణలు అడగటానికి కూడా నేను అర్హుడ్ని కాదేమో! కాని నీ ఉదార స్వభావమూ, ఎదుటి వారిని క్షమించగలిగే ఔదార్యమూ, నీ సున్నితమైన మనసూ నాకు తెలుసు. అందుకే నన్ను క్షమించమని హృదయపూర్వకంగా అడుగుతున్నాను. క్షమిస్తావు కదూ!

మరో శుభవార్త!

మన విషయం మా ఇంట్లో చెప్పాను. మన పెండ్లికి కావలసిన అన్ని ఏర్పాట్లూ అతి త్వరలో జరగగలవు.

జరిగిన దానికి మరోసారి క్షమాపణలు చెప్పుకుంటూ—

నీ ఉత్తరం కోసం వేయికళ్ళతో ఎదురు చూసే-

నీ

రాజు

# 4

గౌరవనీయులైన రాజుగార్కి,

నమస్కారాలు!

నా సంబోధన క్రొత్తగా వుందని ఆశ్చర్యపోతున్నారులా వుంది.

మీకు తెలిసినా తెలియకపోయినా ఒక విషయం చెప్తాను. వినండి.

'ప్రేమ' ఒక పవిత్రమైన యజ్ఞం లాంటిది. యజ్ఞం చెయ్యడానికి నియమ నిబంధనలూ, నిష్ఠ, పవిత్రత ఎంత అవుసరమో, ప్రేమ ఫలించడానికి కూడా ప్రేమికులకు 'అవి' అంతే అవసరం.

ప్రేమనే పచ్చని చెట్టుకి చీడపురుగుల్లాంటి అనుమానాలూ, అపార్థాలూ అంటుకోరాదు. ఇక అవి అంటుకున్న తర్వాత ప్రేమవృక్షం ఎదగటం కష్టం. పుష్పించి, ఫలాలనివ్వటం అంతకంటే కష్టం.

విషబీజాలు అసలు తలెత్తకుండానే వుండాలి. ఒకసారి అవి తలెత్తిన తర్వాత-యిప్పుడు కాకపోయినా - ఎప్పుడో ఒకప్పుడు - పరిస్థితులు అనుకూలించనప్పుడు - అవి మొలకెత్తి, పెరిగి పెద్దవై, మహా వృక్షాలుగా రూపొందుతాయి. అప్పుడైనా మనం బాధపడక తప్పదు.

నేను మిమ్మల్ని మనసారా ప్రేమించాను. మీరు నన్ను అంత మనస్ఫూర్తిగానే ప్రేమించారని ఆశించాను.

కాని-కాని-నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నానా? లేదా? అనే అనుమానం మీలో ప్రవేశించిన క్షణమే - నా పట్ల మీకుండే ప్రేమ ఎలాంటిదో తేలిపోయిందన్నమాట!

అందుకే రాజుగారూ!

నేనో నిర్ణయానికి వచ్చాను. మన ఇద్దరి భవిష్యత్తు దృష్ట్యా మనం వివాహం చేసుకోకుండా వుండటమే అన్నివిధాలా శ్రేయస్కరం! అంత్య నిష్ఠూరం కంటే అది నిష్ఠూరం ఎంతో మంచిది.

మిమ్మల్ని ప్రాణప్రదంగా ప్రేమించి, మీ రూపాన్ని నా హృదయంలోనే నిలుపుకున్న పాపానికి - మరొకరికి భార్యనై - మనసొకచోట మనుగడ మరో చోటా భరించలేక - అసలు ఆ ఆలోచనే ఇష్టం లేక - జీవితాంతం యిలాగే-ఏకాకిగా వుండిపోవటానికి నిశ్చయించుకున్నాను.

నా నిశ్చయాలు ఎలాంటివో మీకు తెల్సు! నేనో నిర్ణయానికి వచ్చాక అది మార్చడం ఎంత కష్టమో కూడా మీకు తెల్సు! కాబట్టి మరోసారి నాకు ఉత్తరం రాయడానిగ్గానీ, నా అభిప్రాయాన్ని మార్చాలనే ప్రయత్నంగానీ చెయ్యొద్దు.

నన్ను మర్చిపోవటానికి ప్రయత్నించండి.

మనసులు కలవకపోయినా, మనం విడిపోతున్నా, సదా మీ క్షేమాన్నీ, అభివృద్ధినీ కోరుకుంటాను. అది నా విధి!

ఇట్లు

లక్ష్మీకుమారి *



## కృష్ణా గుహ

జాతీయ స్థాయిలో జరిగిన స్త్రీల వాలీబాల్ పోటీలలో గత పది సంవత్సరాలుగా పశ్చిమ బెంగాల్ జట్టు అనేక విజయాలను సాధించింది. అయితే ఈ విజయాలన్నిటికీ కూడా కారకులు ఆ రాష్ట్రంలోని చక్కటి క్రీడాకారిణులే అన్నది నిర్వివాదాంశం. అటువంటి వారిలో పేర్కొనదగిన వనిత కృష్ణాగుహ.

కృష్ణాగుహ తన పదకొండవ ఏట వాలీబాల్ నేర్చుకోవడం ప్రారంభించింది. ఆ మరుసటి సంవత్సరమే ఆమె జాతీయ స్థాయిలో జరిగిన జూనియర్స్ పోటీలకు ఎన్నికైంది. ఆ జట్టు ప్రథమ స్థానం సంపాయించింది. అప్పటినుండి కృష్ణా పశ్చిమబెంగాల్ తరఫున జాతీయ స్థాయిలో జరిగిన పోటీలలో పాల్గొంటూనే వుంది; తమ జట్టుకు బహుమతులు తెచ్చి పెడుతూనే వుంది.

1974లో సిమ్లాలోనూ, '75లో పాటియాలాలోనూ జరిగిన అంతర్విశ్వ విద్యాలయ పోటీలలో 'ఇంటర్ యూనివర్శిటీ స్టార్'గా రెండుసార్లూ ఆమె ఎన్నిక కావడం విశేషం!

అంతేకాదు-జాతీయ స్థాయిలో నాలుగు సార్లూ, రాష్ట్ర స్థాయిలో ఐదు సార్లూ ఆమె ఉత్తమ క్రీడాకారిణిగా ఎన్నుకోబడింది.

భారతదేశం సందర్శించిన పారిస్ విశ్వవిద్యాలయం జట్టుతో ఆడిన కృష్ణాగుహ 'గర్ల్ ఆఫ్ ది మ్యాచ్'గా నిర్ణయింపబడి ప్రత్యేక ప్రశంసలు పొందింది.

వాలీబాల్ ఆటలోనే కాక ఆమె యితర క్రీడలలో కూడా పాల్గొని బహుమతులు సంపాయించింది. విశ్వవిద్యాలయాలకు జరిగిన పోటీలో ఆమె 200, 220, 75 మీటర్ల పరుగు పందాలలో ప్రథమ స్థానాన్ని డిస్కస్ త్రోలో ద్వితీయ స్థానాన్ని సంపాయించింది.

—శ్రీమతి ఉమా మహేశ్వరం




# "లోధ్ర" టానిక్ వనితలకు మాత్రం!

ప్రకృతి సిద్ధమైన పద్ధతి ద్వారా ఆరోగ్యంగా ఉండడానికీ నెలలో ప్రతిరోజూ బాధలేని రోజుగా గడపడానికీ "లోధ్ర" టానిక్ తీసుకోండి! ఏ బాధా లేకుండా ఆరోగ్యమయమైన జీవితాన్ని గడపండి.

78 సంవత్సరాల నుంచీ స్త్రీల విశ్వాసానికి పాత్రమైన టానిక్.
"లోధ్ర" మందుల షాపులలో దొరుకుతుంది.

Sistas

ఉచితమైన వైద్య సలహాలకు క్రింది చిరునామాకు ఈ కూపనును పూర్తిచేసి, మీ ఉత్తరంతోబాటు జతచేసి పంపండి.

పేరు : ______________________

చిరునామా : ______________________

______________________

______________________ PIN ______

కేసరి కుటీరం (ప్రై) లిమిటెడ్
27, వెస్ట్‌కాట్ రోడ్, రాయపేట, మద్రాసు-600 014
ఏజంట్లు: శీతారామ జనరల్ స్టోర్స్ ఏజన్సీస్, విజయవాడ, సికింద్రాబాదు.

---






# హెయిర్ స్టయిలు ఏదైనాసరే హెయిర్‌స్ప్రే మాత్రం ఒక్కటే!

ఎంత అందమైన హెయిర్ స్టయిలుతో జుట్టు అలంకరించుకుంటే ఏం లాభమని. అది అలాగే నిలిచి వుండకపోతే. జుట్టు పొట్టిదైనా, పొడుగుదైనా, హెయిర్ స్టయిలు ఏదైనా, పాయిజ్ హెయిర్‌స్ప్రే, జుట్టును అదే తీరులో అట్టే వుంచుతుంది. పాయిజ్, జుట్టును సున్నితంగా, అయినా గట్టిగా పట్టుకుని వుంచి జుట్టులోని సహజ సౌందర్యాన్ని ఆ మెరుపునూ పెంపొందిస్తుంది. సరి సమానంగా స్ప్రే చేస్తుంది. దీనిని బ్రష్‌తో శుభ్రం చేయవచ్చును. జుట్టుకిక జిగట ఉండదు, చుండ్రు పట్టదు.

మీ జుట్టుకిక మరింత సింగారం



**శాంతెల్**
హెయిర్‌స్ప్రే

మీ జుట్టుకిక
మరింత సింగారం

మార్కెట్ చేసేవారు: రాలీస్ ఇండియా లిమిటెడ్

U-PHS-13 TEL

# భాషలు నేర్చుకోండి

| తెలుగు | తమిళం | కన్నడం | మలయాళం | మరాఠి | గుజరాతి | ఒరియా |
|---|---|---|---|---|---|---|
| ఘ | | ಘ | ഘ | घ | ઘ | ଘ |
| ఘా | | ಘಾ | ഘാ | घा | ઘા | ଘା |
| ఘి | | ಘಿ | ഘി | घि | ઘિ | ଘି |
| ఘీ | | ಘೀ | ഘീ | घी | ઘી | ଘୀ |
| ఘు | | ಘು | ഘു | घु | ઘુ | ଘୁ |
| ఘూ | | ಘೂ | ഘൂ | घू | ઘૂ | ଘୂ |
| ఘృ | | ಘೃ | ഘൃ | घृ | ઘૃ | ଘୃ |
| ఘౄ | | — | — | — | — | — |
| ఘె | | ಘೆ | ഘെ | — | — | — |
| ఘే | | ಘೇ | ഘേ | घे | ઘે | ଘେ |
| ఘై | | ಘೈ | ഘൈ | घै | ઘૈ | ଘୈ |
| ఘొ | | ಘೊ | ഘൊ | — | — | — |
| ఘో | | ಘೋ | ഘോ | घो | ઘો | ଘୋ |
| ఘౌ | | ಘೌ | ഘൌ | घौ | ઘૌ | ଘୌ |
| ఘం | | ಘಂ | ഘം | घं | ઘં | ଘଂ |
| ఘః | | ಘಃ | ഘഃ | घः | ઘઃ | ଘଃ |

* తమిళంలో మన క ఖ గ ఘ లకు–ఒకే అక్షరం (க) వాడతారు.

[వచ్చే సంచికలో మరికొన్ని]

# వనిత

## ఉగాది కథల పోటీ

రానున్న ఉగాదికి (ఏప్రిల్ సంచిక) వనిత–"కథల పోటీ" ని నిర్వహిస్తున్నది. ఈ పోటీలో పాత, కొత్త రచయిత్రులందరూ పాల్గొనవచ్చును.

**మొదటి బహుమతి: రూ. 500**

**రెండవ బహుమతి: రూ. 300**

**మూడవ బహుమతి: రూ. 200**

**నిబంధనలు:**

- ☐ కథాంశం సమకాలీన జీవితానికీ, ముఖ్యంగా స్త్రీల సమస్యలకూ చెందినదై వుండాలి.
- ☐ కథ తావుసైజు (ఫుల్‌స్కేప్) లో ఎట్టి పరిస్థితిలోనూ పదిహేను పేజీలకు తగ్గకూడదు; ఇరవై పేజీలకు మించకూడదు.
- ☐ కథతోపాటు–"ఇది నూటికి నూరుపాళ్ళు నా సొంతకథ. దేనికీ అనుకరణ, అనువాదం కాదు. ఇంతవరకూ ఏ పత్రికకూ, మరి దేనికీ పంపలేదు." అన్న హామీ పత్రం రాసి, సంతకం చేసి, జత చెయ్యాలి. ఎన్నిక కాని కథలు తిప్పి పంపడానికి వీలుగా, తగినన్ని స్టాంపులు అతికించిన కవర్లు (తమ చిరునామా కూడా రాసి) కథతో పాటు పంపాలి.
- ☐ పోటీలో నెగ్గిన మూడు కథలే కాకుండా, తక్కిన వాటిలో నచ్చిన కథలను ప్రచురణకు స్వీకరించే హక్కు 'వనిత' కు వుంటుంది. ఆ విషయం రచయిత్రులకు తెలియబరచడం జరుగుతుంది.
- ☐ పోటీకి పంపే కథల మీద "ఉగాది కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. కథలు–ఫిబ్రవరి 5వ తేదీలోగా మాకు చేరేలా పంపాలి.
- ☐ గెలుపొందిన కథలు ఏప్రిల్ 'వనిత' లో ప్రచురింపబడతాయి.
- ☐ కథల నిర్ణయానికీ, తక్కిన నిబంధనలకూ రచయిత్రులు–పూర్తిగా కట్టుబడి వుండాలి. ఈ పోటీపై ఎలాటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడానికీ ఆస్కారం లేదు.
- ☐ కథలు సకాలంలో చేరకపోయినా, అసలు అందకపోయినా, ఆ బాధ్యత రచయిత్రులదే.

ఉత్సాహం గల రచయిత్రులందరినీ ఈ పోటీలో పాల్గొనవలసిందిగా 'వనిత' అర్థిస్తున్నది.



ప్రపంచంలో అన్ని దేశాలలోనూ-చదరంగం మీద మోజు రోజు రోజుకు పెరిగిపోతూ వుంది. ఇటీవల ఫిలిప్పైన్స్ బోగియో నగరంలో జరిగిన చదరంగ చాంపియన్ షిప్ పోటీలలో రష్యాకు చెందిన అనటోలి కార్పోవ్ ప్రపంచ చాంపియన్ షిప్ గెలుచుకున్నారు. సోవియట్ యూనియన్‌లోని బిట్‌కండా నగరంలో జరిగిన ప్రపంచ వనితల చదరంగ పోటీలలో మాయా చిబ్బుదానిట్‌జె-అనే పదిహేడేళ్ళ యువతి చాంపియన్ షిప్ గెలుచుకుంది. అంతేకాదు - ఇంతవరకు జరిగిన పోటీలలో ప్రపంచ చాంపియన్ షిప్ గెలుచుకున్న వారిలో రష్యాకు చెందినవారే ఎక్కువ సంఖ్యలో వున్నారు.

ప్రపంచంలోని పలు దేశాలలో చదరంగం మీద ఆసక్తి కనబరచినప్పటికీ - రష్యావారే ఎక్కువగా గెలుపొందడానికి కారణం - ఆ ఆటకు రష్యాలో ఎక్కువ ఆదరణ, ఉత్సాహప్రోత్సాహాలు వుండడమే! వారు అందించే శిక్షణకు ఒక చక్కటి ఉదాహరణ - చదరంగ పాఠశాల!

సోవియట్ యూనియన్ రాజధాని మాస్కో నగరంలో మనోహర ప్రకృతి దృశ్యాలకు మధ్య ఓ అందాల భవనం! బాలల వినోదాల కోసం నిర్దేశించబడిన ఆ భవనంలో ఒక థియేటర్, ఒక సంగీత బృందం...సినిమా నిర్మాణం జరిగే విభాగం... ఒక చిన్న జంతుప్రదర్శనశాల....మొదలైనవి ఉన్నాయి. ఆ భవనంలోని గదులలో ప్రతి పూటా పిల్లల చిరునవ్వులు, కేరింతలు ప్రతిధ్వనిస్తాయి. అయినా అదే భవనంలో కొన్ని నిర్ణీత స్థలాలు ప్రశాంత నిలయాలుగా వుంటున్నాయి. ఆ ప్రశాంత వాతావరణంలోనే భావికాల చదరంగ చాంపియన్లకు శిక్షణ ఇవ్వబడుతూ వుంటుంది.

అలెగ్జాండర్ కోస్టియేవ్ పర్యవేక్షణలో పిల్లల చదరంగ శిక్షణ తరగతులు నిర్వహించబడుతున్నాయి. చదరంగంలో పట్టభద్రులైన ఉపాధ్యాయులు, చదరంగ క్రీడా నిపుణులు పిల్లలకు చదరంగంలో శిక్షణ ఇస్తారు,

చదరంగం కళ, విజ్ఞాన విశిష్టాంశాల మిళిత

బాలలకు

# చదరంగ పాఠశాల

మైన క్రీడ. ఈ శిక్షణా సమయంలో ఉపాధ్యాయుల పాత్ర చాలా ముఖ్యమైనది. విద్యార్థులలో నివురు గప్పిన నిప్పులావున్న శక్తిసామర్థ్యాలను గుర్తించి బయటికి తీసుకురావడం, వారి లోపాలను నివర్తించడం చాలా ముఖ్యం!

ఈ పాఠశాలలో సుమారు నాలుగువందల ఏభైమంది శిక్షణ పొందుతున్నారు. వీరిని ముప్పై ఒక్క బృందాలుగా విభజించారు. పాఠాలు చెప్పడానికి పన్నెండుమంది ఉపాధ్యాయులు వుంటున్నారు. వీరేకాకుండా ఇక్కడి విద్యార్థినీ విద్యార్థులకు ఒక చక్కటి అవకాశం వుంది. సుప్రసిద్ధులైన చదరంగ క్రీడా నిపుణులలో గోష్ఠులు జరపడం - తమ సందేహాలను ప్రత్యక్షంగా అడిగి తెలుసుకోడం, ఆటలోని మెలకువలను తెలుసుకోడం - మొదలైనవి విద్యార్థుల నైపుణ్యానికి మెరుగులు దిద్దడానికి ఎంతో దోహదం చేస్తాయి.

ఈ పాఠశాలలో శిక్షణ పొందినవారే - ఇద్దరు ప్రపంచ జూనియర్ చాంపియన్ షిప్‌లు గెలుచుకోవడం గమనించదగ్గ విషయం. 1975 సం॥ యుగోస్లోవియాలో జరిగిన ప్రపంచ జూనియర్ పోటీలలో- వేలెరిజెకోవ్ గెలుపొందారు. గత సంవత్సరం ఆస్ట్రియాలో జరిగిన పోటీలలో ఆర్థర్ యూసుపోవ్ విజయం సాధించారు! ☐

ఈ ప్రక్క వర్ణచిత్రంలో కనిపిస్తున్న బాల – చదరంగపు 'చాంపియన్‌షిప్' పొందడానికి కృషి చేస్తున్న ఆ పాఠశాల విద్యార్థిని–మాస్కోవిట్ ఒలియా ఒర్లోవా.

వర్ణచిత్రం : వి. రొడియోనోవ్



# పెరటితోట పెంపకం



—లలితకుమారి

**ఎ. ఆర్. అరుణ, అత్తూరు**

నైట్‌క్వీన్ చెట్టు బాగా వ్యాపించకుండా వుండాలంటే కట్ చేసి పెంచవచ్చునా....లేక అట్లా చేస్తే మొక్క నశించిపోతుందా ?

నైట్‌క్వీన్ పూత ప్రారంభమై పువ్వు పూచే టప్పుడు కట్ చేయకూడదు. అలా చేస్తే మొదటికే మోసం వచ్చినట్లు చెట్టు నశించి పోతుంది. అలాకాక పువ్వులు బాగా పూచిన తరువాత మనకు కావలసిన పరిమాణానికి కట్ చేసుకోవచ్చును.

**నివేద, నిజామాబాద్**

మా యింట్లో వున్న లిల్లీ చెట్లకు, పోయిన సంవత్సరం వరకు మొగ్గలు బాగానే వచ్చాయి. ఈ సంవత్సరం యింకా మొగ్గలు రాలేదు. కారణం తెలియడం లేదు. మొగ్గలు వచ్చేందుకు తగిన వుపాయమేదైనా చెప్తారా ?

లిల్లీ మొక్కలు దుంప మొక్కల జాతికి చెందినవి. వీటినే 'బల్బ్స' అని కూడా అంటారు. ఇవి వేసవి ప్రారంభంలో వర్షాలు పడగానే పువ్వులు పూస్తాయి. ఆ తర్వాత ఆకు వస్తుంది. ఆకు వచ్చిన తరువాత కొన్ని వేసవి రాగానే ఎండిపోతాయి. అందుకే వీటిని కంద, చేమలాగే దుంపల్ని భాగాలుగా చేసి వేస్తే కొత్త మొక్కలువచ్చి మొగ్గలు వేస్తాయి. మరో విషయం మరచిపోకూడదు. భూమిలో లోపం కూడా వుండి వుండ వచ్చును. వ్యవసాయ శాఖవారికి ఆ మట్టి చూపితే అందులో లోపం వున్నదీ లేనిదీ చెబుతారు.

మా నేలలో వానపాములు ఎక్కువగా వున్నాయి, ఏమి చెయ్యాలి ?

అమ్మోనియం సల్ఫేట్ కొంచెం తీసుకుని నీళ్ళలో బాగా కలపాలి. ఈ మిశ్రమాన్ని మామూలుగా నేలమీద చల్లే కన్న, మొక్కలకు నీళ్లు పోసేందుకు వుపయోగించే 'జెల్లి పాన్'లో వేసి జల్లుతే వానపాములు పైకి వచ్చి చచ్చి వూరుకుంటాయి. ఈ అమోనియం సల్ఫేటు చూడడానికి అచ్చం వుప్పు లానే వుంటుంది. అంచేత వంటింట్లో మాత్రం వుంచకండి సుమా !

**జి శకుంతలాదేవి, రామచంద్రాపురం**

ఏమండీ....మా యింట్లో నాలుగు సంవత్సరాల క్రితం సపోటా చెట్టు (బర్రె సపోటా) వేశాము. బాగా ఎత్తుగానే పెరిగింది. రెండు సంవత్సరాల నుంచి పూతపూసి రాలిపోతోంది. ఒకసారి కంపోస్ట్ ఎరువు, పశువులపెంట వేశాము. కాని ఏమీ గుణం కనబడలేదు. పూత నిలిచేందుకు ఏదైనా సలహా చెబుతారా ? మా ఆయన చెట్టు పీకేద్దాం అంటూన్నారు ఏం చెయ్యమంటారు ?

మీ వారు చెప్పినట్లు ఆ చెట్టు తీసెయ్యడం వుత్తమం. ఎంచేతంటారా ? బర్రె సపోటా చెట్టు కాసినా తినడానికి రుచిగా వుండదు. పాల సపోటా వేసుకుంటే బాగుంటుంది. అది కూడా అంటుకట్టిన పాల సపోటా మొక్కలనే నాటండి. అవైతే త్వరగా పెరుగుతాయి. గింజ నాటి మొక్కలు రావాలంటే బాగా టైం పడుతుంది.. ఈ పాల సపోటా మొక్కలైనా సరే మొదటి సంవత్సరం కాపు రానివ్వకూడదు. పిందె తీసెయ్యాలి. మరుసటి సంవత్సరం నుంచి అవి బ్రహ్మాండమైన కాపు కాస్తాయి.

**వి. సత్యాదేవి, విజయవాడ**

మా పెరట్లో నిమ్మగింజ పడి మొలిచిన చెట్టుకి తొమ్మిది సంనత్సరాలు నిండాయి. చెట్టు పెద్దదిగానే వుంది. రెండేళ్ళ క్రితం పువ్వు పూసింది. కాని కాయలు రాలేదు. మళ్ళీ పూచి బాగా కాయాలంటే దానికి ఏ ఎరువు వెయ్యాలో చెప్తారా ?

నిమ్మ చెట్లు కాపు కాయడానికి ఏడు సంవత్సరాల నుంచి పది సంవత్సరాలదాకా పడుతుంది. చాలామంది ఒక పొరపాటు చేస్తూ వుంటారు. కొబ్బరి, నిమ్మ, మామిడి వంటి చెట్లన్నీ కూడా ఎదిగినకొద్దీ వాటి వేర్లు భూమిలో విస్తరిల్లుతూ వుంటాయి. వాటిని నాటేటప్పుడు కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. అంతేకాని టేబుల్ రోజ్‌లూ అవీ నాటినట్లు చిన్న గొయ్యితీసి అందులో నాటితే లాభం లేదు. నిమ్మచెట్టు స్కంధానికి మూడు అడుగుల పొడవు, ఒక అడుగు వెడల్పు ఒకటిన్నర అడుగు లోతులో ఒక కందకం తవ్వాలి. అప్పుడు చెట్ల వేర్లన్నీ కూడా అక్కడే వుంటాయి. చెట్టుకు పోసే నీరు, వేసే ఎరువు ఆ వేర్లకి సక్రమంగా అందుతుంది. చెట్టు బాగా కాపు కాస్తుంది. ఇక ఎరువులంటారా....పశుపెంట శ్రేష్టం. చెత్త ఎరువు కూడా వేయవచ్చును. రసాయనిక ఎరువులు వుపయోగించే మాటైతే ఒక విషయం జ్ఞాపకం వుంచుకోవాలి. వాటిని ఆర్గానిక్ ఎరువులతో కలిపి వెయ్యాలి. విడిగా ఎన్నడూ వేయకూడదు. రసాయనిక ఎరువులు వేసినప్పుడు చెట్టుకి బాగా నీరు పొయ్యాలి. లేకపోతే వాటి వేడి, చెట్టుని మాడ్చేస్తుంది !

**ఎల్. సత్యవతి, కోరుకొండ**

మా పెరటిలో వంగ, బెండ, బీర పాదులు పెట్టాం. వంగ తోటకు చీడపురుగు పట్టింది. బీర ఆకులు



## కూరలు-పోషక పదార్థాలు

**పొట్లకాయ:**

పొట్ల తీగ జాతికి చెందినది. పొట్లపాదులో తియ్యపొట్ల, చేదుపొట్ల, లింగపొట్ల అని మూడు రకాలు వున్నాయి. అయితే మన రాష్ట్రంలో విశేషంగా లభిస్తున్నది తియ్యపొట్ల. పొట్ల తీగ చాలా బాగా విస్తరిస్తుంది. గెలలకి పువ్వులు పూస్తాయి. ఇవి తెల్లగా వుంటాయి. పిందెతో పుట్టిన పువ్వులు మాత్రమే కాయలు కాస్తాయి. సాధారణంగా ఈ రకం పొట్లకాయలు బారెడు పొడుగు వుంటాయి. వీటికి తెల్లటి చారలు వుంటాయి. లింగపొట్ల జానెడు పొడుగువరకే పెరుగుతుంది. ఇవి జంట కాయలుగా కాస్తాయి. పొట్ల ఆకు, కాడ, వేరు, కాయ-యివన్నీ కూడా ఆయుర్వేద వైద్యంలో వుప యోగించబడుతున్నాయి.

ప్రతి 100 గ్రాముల పొట్లకాయలోనూ - 94.1 గ్రాముల తేమ, 0.5 గ్రా॥ ప్రొటీన్లు, 0.3 గ్రా॥ క్రొవ్వు పదార్థం, 0.7 గ్రా॥ ఖనిజ పదార్థం, 4.4 గ్రా॥ పిండి పదార్థం, 0.05 గ్రా॥ కాల్షియం, 0.02 గ్రా॥ భాస్వరం, 1.3 మిల్లిగ్రాముల ఇనుము, 160 యూనిట్ల విటమిన్ ఏ, 0.04 మిల్లిగ్రాముల విటమిన్ బి, 0.3 మి. గ్రా॥ నికోటినిక్ ఆమ్లం, 0.04 మి. గ్రా॥ రిబోఫ్లోవిన్, 1.0 మి. గ్రా॥ ఆక్సాలిక్ ఆమ్లమూ వున్నాయి. వీటి కెలోరీల విలువ 22.

పొట్లకాయ కూరకి ఉపయోగపడుతుంది. కొందరు పప్పు కూడా చేసుకుంటారు. పొట్లకాయ సన్నగా తరిగి వుడికించి తాలింపు పెట్టి నువ్వుపిండి, లేక కొబ్బరికోరు, వేసి వండుకుంటే రుచిగా వుంటుంది.

పొట్లకాయ పథ్యానికి వుపయోగపడుతుంది. గుండెకు మేలు చేస్తుంది. వీర్యవృద్ధి కలుగజేస్తుంది. వాత రక్తాన్ని హరింపజేస్తుంది. క్రిమి రోగాలను పోగొడుతుంది. పొట్ల ఆకుతో వండిన కూర పైత్యాన్ని నశింపజేస్తుంది. చలువ చేస్తుంది. శ్లేష్మాన్ని వుపశమింపజేస్తుంది. కామెర్లరోగం శమింపజేస్తుంది. నేత్రరోగం, వాపు, వ్రణం పోగొడుతుంది. పొట్ల వేరు–పిత్తం, కఫం - వీటిని హరింపజేస్తుంది. ఇది విరేచనకారి, పథ్యకరమైనది - అని ఆయుర్వేద వైద్యులు చెబుతారు.

పసుపుగా వున్నాయి. చీడపురుగులు పోవాలంటే ఏ మందులు వాడాలి?

మీ వూరికి సమీపంలోనే విజయనగరం వుంది. అక్కడి హార్టీ కల్చరల్ శాఖ వారికి చూపిస్తే ఆకు చూసి మందు యిస్తారు. చీడ పురుగులలో అనేక రకాలు వున్నాయి. పరిశీలిస్తేగానీ మందు చెప్పడం కష్టం.

తోటకూర ఏపుగా రావడం లేదు. ఏం చేస్తే వస్తుంది?

గోకినట్లు తవ్వి విత్తనం వేస్తే ఏమొస్తుంది? బాగా రెండు అడుగుల లోతుకి తవ్వి విత్తనం వేసి ఎరువు బాగా వెయ్యండి. తోట కూరే కాదు–ఏ ఆకు కూరైనా ఏపుగానే వస్తుంది.

**ఆర్. ఇందిర, కొరుగుంటపల్లె**

మా ఇంట్లో క్రింది స్థలంలో చెట్లు పెంచడానికి జాగా తక్కువగా వుంది. కుంపట్లలో ఏ ఏ మొక్కలు పెంచవచ్చును? సీజనల్స్ కాకుండా ఎప్పటికీ వుండేటటువంటివి పెంచాలనుకుంటున్నాము.

మందార, గులాబి, క్రోటన్స్, నందివర్ధనం మొదలైనవి పెంచండి!

**కె. భారతీదేవి, మహబూబ్‌నగర్**

మా యింట్లో రెండేళ్ళ క్రితం ఒక జామ చెట్టు నాటాము. అది బాగా పెరిగి ఎనిమిది అడుగుల ఎత్తు వచ్చింది. జామ చెట్టుకు పూత ఎన్ని సంవత్స రాలకు వస్తుంది. ఏ ఎరువు వాడాలి?

జామ చెట్టుకు పూత వచ్చి కాయలు కాయ డానికి నాలుగైదు సంవత్సరాలు పడుతుంది. అంటుకట్టిన మొక్క అయితే మొదటి సంవత్సరం నుంచే కాపు కాస్తుంది. అంతే కాదు. అంటుకట్టిన మొక్కలు విరివిగా కాస్తాయి కూడా. అయితే వీటిని అప్పు డప్పుడు కట్ చేస్తూ వుండాలి.

**డి. సుశీల, కొలనూరు**

మా పెరట్లో గులాబి, కనకాంబరం, మల్లి, చేమంతి నాటడానికి ప్రయత్నించాము. కాని ప్రయోజనం లేకపోయింది. గులాబి, కనకాంబరాలు ఎలా నాటాలో, ఏఏ ఎరువులు వేయాలో తెలియజేస్తారా?

మీరు చెప్పిన మొక్కలన్నీ కూడా అంటు కట్టినవైతే త్వరగా పూతనిస్తాయి. తొమ్మిది అంగుళాలమేరకు కొమ్మ కత్తిరించి భూమిలో పాతినట్లయితే మొక్క తయారై సిద్ధంగా వుంటుంది. గులాబీలకైతే ఆర్నెల్ల కొకసారి టాప్ డ్రెస్సింగ్ (Top Dressing) చెయ్యాలి. గులాబీలకి ఎర్రమన్ను (కంకర కాదు) గుర్రపుపెంట శ్రేష్ఠమైన ఎరువులు. సూపర్‌ఫాస్పేటు వంటి రసాయనిక ఎరువులు కూడా వాడవచ్చును. కాని అవి మొక్కకి తగ్గట్టు తగిన పాళ్ళలో వేయాలి. అవి ఎలా వాడాలో తెలియకుండా వాడితే మొక్కల్ని చంపేస్తాయి. ఆరునెల్ల తర్వాత పైనున్న భాగాన్ని ఆరంగుళాల మేరకు తీసేసి ఎముకలపొడి (Bone meal) వెయ్యాలి. కనకాంబరాలకి పశుపెంట శ్రేష్ఠమైన ఎరువు.

కేశ
సంపదకు
రీటా




RAZI

స్త్రీలూ పురుషులూ వాడవచ్చును * సూపర్ ఎకానమి (100 ml) సైజులో కూడా వస్తున్నది

## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు-43' చందమామ బిల్డింగ్స్, మద్రాసు – 600 026 చిరునామాకు జనవరి 25 వ తేదీలోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1979 మార్చి సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనుక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు – అడ్డము

1. ఇటీవల 'వనిత' అట్ట మీద వచ్చిన ఒక కళాకారిణి
2. విలాసం ఒలకబోసే వనిత
3. విలువగలది
4. సినిమా తారలకే కాదు - నాటకాల్లో నటించే వాళ్ళకి కూడా తెలిసివుండాలి
5. ఎండాకాలపు కాయ
6. భూమి మీద నడవలేదు; గాలిలో ఎగరలేదు.
7. భూదేవి సుగుణం అన్నారు పెద్దలు
8. నాలుగు అర్థంతో సంబంధం గల మాట— తిరగబడింది
9. మహాభారతం అంతటి గొప్పదైన వంటకంట!– కాని, ఇక్కడ తిరగబడింది
10. దండ వేసుకున్నవాడూ, తోట చూసుకునేవాడూ ఒకడే అందుకే తిరగబడ్డాడు!
11. చెట్టు మీద స్త్రీ ?
12. పార్వతి పుత్రుని వాహనాన్నే భక్షించగలదే- సవ్యంగా చదివితే తెలుస్తుందా!
13. వేదభాగంతో సమానమైన పండు ?
14. తియ్యనైనది తిరగబడింది; అందువల్ల చివర తెగింది

### ఆధారములు – నిలువు

1. ఉన్నప్పుడు దీని విలువ తెలీదు; లేనప్పుడు మాత్రం బాగా తెలుస్తుంది!
4. ప్రవర్తన
9. పదకొండు అడ్డంలో వున్నదానికి-పుడుతుంది
10. వయసు మళ్ళడంతో తారుమారు
11. తలిదండ్రులకు ఆడపిల్ల-
15. చెవి అవసరం లేని ఒక తాళం
16. మాయ చెయ్యగలవాడు గనక చెల్లాచెదురుగా వున్నాడు
17. మొదటి అక్షరాన్ని పూర్తిగా తీసేస్తేగాని, ఇరవైఏడు ముత్యాలుగల ఒంటిపేట హారం దొరకదు!
18. వీడూ మాయం చెయ్యగలవాడే - వీడు తిరగబడ్డాడు!
19. సర్పానికి వెనక కొమ్ము వుండాలి. లేదని కాబోలు, తలకిందులైంది
20. వెనక
21. వనిత

## వనిత మాటల కొలువు-43

## రూ 150లు బహుమతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 15 | ■ | ■ | 2 | 16 | |
| | ■ | 3 | 17 | | ■ | | ■ |
| ■ | 4 | | | ■ | 5 | | 18 |
| 6 | | ■ | 7 | 19 | ■ | ■ | |
| ■ | | ■ | 8 | | ■ | 9 | |
| 20 | ■ | 10 | | ■ | 11 | | ■ |
| | ■ | 12 | | | | ■ | 21 |
| 13 | | | ■ | ■ | 14 | | |

పేరు ____________________

చిరునామా ____________________

# నా చరిత్ర

నా పుట్టుకే ఒక చరిత్ర
ఈ ధరిత్రిపై సువర్ణ లిఖితమై
నిలిచి వెలిగే పవిత్ర గాథ
నా పుట్టుకే ఒక చరిత్ర.

నేను పుట్టాలని తహతహలాడుతూ
వేయికళ్ళతో ఎదురు చూసే కొందరూ
నన్ను అరికట్టాలని రుసరుసలాడుతూ
కోటి ప్రయత్నాలు చేసిన మరి కొందరూ
అందరూ గిజగిజలాడుతూన్న సమయంలో
నేను పుట్టనే పుట్టేశాను
నా చిరునవ్వుల ఊసులాటలతో
అందరినీ మైమరపించాను.

ఎవరిదారిన వారు నడిచే నా అన్న లిద్దరూ
నేను పుట్టిన క్షణం నుంచీ
జతగా నడవడం నేర్చుకున్నారు
పండగకీ పబ్బానికీ కలిసి
నిండుగా నవ్వడం అలవాటు చేసుకున్నారు
కలిమిలో కలలు పెంచుకుని
లేమిలో కన్నీళ్ళు పంచుకుని
ఏపుగా పెరిగారు
చిరునవ్వుతో ఎదిగారు.

ఏ ఖర్మ ఫలమో! ఏ నోటి శాపమో!!
ఆ మధ్యన వారి మధ్య ఏర్పడ్డ పొరపొచ్చాలు
నా గుండెను పిండేశాయి
నా మనస్సును ముక్కలు ముక్కలు చేశాయి.
అయితే ఏం?
కుళ్ళుబోతుల కుతంత్రాలు ఫలించలేదు
స్వార్థపరుల స్వప్నాలు నిజంకాలేదు.

నా అన్నదమ్ముల అనుబంధాన్ని
ఎవ్వరూ తెంచలేకపోయారు
వారి మధ్య అల్లుకుపోయిన
అనురాగ లతలను తుంచలేకపోయారు.

నా కళ్ళలో విరిసింది కొత్తకాంతి
నరనరాన ప్రవహించింది రక్తానికి బదులు శాంతి
నలువైపుల నవరాగ చైతన్య మారుతం వీచింది
మది మృదు మధుర మధుగీతి పాడింది.

నా తెనుగువాడ, అందాలపూల మేడయై నిలిచింది
నా ఎడదలో నావాకిటి ముంగిట్లో
నవ్వినవి విద్యుద్దీప మాలికలు
నేడు ప్రతి ఊరున నిల్చినవి
దీపావళిలా చీకట్లను పార్రదోలి
దీపాల తోరణాలు.

ప్రతి పౌరునికి విద్యామృతము
త్రాపు చూన్నది సరస్వతి స్వయముగా
ప్రతిగ్రామిక జీవిక, జీవితాశలు పండగా
లక్ష్మియే దిగి వచ్చి పంచుతూన్నది
ప్రజాస్వామ్య సంపద.

ఊరూరా పాఠశాలలూ, ఉచిత విద్యా సౌకర్యాలూ
ఆరోగ్యం, ఉద్యోగం, పొందగలిగే అవకాశాలు
ఎన్నెన్నో వెలిశాయి, ఎల్లరినీ ఆహ్వానిస్తున్నాయి.

భుజం భుజం తట్టి, చేయి చేయి కలిపి
ప్రజాబలం సాగుతోంది
సహకారం సమానత్వం మంగళగీతులు
పాడుతోంది.

కృష్ణ వేణీనదీ జలాల నిర్మించారు
నాగార్జున సాగర మహాలయము
కన్నుల విందు చేయు సౌందర్య నిలయమ్ము
చీకటులు గూళ్ళు కట్టిన గుడిసెలలో
ప్రగతి కాంతులు వీచుచున్నవి
లేమివాడిలో నిదురించిన పేదబతుకులలో
కొత్త ఆశలు మొగ్గ తొడిగినవి.

నేడు అడుగడుగున అగుపిస్తూన్నది
జాత్యైక్యత, విశ్వప్రేమ కలిసి మెలిసి
నవ్య జీవితాభ్యుదయ మహోత్సవము చేయుచూ
గోదావరీ కృష్ణా కూడి నాట్యమాడుతూన్నవి
మహాంధ్రోదయ సౌభాగ్య మహిమ పాడుతూ

నా పుట్టుకకే ఒక అర్థమేర్పడింది
నా జీవితానికొక ధ్యేయమగుపడింది
అందరూ అంటారు ఇప్పుడు
ప్రౌఢత్వంతో పాటు సకల అందాలను
సంతరించుకున్న నన్ను చూసి,
"ఆంధ్ర లక్ష్మి! నువ్వెంతో అదృష్టవంతురాలివనీ,
నీ కెంతో రమ్యమైన భవిష్యత్తు వుందనీ!!"
అందుకే నా కనిపిస్తుంది
నా పుట్టుక కాదు చరిత్ర!
నేనే చరిత్రనై నిలవాలని!!

—శారదా అశోకవర్ధన్

సశేష నవల




విమలారామం

అతని భుజం మీద అనునయంగా చేయి వేసింది మాధవి. ''మీరెంత బాధపడుతున్నారో నాకు తెలుసు. మీ మనసు నాకు తెలుసు. మీరేమన్నా నేను తప్పుగా తీసుకోను. అక్కయ్య లాగే మనమూ ఓపికపట్టాలి. బావగారే ఒకనాటికి మారతారు।''

''ఏం మారతాడో యేమో। ఇన్నాళ్లు మనల్ని పీక్కు తినటం అయింది. ఇప్పుడు నోట్లు కూడా వ్రాసి అప్పు చేస్తున్నాడు....''

''అక్కయ్యని రానివ్వండి. అన్నీ అవే సర్దుకుపోతాయి.''

''ఆవిడ వెళ్లి నెల పైగా అయింది. అక్కడే ఉండిపోయింది. వస్తాను వస్తానంటూ వ్రాస్తుందే కాని రాదు. ఇక్కడ యింట్లో ఎంత గొడవవుతోందో ఆవిడకి తెలియటం లేదు।'' వదినగారు రాకపోవటం కూడా అతనికి కోపం తెప్పించింది.

''పోనీ, మీరొకసారి వెళ్ళి చూసి రాకూడదూ? వస్తానంటే వెంట తీసుకురావచ్చు.''

''ఏమో? ఆవిడకక్కడే సుఖంగా ఉందేమో! ఉండనీ।....''అన్నాడతను నిష్ఠూరంగా.

''అది కాదండీ! ఏ కారణం లేందే అక్కయ్య యింతకాలం అక్కడుండి పోదు. నాకేమిటో దిగులుగా ఉంది. పోనీ, ఈ శనివారం దాకా చూసి రాకపోతే ఒక్కసారి వెళ్లి చూసి రండి.''

భార్య అనునయమైన మాటలతో అతనికి కొంత మనశ్శాంతి దక్కినట్టనిపించింది. అలాగే వెడతానన్నాడు.

## 45

ఆ కమ్మని కంఠం నుంచి తేనె సోనలై పారుతోంది. ఆ మాధుర్యానికి ఆకలిదప్పులు మరిపించే శక్తి వుంది. ఆ గొంతులోని చిత్రమైన కంపనకు శ్రోతల గుండెల కుదుళ్ళను కదిలించే సామర్థ్యముంది। ఆ పాట వ్రాసినవాళ్ళెంత అదృష్టవంతులు। ఇప్పుడా పాట వింటున్నవాళ్ళెంత భాగ్యవంతులు।

గాయని తపస్వినిలా వుంది. శ్రోతలు తన్మయులై వూగుతున్నారు.

మురళీమోహన్ కృష్ణవేణి పుట్టింటివారింట అడుగుపెట్టేసరికి అతనికి కనిపించిన దృశ్యం అది।

వీధి అరుగు మీద ఆడుకుంటున్న నారాయణ ''అమ్మోయ్। బాబయ్యొచ్చారు....'' అంటూ లోపలికి పరిగెత్తుకువెళ్ళి చెప్పి వుండకపోతే వదినగారి పాటను బయిట కూర్చుని పూర్తిగా విన్నాకనే లోపలికి వెళ్ళిందేవాడతను.

కృష్ణవేణి తల్లి జానకమ్మ అతనికి మంచినీళ్లు తెచ్చిచ్చింది.

కృష్ణవేణి లేవబోతుంటే ''...నువ్వుండవే కృష్ణా। మళ్ళీ వస్తానులే।'' అని ఆమె భుజం తట్టింది ఒకావిడ.

''నేనిదివరకు నా ఫ్రెండు కాత్యాయిని గురించి చెపుతుండేదాన్ని....ఆవిడే ఈవిడ।.... అతను మామరిది మురళీమోహన్।'' అని పరిచయాలు చేసింది కృష్ణవేణి.

కాత్యాయిని, పాట వినటానికి వచ్చిన యిరుగూ పొరుగూ అంతా కృష్ణవేణితోను – జానకమ్మ తోనూ చెప్పి వెళ్ళిపోయారు. జానకమ్మ పేరు పేరునా అందరి క్షేమం గురించి అడిగింది. మురళీ జవాబులు చెప్పాడు.

ఆవిడింకా ఏదో అనబోతూంటే ''కాఫీ పెట్టమ్మా।'' అంది కృష్ణవేణి.

ఆవిడ వంటింట్లోకి వెళ్ళిపోయింది.

కొడుకుని పిలిచి బాబాయికి నీళ్ళివ్వమని పురమాయించి–అతన్ని ముఖం కడుక్కోమంది కృష్ణవేణి.

మౌనంగా కూర్చున్న మరిదిని చూసి "నేనూ ఒకటి రెండు రోజుల్లో బయలుదేరి వద్దామనుకుంటున్నాను। ఇంతలో నువ్వే వచ్చావు। పోనీలే కలిసి వెళ్ళిపోదాము.'' అంది కృష్ణవేణి చిన్నగా నవ్వుతూ.

''తొందరేముంది? నీకిక్కడ వుండాలనిపించినంత కాలం వుండు....'' అతని గొంతులో ఏదో నిష్ఠూరం ధ్వనించింది.

ఆమె మౌనంగా కూర్చుండిపోయింది.

''వస్తాను వస్తాను అంటూ రెండు మూడు సార్లు వ్రాసావు...ఎందుకు రాలేదో అని మేమంతా కంగారుపడ్డాము........'నాకేదో భయంగా వుంది' అంటూ వెళ్ళి చూసి రమ్మని మీ చెల్లెలు నన్ను తరిమింది...''

చలనం లేని బొమ్మలా ఆమె అలాగే చూస్తూ వుండిపోయింది.

ఆమె మౌనం మురళికి మరింత కోపం తెప్పించింది. ''ఎవరి సుఖానికి ఎవ్వరూ అడ్డు రారు. నీకిక్కడ వుండాలన్నంత కాలం వుండు. నేను తీసుకువెడదామని రాలేదు. చూసిపోదామని వచ్చాను. అంతే।''

కృష్ణవేణి ముఖం ఎర్రబడింది. కనుకొలకుల్లోకి నీళ్ళు చిప్పిల్లాయి. అతను చూసాడు కాని.... ఇప్పుడతని మనస్సు చలించలేదు. ఆమె యిది వరకన్నా చిక్కినట్టు కనిపిస్తున్నా అతని కదంతా పట్టలేదు।

''....చెప్పాలో చెప్పకూడదో నాకు తెలియదు కాని అక్కడ అన్నయ్య పరిస్థితి ఇంకా పాడయిపోయింది. నోట్లు వ్రాసి అప్పు చేస్తున్నాడు.... ఇంతకాలం ఈ సంగతి ఎవరికీ తెలియకుండా దాచుకుంటూ వచ్చాం. మా మామగారికి ఎవరో చెప్పారుట ఆయనొచ్చి యింట్లో అందర్కీ చెప్పారు. అమ్మ ఒక్కటే ఏడుపు. ఇదేం పనిరా అని అమ్మ అడిగితే నోటికివచ్చినట్టు మాట్లాడాడు అన్నయ్య. ఇంతగా పాడయిపోతాడని నేనెప్పుడూ అనుకోలేదు.''

కృష్ణవేణి కళ్ళు మూసుకొని గోడకి దారగిలబడింది. ఆమె కన్నీళ్ళు బుగ్గల మీదకి నెమ్మదిగా జారాయి.

''నువ్వొక్కడుంటే ఇంత ఘోరం జరిగేది కాదు....'' అని యింకా తల త్రిప్పుకుని ఏదో చెప్పబోతున్నాడతను.

''అమ్మమ్మా! అమ్మకి మళ్ళీ ఫిట్టొచ్చింది....'' అంటూ గట్టిగా కేకపెట్టాడు నారాయణ.

జానకమ్మ వంటింట్లోంచి పరుగు పరుగున వచ్చింది. తాళం చెవుల గుత్తి తెచ్చి ఆమె గుప్పెడు విడదీసి పెట్టింది....నారాయణ ఏదో సీసా తెచ్చి తల్లి ముక్కు దగ్గర పెట్టాడు.

మురళికి గుండెలు దడదడలాడాయి.

''నీకెప్పటికి తగ్గుతుందేమ్మా!....'' అని గద్గద స్వరంతో గొణుక్కుంటూ కూతురికి సపర్య చేస్తోంది జానకమ్మ.

కన్నది, విన్నది మురళికి మతిపోగొట్టేసింది. "ఏమిటండీ! వదినకి ఫిట్సా?....ఎప్పట్నించి?...." అంటూ కంగారుగా ప్రశ్నలవర్షం కురిపించాడు.

జానకమ్మ కూతురి కళ్ళు తుడిచి – తన కళ్ళొత్తుకుంది. కూతురి తలను తన గుండెలకి చేర్చుకుంది. ''ఏం చెప్పను నాయినా? నెల రోజుల్నించీ దీని పరిస్థితి యేమీ బాగాలేదు....''

''ఏం జరిగిందండి?'' అని తొందర పెట్టాడు.

ఆవిడ చెప్పింది....కృష్ణవేణి శ్రీకాంత్‌తో మనుగుడుపులకి వెళ్ళింది. ఆడపెళ్ళివారింటి ముందు పిల్లలు వీధిలో ఆడుకుంటూండగా డీ పోట్ల ఎద్దు పరిగెత్తి వచ్చిందిట. అంతా భయంతో అటూ యిటూ పారిపోయారు....ఆడపెళ్ళివారమ్మాయి వీధి మధ్యలో వుండిపోయిందిట. గుక్కపెట్టి యేడుస్తున్న ఆ పిల్లని గబుక్కున యెత్తుకొని వచ్చింది కృష్ణవేణి. కాని ఆమెను వెనుకనుంచి ఆ ఎద్దు కుమ్మిందిట. ఎద్దు కొమ్ము దెబ్బకి ఆమె బోర్లగిలా పడిపోయింది. ఆమె కడుపుకి బలంగా దెబ్బ తగిలింది....వెంటనే హాస్పిటలుకి తీసుకుపోయారు. కడుపులో పోటుతో ఆమె చాలా బాధపడింది. నాల్గోనెల గర్భమని ఆమెకు తప్ప ఎవరికీ తెలియదు. కడుపుపోయి పేగు మడత పడిందని ఆపరేషన్ చేస్తేకాని ఆమె బాధ తగ్గదని చెప్పారు డాక్టరు. ఆ తర్వాత పెద్ద ఆపరేషన్ చేశారు. పదిహేను రోజులు మంచం దిగలేదు. అసలే బలహీనమయిన



శరీరం. దానికి తోడు ఆపరేషన్ వల్ల చాలా రక్తం పోయింది. నరాలలో శక్తి సన్నగిల్లింది. అందువల్ల అప్పుడప్పుడూ ఫిట్సు వస్తున్నాయి. ఆమెకు బాగా విశ్రాంతి కావాలని చెప్పారు డాక్టరు. కూర్చుంటే లేవలేదు—లేస్తే కూర్చోలేదు అన్నట్టుంది ఆమె పరిస్థితి!

....ఈ సంగతి రాయిస్తామని పదిసార్లేనా అన్నాను. కాని ఒప్పుకుంది కాదు బాబూ!.... నాకిలా జరిగిందని తెలిస్తే అత్తగారు మరీ బాధపడతారు. ఎవరికీ వ్రాయద్దు-ఏమీ వ్రాయద్దు... వ్రాస్తే నన్ను చంపినంత ఒట్టు - అని ఒట్టేయించుకుంది నాయినా!''....అంటూ గుండె చెరువు చేసుకుంది జానకమ్మ.

మురళికి గొంతు పిడచ కట్టినట్టయిపోయింది. కడుపులో ఎంతో బాధ మెలి దిరిగింది....ఇటువంటి అమృతమూర్తినా తాననుమానించి సూటీ పోటీ మాటలన్నది!

''అక్క మంచం దగ్గరే కూర్చుని సేవలు చేసాడు శ్రీకాంత్...దీనికి కొంచెం కులాసాగా వుందని — మొన్ననే వెళ్ళిపోయాడు. పెట్టిన శలవు అయిపోయింది — వాడికి. దీనికి నెప్పి తగ్గలేదు. కృష్ణ పాటంటే వీళ్ళంతా చెవి కోసుకుంటారు. పాట పాడితే కడుపు నొప్పెడుతుందే తల్లీ అని చెప్పినా వినలేదు. ఎన్నో రోజుల తర్వాత కాత్యాయిని కల్పిందంటూ పాడింది.... నీరసం వచ్చుంటుంది. వాడి పెళ్ళయిపోగానే తాను మీ యింటికి వచ్చేస్తాననే అంది. కాని మనుగుడుపులకి వెళ్ళిరమ్మని నేనే పోరుపెట్టాను. చేతులారా నా బిడ్డకి నేనే ప్రమాదం తెచ్చుకున్నట్టయింది బాబూ!....'' అంటూ ఆవిడ కన్నీళ్ళు పెట్టుకుంది.

అప్పుడే బయటనుంచి వచ్చారు కృష్ణవేణి తండ్రి గోపాలంగారు. ఓపక్క మురళిని కుశల ప్రశ్నలు వేస్తూ మరో మూల కూతురి పాదాలని రాస్తూ సపర్య చేయటం మొదలు పెట్టారు.... జరిగిన ప్రమాదం గురించి మళ్ళీ ఆయన చెప్పుకు వచ్చారు ...మురళి నిస్త్రాణ పడిపోయాడు.

మరి కాసేపటికి కృష్ణవేణికి తెలివి వచ్చింది. నారాయణ రెండు తలగడలు తెచ్చాడు. వాటిని కూతురి తల క్రిందపెట్టి వేడి కాఫీ తీసుకు రావటానికి వెళ్ళింది జానకమ్మ. ఆమెకు ఫిట్సు వస్తున్నప్పట్నించీ ఈ పనులన్నీ వాళ్ళందర్కీ అలవాటయిపోయాయి.

లోపల గదిలో మంచం మీద పడుకున్న కృష్ణవేణి దగ్గరికి వెళ్ళాడు మురళీమోహన్.

''రా మురళీ!'' అని చిరునవ్వు నవ్వుతూ కుర్చీ చూపించి పక్కకి ఒత్తిగిలింది కృష్ణవేణి.

నోట మాటరాక కొంతసేపు శిలాప్రతిమలా కూర్చుండిపోయాడు మురళి.

''ఏమిటయ్యా! బొత్తిగా చిక్కిపోయావు? మా చెల్లాయి కబుర్లే కాని అన్నం పెట్టటం లేదా యేమిటి?'' అని ఆమె నవ్వింది.

నిప్పుల మీద నిలబడినా అంత వెన్నెల కురిసేలా నవ్వగలదు వదిన—ఇటువంటి దేవతనా తను తూలనాడింది!....'' నీకు....నీకు నన్ను చూస్తే అసహ్యమేయటం లేదా వదినా?'' అన్నాడు అతను తనను తాను అసహ్యించుకుంటూ.

''ఛ! ఏం మాటలవి మురళీ! నన్ను చూద్దామని నువ్వంత దూరంనుంచి వస్తే నిన్ను నేనసహ్యించుకుంటానా! నిజంగా నువ్వొచ్చినందుకు నాకిప్పుడెంత సంతోషంగా వుందో తెలుసా?''

''వచ్చాను....వస్తూనే నిన్ను నానా మాటలూ అన్నాను. ఎందుకూ పనికిరాని విషయాలన్నీ చెప్పి నీ మనస్సు బాధపెట్టాను....మా బాధలు చెప్పుకున్నానే కాని నీ బాధలేమిటో తెల్సుకోటానికి ప్రయత్నించలేదు. నా కంటె దుర్మార్గుడెవడూ వుండడు వదినా!....'' అంటూ చేతులతో ముఖం కప్పుకొని బావురుమన్నాడు అతను.

''ఏమిటి మురళీ! ఎందుకింత బాధపడతావు? నన్నేమన్నావని?....నీ మనస్సు నాకు తెలియదా! నా మనస్సు నీకు తెలియదా? ఊర్కో!''

''....అక్కడేదో జరిగిందండీ — లేకపోతే అక్కయ్య మనల్ని వదిలి యింతకాలం వుండదూ—అని మాధవి అంటూనే వుంది. ఆ భయంతోనే నేనూ వచ్చాను. కాని, ఒక్క క్షణం నిదానించి ఏం జరిగిందో కనుక్కోకుండా నిన్నపార్థం చేసుకున్నాను. నువ్వు పాడుతుంటే మా కర్మకి మమ్మల్ని వదిలేసి సంతోషంగా తీరుబడిగా యిక్కడ కూర్చుని పాడుకుంటున్నావనుకున్నాను కాని, నీలో ఎంత బాధున్నా నలుగుర్నీ సంతోషపెట్టటానికే పాడుతున్నావని తెలుసుకోలేకపోయాను....నిన్ను బాధపెట్టాలన్న పాడుబుద్ధి నాకు పుట్టింది....''

ఓపిక తెచ్చుకొని పైకి లేచి కూర్చుంది కృష్ణవేణి. అతన్ని దగ్గరికి రమ్మని పిలిచింది. తన ప్రక్కనే కూర్చోపెట్టుకుంది. అతని చేతిని తనలోకి తీసుకుంది. ''చూడు మురళీ!.... ఎవరికి వ్రాసినా వ్రాయకపోయినా నీకేనా ఈ సంగతి వ్రాద్దామనుకున్నాను. ఒక్కసారి నిన్ను చూస్తే అందర్నీ చూసినంత సంతోషం కలుగుతుందని....కాని, నువ్విలా బాధపడతావనే వ్రాయటానికి జంకాను....వ్రాయకపోయినా నా మనస్సు నిన్ను లాక్కువచ్చింది. ఇప్పుడు నిజంగా నాకెంతో ఆనందంగా వుంది. నువ్వు నన్నేమన్నా నాకోపం రాదయ్యా! అసలు నువ్వేమన్నావని నాకు కోపం రావటానికి!....''

మురళికి దుఃఖం ఆగలేదు. వదినగారి చేతుల్లో వాలిపోయి మౌనంగా ఏడుస్తూ ఉండిపోయాడు. అతని వెన్ను నిమురుతూ ఆమె బుజ్జగింపు మాటలెన్నో చెప్పింది...కొంతసేపటికి అతని మనస్సుకి స్థిమితం చిక్కింది.

మర్నాడు అతనితో ప్రయాణమవుతానంది కృష్ణవేణి.

''వద్దు. అక్కడికి వస్తే నీ మనస్సుకి శరీరానికీ కూడా విశ్రాంతి వుండదు. మరి కొన్నాళ్ళు యిక్కడే వుండు వదినా!'' అన్నాడతను.

ఆమె తల్లిదండ్రులు కూడా అదే మాటన్నారు.

''....కాని, నువ్వీ సంగతి చెపితే వాళ్ళంతా బాధపడతారు. ఎదురుగా వుంటే ఆ దారి వేరు....''

అయినా అతను వదినగార్ని తీసుకువెళ్ళటానికి యిష్టపడలేదు. ''....నేనేదోటి వాళ్ళకి చెపుతాను. నీకు కులాసాగా వుందని మీ నాన్నగారు ఉత్తరం వ్రాసేవరకు నేను రాను....నేను వచ్చి తీసుకు వెళ్ళేదాకా నువ్వు రావద్దు....''

మరిది వైపు వాత్సల్యంగా చూసింది కృష్ణవేణి. అతను కన్నీళ్ళతో వీడ్కోలు తీసుకున్నాడు.

## 46

తిరిగి వచ్చిన మురళీమోహన్ ఏదో కల్పించి చెప్పాలని ప్రయత్నించాడు కాని, కళ తప్పిన అతని ముఖం, తడబడే అతని మాటలు అతనేదో దాస్తున్నాడని అందరికీ స్పష్టం చేశాయి.

''....నువ్వు నిజం చెప్పకపోతే....నేను వెంటనే వదిన దగ్గరకి బయలుదేరి వెడతాను.'' అని ఒక వైపు నిర్మల....'' ఈ బాధకన్న నిజం

భరించటమే తేలిక! మా దగ్గరేదీ దాచక చెప్పండి.'' అని మరోవైపు మాధవి....అతన్ని ఉక్కిరి బిక్కిరి చేశారు. ఒంటరిగా వచ్చిన కొడుకుని చూసి సుభద్రమ్మ కూడా అదే మాట!

''వదిన కులాసాగా వుంటే నీతో తప్పకుండా వచ్చుండేది....ఏం జరిగిందో చెప్పరా నాయినా!''

అతనికిక చెప్పక తప్పలేదు....జరిగింది వినేసరికి వాళ్ళకి ప్రాణాలు గిలగిలలాడాయి. ఎవర్ని ఎవరు ఓదార్చగలరు? అందరిదీ ఒకటే బాధ!

ఇప్పుడు కులాసాగానే వుందని మురళి ఎంతో యిదిగా చెపితే కాని వాళ్ళ మనస్సులకి శాంతి చిక్కలేదు.

''ఏమయినా సరే, నేను వెంటనే వెళ్ళి వదిన్ని చూడాలి....'' అంటూ పట్టుబట్టింది నిర్మల.

''....నేనెలాగో బ్రతిమాలి ఆవిడ్ని రాకుండా ఆపాను. నువ్విలా ఏడవటం చూసిందంటే వదిన ఒక్క క్షణం కూడా అక్కడుండదు....కాని, యిక్కడికి వస్తే మళ్ళీ యీ గొడవలతో మనస్సు పాడవటం తప్ప ఆవిడకేం సుఖముంటుంది? నువ్వే ఆలోచించు....'' అని ఎంతో అనునయించి ఆమె ప్రయాణాన్ని ఆపుచేశాడు మురళి.

''....అన్నయ్యకింక ఈ సంసారం గొడవ పట్టదు....మనమే ఎలాగో ఇదంతా భరించాలి! కనీసం రవి చదువు, నిర్మల పెళ్ళి ఈ రెండూ జరిగే వరకయినా మనం....మన ఖర్చులు తగ్గించుకుందాం....''

భర్త మాటలని హృదయపూర్వకంగా అంగీకరించింది మాధవి. వాళ్ళిద్దరూ సంప్రదించుకొని సంతోషంగా కుటుంబ బాధ్యతనంతా తలకెత్తుకుందామనుకున్న లక్ష్యానికి ఆదిలోనే ఆటంకం వచ్చింది!

మురళి యు. పి. ఎస్. సి. లో సెలక్టయినట్టు, ట్రయినింగుకి వచ్చి చేరమని వర్తమానం వచ్చింది....అల్లుడు క్లాస్ 'ఏ' ఆఫీసరు అవుతున్నందుకు మామగారి ఆనందానికి పట్ట పగ్గాలు లేకపోయాయి. కొడుక్కి పెద్ద హోదా వస్తున్నందుకు తలిదండ్రులు పరమానంద భరితులయ్యారు. అతని శ్రమ ఫలించినందుకు మాధవికెంతో సంతృప్తి కలిగింది!

''....ఆఫీసరుగారి పెళ్ళానివి! నీకింకా వంటింట్లో ఏం పని! దర్జాగా కుర్చీలో కూర్చుని పురమాయించు!....'' అంటూ నిర్మల పరిహాసాలు ప్రారంభించింది.

## పాఠకులకు:

## 'చిత్ర కథా పోటీ'

ఇక్కడ ఒక చిత్రం వుంది. ఆ చిత్రానికి తగ్గట్టుగా మీరొక కథ అల్లగలరా? ఆ కథ సీరియస్‌గానైనా, హాస్యంగానైనా ఎలాగైనా ఉండొచ్చు. వచ్చిన కథల్లో ఏది బాగుందని అనిపిస్తే ఆ కథ పంపిన వారికి—ఉపయోగపడే 'చక్కని బహుమతి'ని పంపిస్తాము. అయితే, కథ ఎట్టి పరిస్థితిలోనూ రెండు తావు పేజీలకు మించకూడదు. కథలు జనవరి 5వ తేదీలోగా మాకు చేరేలా పంపాలి. పంపే కవరు మీద—పైన 'చిత్ర కథ' అని రాసి, 'వనిత' చిరునామా రాయాలి. అలాగే, లోపల కూడా 'చిత్ర కథ' అని రాసి—పంపిన వారి పేరు, చిరునామా రాయాలి.

**గెలుపొందిన కథ ఫిబ్రవరి సంచికలో:**



అందరూ ఆ ఆనందాన్ని పంచుకుంటున్నారు కాని....అసలు మనిషి దిగాలుపడి వున్నాడు. ''ఏమిటలా వున్నారు?....'' అని మాధవి ఒత్తిడి చేసి అడిగితే అప్పుడు తన మనసులోని బాధ చెప్పుకున్నాడు మురళి. ''....ట్రయినింగ్‌లో యిప్పుడు వచ్చేంత జీతం రాదు. అక్కడ నా ఖర్చులంటూ వుంటాయి కదా! నేనింటికి పంపేదానితో మీరు మేనేజ్ చేయటం చాలా కష్టం!....ఏం చేయాలో తోచటం లేదు....''

''అలాగని వచ్చిన ఛాన్సు పోగొట్టుకుంటామా? ఒక్క యేడాది! ఎలాగో గడపక తప్పదు....నా జీతం వుంది. నిర్మల జీతం వుంది....అంతగా అవసరమయితే మా నాన్నగారి దగ్గరో మా అన్నయ్య దగ్గరో అప్పు తీసుకుంటాను. తర్వాత తీర్చేయచ్చు. మా గురించి మీరేమీ దిగులు పడకండి! అన్నీ నేను చూసుకుంటాను....'' అని ఎంతో ప్రోత్సాహకరంగా చెప్పింది మాధవి.

నిర్మల వ్రాసిన శుభవార్త తెలుసుకొని వెంటనే బయలుదేరి వచ్చేసింది కృష్ణవేణి! గోపాలంగారు వెంట వచ్చి కూతుర్ని దిగబెట్టి....ఆమె తీసుకోవలసిన జాగ్రత్తలు—చెప్పి మరీ వెళ్ళారు.

కృష్ణవేణితోపాటు ఇంటికి తిరిగి కళ వచ్చిం

దనిపించింది అందరికీ. సుభద్రమ్మ తన అనారోగ్య విషయం మరిచిపోయింది. సత్య నారాయణగారికి గుండెలమీద నుంచి పెద్ద బరువు తొలగిపోయినట్టయింది. మాధవికి యింటి పనిలో అలుపన్నదే తెలియలేదు. నిర్మల మరింత చిన్న పిల్లయిపోయింది.

ఇంటి బాధ్యతంతా వదినగారి మీద, భార్య మీద వదిలి వెళ్ళాల్సి వస్తోందే అన్న వ్యథతో ఎవరితోనూ ఫ్రీగా మాట్లాడలేకపోతున్నాడు మురళి. ఇక విశ్వనాధానికి ఆ యింటి విషయాలు పట్టటమే లేదు. 'సత్రపు భోజనం—మఠం నిద్ర' అన్నట్టే ఉంది అతని తీరు. భార్య తిరిగి వచ్చింది కనక ఎమర్జెన్సీలో డబ్బు కావాలంటే దొరుకు తుందన్న సంతోషం తప్ప ఆమెకో పెద్ద గండం గడిచిందన్న సంగతే అతను తెల్సుకోలేదు. ఇంతకాలం ఆమె తిరిగి రాకపోవటానికి కారణమూ అడగలేదు. ఇంట్లో అంతా ఆమె విషయంలో ఎంతో జాగ్రత్తలు తీసుకోవటం గుర్తించనూ లేదు.

కృష్ణవేణి కులాసాగా లేచి తిరుగుతోంది. చెల్లెలు, మరదలు వద్దు వద్దంటున్నా ఇంటిపనుల్లో భాగం పంచుకుంటోంది. ఇంట్లో వుండి అక్కగారికి శ్రమ తగ్గించాలని మనసులో వున్నా.... ఇంకా శలవు పెడితే జీతం నష్టం వస్తుందని మాధవి మళ్ళీ కాలేజీకి వెళ్ళటం ప్రారంభించింది.

మురళి ట్రయినింగుకి వెళ్ళేరోజు దగ్గర పడింది.... మాధవి అతని ప్రయాణానికి కావల్సిన ఏర్పాట్లన్నీ చేస్తోంది. రాఘవరావు కూతురికి సలహాలిస్తున్నాడు. సాయం చేస్తున్నాడు.

ఆవేళ నిర్మల ఆఫీసుకి వెళ్ళాక, మాధవి కాలేజీకి వెళ్లాక.... వదినగారి దగ్గరకి వెళ్ళాడు మురళీమోహన్. పుట్టింటి నుంచి ఆమె వచ్చాక అతను మనసు విప్పి ఆమెతో ఏదీ మాట్లాడలేక పోయాడు.... అన్నాళ్ళకి గుండె దిటవు చేసుకొని ఆమె దగ్గరకి వచ్చాడు.

''నీతో ఎంతో చెప్పాలని వుంది.... ఎలా చెప్పాలో తెలియటం లేదు వదినా!....'' అన్నాడు ఉద్వేగపూరిత స్వరంతో.

కృష్ణవేణి నిండుగా నవ్వింది. ''నా దగ్గర నీకు సంకోచమేమిటి? చెప్పు మురళీ!....''

అతనామె వైపు కళ్ళప్పగించి చూసాడే కాని నోట మాట రాలేదు.

''నిన్ను మురళీ అని పిలుస్తున్నప్పుడల్లా నా వొళ్ళు జల్లుమంటూ వుంటుంది! బహుశ నా పేరు కృష్ణ.... నీ పేరు మురళి అవటం మూలానేమో!'' అని గలగల నవ్వింది.

వదినగారు పనికట్టుకునే తనను కమ్మని కబుర్లతో మైమరిపిస్తోందని — తన బాధ గుర్తించే అలా మాట్లాడుతోందని అతను గ్రహించాడు. ''కాని, నీ మురళి నిన్ను విడిచి పోయే రోజు దగ్గర పడింది వదినా!....'' అన్నాడు గద్గద స్వరంతో.

''ఛ! ఏం మాటలవి మురళీ! నన్ను విడిచి ఎక్కడికి వెడతావు! నిత్యం నా మనసులో వుండేవాడివి!....''

కళ్ళల్లోకి చిందిన నీటి చుక్కల్ని చొక్కా చేతులకి ఒత్తుకున్నాడతను.

''నీ కృషి ఫలించింది. అభివృద్ధిలోకి వచ్చావు. ఇంతకంటె నాకు సంతోషం కలిగించే దేముంటుందయ్యా!''

అతను తల అడ్డంగా త్రిప్పాడు. ''కాని, ఈ స్థితిలో నిన్ను విడిచి వెళ్ళటానికి నాకు సంతోషంగా లేదు వదినా!.... ప్రాణం పోతున్నట్టుగా వుంది.''

''నువ్వనవసరంగా చిన్నది పెద్దది చేసుకొని బాధపడుతున్నావు. అన్నీ అవే చక్కబడతాయి. నిశ్చింతగా ట్రయినింగుకి వెళ్ళిరా!''

''లేదు వదినా! ఈ వెళ్ళటం నేనప్పుడే దూరంగా వెళ్ళుంటే అన్నయ్య యింతగా దిగజారేవాడు కాదేమో!.... కొంతలోకొంత యింటి బాధ్యత గుర్తించి తన దారి మళ్ళించుకొనేవాడు.... చాలా పొరపాటు చేశాను. నీ మాట ఆనాడే నేను విని వుండాల్సింది....''

ఆమె గాఢంగా నిట్టూర్చింది. ''సరే, జరిగి పోయిన దానికి ఏం చేస్తాం? ఆ సంగతులన్నీ మర్చిపో! ముందు నీ ట్రయినింగు ముగించుకొని రా! మే మొకళ్ళకింకొకళ్ళం సాయం వున్నాము. మాకేం ఫర్వాలేదు. ముందు నీ గురించి నువ్వు జాగ్రత్త తీసుకో! ఎక్కడో వూరు కాని వూరికి వెడుతున్నావు. ఒంటరిగా వుంటావు. నువ్విబ్బందిపడి మాకేమీ పంపకు.... ఒక్కయేడాది మేమెలాగో గడపగలం. నువ్వు మా గురించి దిగులుపడకు....''

అతను బయలుదేరి వెళ్ళే క్షణం వరకు యిలా యెన్నోవిధాలా అతనికి ధైర్యం చెబుతూనే వుంది కృష్ణవేణి....

ఆ యింటిని.... ఆ యింట్లో తనంటే ప్రాణ మిచ్చే వాళ్ళని వదలలేక వదలలేక ట్రయినింగుకి వెళ్ళాడు అతను.

కృష్ణవేణి ఒకటికి పదిసార్లు ముందే చెప్పినా తమ్ముడు వెళ్ళే సమయానికి విశ్వనాథం యింటి పట్టున ఉన్నాడు కాదు!.... అంతకన్న ఇరుగు పొరుగువాళ్ళు నయమనిపించారు. ఎంతో ఆనందంగా వీడ్కోలు చెప్పారు!

## 47

మురళీమోహన్ భయపడినట్లుగానే అతను వెళ్ళిపోయాక ఇంటి ఆర్థిక పరిస్థితి మరింత దిగజారిపోయింది. కృష్ణవేణి శ్రీకాంత్ పెళ్ళికి వెళ్ళినప్పుడు ఇంటి ఖర్చులన్నీ మాధవి చూసుకోవటం ప్రారంభించింది. ఆమె తిరిగి వచ్చాక డబ్బు తెచ్చి మాధవి యివ్వబోతే ''నీ దగ్గరే వుంచటం మంచిది....'' అని తల త్రిప్పుకు వెళ్ళిపోయింది.

డబ్బు పుష్కలంగా వున్నప్పుడు అక్కగారి చేతికిచ్చినా ఫర్వాలేదు కాని.... ఇప్పుడు కటకట లాడుతున్నప్పుడు ఆమెకీ బాధ్యత అప్పగించితే మరింత బాధపెట్టినట్టే అవుతుందని తనే ఖర్చుల విషయం చూసుకోసాగింది మాధవి.

ఆ మరుసటి నెల నిర్మల జీతం తెచ్చి ''ఏ వదినకివ్వాలిప్పుడు?'' అని అడిగితే.... ''నేను రిటయిరయిపోయాను.'' అని నవ్వి చెల్లెల్ని చూపించింది కృష్ణవేణి.

''అవునవును. భర్తలు తమ జీతాలు భార్యలకేగా యివ్వాల్సింది!''.... అని నవ్వింది నిర్మల. చిత్రంగా చూస్తున్న మాధవి చిబుకం పట్టుకొని ఆడించి ''ఆడపడుచు అర్ధమొగుడన్న సంగతి మరచితివా ప్రియా!'' అని పకపక నవ్వింది.

నిర్మల కబుర్లు అందించే ఆనందం అట్టే సేపు కృష్ణవేణి గుండెల్లో నిలవలేదు. భర్త తెచ్చిచ్చిన సగం జీతం.... చెల్లెలి చేతికివ్వటానికి ఎంతో సిగ్గుపడిపోయింది.... ఇదివరకు అతనెంత యిస్తున్నాడో ఆమెకి మాత్రమే తెలుసు. ఇప్పుడు అందరికీ తెలుస్తోంది. ఇంతకాలం అతని వ్యసనం గురించి కొందరికే తెలుసు.... ఇప్పుడు అందరికీ తెలుసు.... నేరం చేస్తున్నవాడు నిమ్మకు నీరెత్తినట్టున్నాడు. కాని, అతని భార్య అయినందుకు తనే ఒక నేరస్తురాలిగా బాధపడుతోంది




## ఇంద్రధనుస్సు
(నవల)

**[రచన : రేవమూరి శమంత; ప్రచురణ ఎం. శేషాచలం అండ్ కో, మద్రాసు ; వెల : రూ. 3.50 ; పేజీలు : 168.]**

శ్రీ రాజమన్నారుగారికి అంకితం ఇచ్చిన ఈ నవలకు తొలి పలుకులోవారే - "ఇది ఒక అపూర్వ నవల. కొత్త పంథాలో నడిచింది. చిత్తూరు, మదనపల్లి, గుంటూరు, రాజమండ్రి నుండి భోపాల్, కలకత్తా వరకే కాక అమెరికాకు సహా వెళ్ళింది. అసాధారణ సన్నివేశాలతో నిండిన ఘట్టాలు అసమానంగా వర్ణింపబడ్డాయి." అన్నారు. అయితే, నవల పూర్తి అయిన తరువాత ఎన్ని పాత్రలున్నాయో, వాటి ప్రాముఖ్యత ఏమిటో అర్థం కాదు. తెలుసుకోవాలంటే మరొకస్సారి చదవక తప్పదు. ఆఖరి పేజీల్లో దర్శనమివ్వబట్టో, లేక అన్నింటిలోకి అదే కాస్త జ్ఞాపకముండే పాత్ర కావడం వల్లనో 'మేరీ' పాత్ర మనకు కొంచెం గుర్తుంటుంది. నవలలోని భాషలో ఏదో నిర్జీవత్వం ఉంది. కథ చెప్పే టెక్నిక్ మరీ పేలవంగా ఉంది. అసలు కథంటూ లేదు; కల్పించబడింది. ఏదో కథకు, మరేదో పేరు పెట్టబడింది. ఇది వర్ణసంకరం. అందుకే "ఇంద్రధనుస్సు" అన్న పేరు పెట్టారేమో.

## బ్రాహ్మణ పిల్ల
(నవల)

**[రచన : లత; ప్రచురణ: ఎమ్. శేషాచలం అండ్ కో, సుంకురామచెట్టి వీధి, మద్రాసు-1 ; వెల: 3-50 ; పేజీలు : 160.]**

రచయిత్రి పేరు చూడగానే ఆసక్తితో చదివే పాఠకులచేత ఏకబిగిన చదివించే ఈ నవల పూర్తి కాగానే ఆలోచన్లు రేకెత్తిస్తుంది. బ్రాహ్మణ పిల్ల గురించే కథ నడిచినా, అందులో సందేశం ఏ ఆడ పిల్లకైనా వర్తిస్తుంది.

"ఓరి యూస్‌లెస్ బ్రూట్ ! నువ్వు యింత వరకూ ఒక అమాయకురాలైన బ్రాహ్మణ పిల్లను చూసావు. యిహ అసలైన బ్రాహ్మణ పిల్లను చూస్తావు. నువ్వు నా ఇంట్లో ఏమన్నా పేలావో నీ అంతు చూస్తాను. బాపనోళ్లు, బాపనోళ్లు అంటు న్నావు. జాగ్రత్త !" అనే రాజేశ్వరిలోని మొండి ధైర్యం ప్రతి ఆడపిల్లకూ ఆదర్శమైనదే.

ఈ ఆధునిక సమాజంలో, ప్రవహిస్తున్న నాగరికతలో మునిగి, నలిగిపోతున్న ఆడపిల్లలందరూ తప్పక చదవదగ్గది ఈ నవల.

## వీడని బంధం
(నవల)

**[రచన : కాదాపద్మ; ప్రచురణ : ఎమ్. శేషాచలం అండ్ కో ; మద్రాసు - 1 ; వెల : 3-50 ; పేజీలు : 151]**

నవల పేరు చదవగానే విడిపోని బంధమేదో వుంటుందని, తెంచుకుందామన్నా తెగని బంధనమేదో చివరిదాకా రచయిత్రి సాగదీసి వుంటారని పాఠకులకు అర్థమవుతుంది. అలాగే వారి అంచనా మీదనే నవల నడుస్తుంది.

భారత సంస్కృతిని, సంప్రదాయాలను గౌరవించే మాధురి, విదేశాల్లో మరో స్త్రీని పెళ్ళి చేసుకొని, కన్నుల పొరలు తొలగగానే, పశ్చాత్తాపుడై స్వదేశం వచ్చిన టి. బి. పేషంటైన భర్తను చేరుకోవటమే ఈ వీడని బంధం.

అంతవరకూ మాధురినే పెళ్ళి చేసుకుందామనుకున్న రవి, వారి మాటలు విని, మాధురిని సోదరిగా భావిస్తున్నాననటంతో ఆ సన్నివేశం 'డ్రామాసీన్'గా మారి ఘోరంగా తయారయింది.

దాంతో_కాలక్షేపానికి పనికి వస్తుందనుకున్న ఈ నవల కాలాపహరణ చేసిందన్న బాధ చదువరులకు కలిగితే అందుకు బాధ్యత రచయిత్రిదే !

---

కృష్ణవేణి. ఎవరితోనూ స్వేచ్ఛగా ధైర్యంగా మాట్లాడలేక సిగ్గుపడి తలత్రిప్పుకు పోతోంది.

షాహుకారు కొట్లో బాకీ పెరిగిపోవటంతో మాధవికి డబ్బుకోసం వెతుక్కోక తప్పలేదు. మరో మార్గంలేక ఓ రోజున తండ్రి దగ్గరికి వెళ్ళి అడిగింది.

కూతురి కష్టార్జితం 'గంగపాల'వుతోందన్న బాధ అతనికి చాలా రోజులుగా వుంది. అల్లుడు అన్నగార్ని వెనక వేసుకువచ్చి తననే తప్పు పట్టాడన్న కోపం అలాగే వుండిపోయింది. దాంతో కూతురు డబ్బడిగేసరికి "ఏం....మీ బావ గారు పేకాటకి డబ్బిస్తేకాని ఈ పూట కదల నన్నాడా ?" అన్నాడు వ్యంగ్యంగా.

మాధవికి కోపం వచ్చింది. "మా యింటి గొడవలన్నీ మీకనవసరం ! డబ్బడిగింది నేను. ఆ డబ్బవసరం నాకు. నా మీద నమ్మకముంటే అప్పివ్వండి. అణాపైసలతో తీర్చేస్తాను...."

రాఘవరావు నిర్ఘాంతపోయాడు. "అది కాదమ్మా !....నేననేది....అతను చేసే పని బావుందా అని !...."

"మీకు చేతనయితే ఏదయినా మార్గం చెప్పండి ! అంతేకాని ఊరికే ఆక్షేపిస్తే లాభం లేదు."

"నేనెప్పుడో చెప్పాను. కొన్నాళ్ళు మీరు విడిగా కాపరం పెట్టుకుంటే అతనికి బాధ్యత తెలిసివస్తుందని...."

"మనసులు ఎగిరిపోయే దారి కాదు మాకు కావల్సింది. మనస్సులు అతుక్కునే సలహా చెప్పండి.... నాకు డబ్బెలా సంపాదించాలో తెలుసు !..."

కోపంగా వెళ్ళిపోతున్న కూతుర్ని బ్రతిమాలి అడిగిన దానికంటె ఎక్కువ డబ్బిచ్చి పంపాడు రాఘవరావు.

తండ్రిని నొప్పించలేక అప్పుడయితే తీసుకుంది కాని....మళ్ళీ అవసరం వచ్చినా అతని దగ్గరకి వెళ్ళలేదు మాధవి !

ఆ తర్వాత కూతుర్ని కలుద్దామని రాఘవరావు నాలుగయిదుసార్లు యింటికి వచ్చాడు కాని, ఆమె యింకా కాలేజీనుంచి రాలేదన్న సమాచారమే అందింది. ఇటీవల ఆమె రోజూ యింటికి ఆలస్యంగానే వస్తోందని చెప్పింది కృష్ణవేణి. ఆమె అడిగితే ఏవో ప్రవేటు క్లాసులున్నాయని ఓసారి—ఫ్రెండ్సు దగ్గరకి వెళ్ళానని మరోసారి చెప్పింది మాధవి.

ఆమె చెప్పిందన్న మాట నమ్మలేక రాఘవరావు ఆచూకీ తీశాడు. నిజం తెలిసేసరికి అతనికి మరింత బాధ కల్గింది. ఆ వెంటనే కృష్ణవేణి దగ్గరికి వచ్చాడు. "మీ చెల్లెలు ప్రవేటు క్లాసులు పెట్టటం లేదమ్మా ! ఇంకా సంపాదించాలని ప్రవేట్లు చెపుతోంది. తండ్రిని నేనున్నాను. నోరు

తెరిచి అడక్కపోయినా ముఖం చూసి యివ్వటానికి సిద్ధంగా వున్నాను. ఆత్మాభిమానం వుండకూడదని నేననటంలేదు. ఇంటి బాధ్యత తీసుకోవద్దని నేననటంలేదు....కాని, ఇంత శ్రమపడి సంపాదించటం అవసరమా అని అంటున్నాను. మగవాడికి అక్కర్లేని బాధ్యత ఆడపిల్లకి అవసరమా అని అడుగుతున్నాను. చెప్పమ్మా! నువ్వే చెప్పు....నీకిది న్యాయమనిపిస్తోందా?....

కృష్ణవేణి సిగ్గుతో బిక్కచచ్చిపోయింది. ''క్షమించండి బాబయ్యగారూ! నిజంగా నాకిదంతా తెలియదు....''

ఆమె ప్రాధేయపూర్వకంగా చెప్పబోతున్న మాటల్ని తన కోపంతో త్రుంచేశాడు రాఘవరావు. ''తెలుసుకోవాలనుకుంటే ఎవరికేనా తెలుస్తుందమ్మాయ్! కూతురు అత్తింటికి వెళ్ళి సుఖపడాలనే కోరుకుంటాడు ఏ తండ్రయినా. నాలా కర్మకి వదిలేసి వూరుకోడు....నేనిక్కడుండి ఈ దౌర్భాగ్యాన్ని చూడాల్సి వస్తోంది!....''

ఆమె మనస్సులో బ్రద్దలవుతున్న అగ్నిగోళాల సంగతి అతనికి పట్టలేదు....తన మనసులోని బాధనంతా వెళ్ళగ్రక్కుకుని విసవిసా వెళ్ళిపోయాడు.

నిర్ఘాంతపోయి నిస్తేజంగా నిలబడిపోయిన కోడల్ని చూశాడు సత్యనారాయణగారు. ఆయన మనస్సు ద్రవించిపోయింది. ''ఏ పాపమూ ఎరుగని నువ్వు యిన్ని మాటలు పడాల్సి వస్తోందామ్మా?''

మామగారి గొంతు విని చటుక్కున తల త్రిప్పుకొని కళ్ళొత్తుకుంది కృష్ణవేణి.

''కన్నవాళ్ళం పెద్దవాళ్ళం మా మాటే వాడు లెక్కచేయటం లేదు. ఇంకెవరి మాట వింటాడు?''

''ఏమిటండీ! వియ్యకుండుగారేమిటీ అంటున్నారు....'' కాలు ఈడ్చుకుంటూ వచ్చింది సుభద్రమ్మ.

''ఏం లేదత్తయ్యా!...ఏం లేదు....మీకు మందుకు వేళయింది రండి...'' అంటూ గబగబా లోపలికి వెళ్ళిపోయింది కృష్ణవేణి.

''ఏమిటండీ?'' అని భర్తవైపు చూసింది సుభద్రమ్మ.

ఆయన గాఢంగా నిట్టూర్చాడు. ''ఒకసారి నేనలా ఊళ్ళోకి వెళ్ళాలి'' అన్నాడు ప్రస్తావన మారుస్తూ.

''ఈ యెండలో ఏం పని!....''

''హుం! ఇదీ ఓ ఎండేనా?'' అని అన్నాడే కాని....మనస్సుల్లో యింతకన్నా అగ్నిగుండాలున్నాయన్న మాట పైకి అనలేకపోయాడు. ఈ విషయాలన్నీ చెప్పి రోగిష్టి భార్యను బాధపెట్టటం ఎందుకు—అని ఒకవైపు. కోడలు మరింత ముఖం చిన్నబుచ్చుకుంటుందని మరోవైపు అనిపించి వూర్కున్నాడు.

"నేను యేదోటి చేయాలి యేదోటి చేయాలి...." అని గొణుక్కుంటూ బట్టలు వేసుకొని చేతికర్ర తీసుకొని బయిటికి వెళ్ళిపోయాడు.

## 48

ఆవేళ మధ్యాహ్నం క్లాసులేవీ లేవని—తనతోటి లెక్చరర్ సుధారాణితో వాళ్ళింటికి వెళ్ళింది మాధవి. కాసేపు కబుర్లు చెప్పుకున్నాక "అన్నట్టు లాయరు సోమసుందరంగారింటికి వెళ్ళాలోయ్ కొంచెం తోడువస్తావ్!'' అంది సుధారాణి లేస్తూ.

''లాయరుగారితో నీకేం పని?'' అని చిత్రంగా చూసింది మాధవి.

''మా ఆయన విడాకులిమ్మని ఒకటే సరదా పడుతున్నారు....'' అని గలగలా నవ్వింది సుధారాణి.

''మైగాడ్! సరదాల్లో యిలాంటివి కూడా వుంటాయా?''

''ఎందుకుండవు? మన కెమిస్ట్రీ లెక్చరరు నాగరాజు పెళ్ళాన్ని వదిలేసింది అందుకేగా? లేకపోతే, ఆవిడకేం లోటని?....''

''పోన్లెద్దూ! పరాయివాళ్ళ విషయాలు మనకెందుకు?''

''అహఁ! అలాగనకు మరి! పరాయివాళ్ళ కథలే చెప్పుకోటానికి గమ్మత్తుగా వుంటాయి!''

మాధవి నవ్వింది. ''ఇంతకీ నువ్వు మీ ఆయన్ని వదిలేస్తున్నావా? నిన్ను మీ ఆయన వదిలేస్తున్నారా?''

''అదింకా తేల్చుకోలేదు....ఈ రాత్రి ఆయన్ని అడిగి రేప్రొద్దున్నే నీకు చెపుతాను.''

ఇద్దరూ పకపక నవ్వుకున్నారు....ఏవో ఆస్తి పంపకాల విషయాల్లో లాయరుగార్ని సలహా అడిగామని—ఆయన మళ్ళీ ఆ పూట రమ్మన్నాడని చెప్పింది సుధారాణి. ఆమె రమ్మంటే వెంట వెళ్ళింది మాధవి.

''లాయరుగారు లోపలున్నారు. కూర్చోండమ్మా! చెప్పి వస్తాను'' అని వెళ్ళాడు గుమాస్తా.

గుమాస్తా బల్లపక్కన తలదించుకొని కూర్చుని ఏదో వ్రాసుకుంటున్న వ్యక్తిని చూసి తెల్లబోయింది మాధవి. సుధారాణి అదేమీ గుర్తించలేదు.

లాయరుగారు రమ్మన్నారని గుమాస్తా పిలిస్తే ఆమె లోపలికి వెళ్ళింది.

''నేనిక్కడే వుంటాను. నువ్వు త్వరగారా?'' అంది మాధవి.

ఆమె గొంతు విని వ్రాసుకుంటున్న వ్యక్తి తల యెత్తారు. ''నువ్వా?....'' అన్నాడు తడబడుతూ.

''మీరు...మీరిక్కడున్నారేమిటి మామయ్యా!''

సత్యనారాయణగారు బలవంతంగా నవ్వాడు. ''ఏం లేదు....ఏం లేదు. ఎవరో డ్రాఫ్టు వ్రాసి పెట్టమంటేను....'' అని నసిగాడు.

ఆయన చెప్పింది అబద్ధమని మరు నిమిషంలోనే మాధవికి తెలిసిపోయింది. ''ఇదిగోనయ్యా నారాయణ! ఈ వారం జీతం!....'' అంటూ నోట్లు లెక్కపెట్టి ఆయన చేతిలో పెట్టాడు లోపలనుంచి వచ్చిన గుమాస్తా.

కోడలి ముందు అపరాధిలా తలదించుకొని ఆ డబ్బు చటుక్కున జేబులో పెట్టుకున్నాడు సత్యనారాయణగారు.

''ఏదో ముసలిముండావాడివి కష్టపడుతున్నావని లాయరుగారిస్తున్నారు కాని మరెవ్వరూ యివ్వరు సుమా!....'' అని ఒకటికి రెండుసార్లు చెప్పాడు గుమాస్తా—తనూ ముసలివాడేనన్న విషయం మర్చిపోయి!

మాధవి గుండె కలుక్కుమంది; మామగారి ఎర్రపడిన ముఖం చూడలేక అక్కడున్న న్యూస్‌పేపరు తన ముఖానికడ్డంగా పెట్టుకుంది.

''అది సరే, గబుక్కున అంతా జేబులో దోపేసుకున్నావు. మరి నా మాటో!....కష్టపడుతున్నావని లాయరుగారితో చెప్పి ఎక్కువిప్పించినందుకయినా యివ్వాలి...'' గుమాస్తా యెంత నెమ్మదిగా గొణిగినా మాధవికి వినపడింది.

సత్యనారాయణగారు వెంటనే కొంత డబ్బు తీసిచ్చినట్టున్నాడు. ''కొడుకులు సంపాదిస్తున్నారు కదా! నీకింకా ఈ గతి ఎందుకు నారాయణా! నాకు చాలా బాధగా వుంది సుమా!''

అని తెచ్చిపెట్టుకున్న సానుభూతి వెళ్ళబోసాడు గుమాస్తా.

"ఈ డ్రాఫ్టు పూర్తి చేసాను....ముందు చూడ వయ్యా! నేను కొంచెం త్వరగా యింటికి వెళ్ళాలి!" అని అతని మాటలు త్రుంచేశాడు సత్యనారాయణగారు.

మాధవికి కన్నీళ్ళాగలేదు. అక్కడింక కూర్చోలేక సుధారాణితో కలిసి వచ్చానన్న స్పృహేలేక....గబగబా బయటికి నడిచింది. కాలేజీకి వెళ్ళింది. అక్కడా కూర్చోబుద్ధి కాలేదు. ఆ పూట ప్రయివేట్లకి కూడా వెళ్ళా లనిపించలేదు....ఇంటికి వెళ్ళి కాసేపు కళ్ళు మూసుకొని పడుకోకపోతే ఎక్కడయినా కళ్ళు తిరిగి పడిపోతానేమోనన్నంత నీరసం వచ్చింది.

ఎంత ఆలశ్యంగా వచ్చినా ఎంత అలసిపోయి వచ్చినా రోజూ తనదగ్గర కాసేపు కూర్చొని కాని బట్టలు మార్చుకోటానికి కూడా వెళ్ళని చెల్లెలు....ఆ పూట పెందరాళే రావటమే కాకుండా తల త్రిప్పుకొని గదిలోకి వెళ్ళిపోవటం చూసి నివ్వెరపోయింది కృష్ణవేణి. వెళ్ళి పలకరించాలా వద్దా అని కాసేపు తటపటాయించింది. అట్టేసేపు వుండబట్టలేక మంచినీళ్ళ గ్లాసుతో వెళ్ళింది.

మాధవి తలత్రిప్పుకుని గబగబ చీర చెంగుతో ముఖం తుడుచుకుంది. ఆమె భుజం మీద చేయివేసి "ఏమిటి మధూ! ఎందుకిలా వున్నావు?" అని అనునయంగా అడిగింది కృష్ణవేణి.

"అబ్బే. ఏం లేదక్కా! ఏం లేదు....ఎలా వున్నాను?"

"లేదు. నువ్వేదో బాధపడుతున్నావు. నాతో చెప్పవూ?"

"ఏమీ లేదు....మధ్యాహ్నం ఎండలో మా ఫ్రెండుతో బజార్లో తిరిగాను. అందుకనే అలా కనిపిస్తున్నానేమో!"

కృష్ణవేణి గాఢంగా నిట్టూర్చింది. "గుచ్చి గుచ్చి అడిగానని ఏమీ అనుకోకు....చెప్ప వల్సింది నాకు చెప్పవా యేమిటి!...." అంది నెమ్మదిగా.

తను చూసింది చెపితే అక్కగారు మరింత బాధపడుతుందని మాధవి అప్పటికెలాగో నిగ్ర హించుకుంది కాని....మామగారు ఇంటికి వచ్చాక ఆయన అన్న మాటలు విన్నాక ఇంక వుండ బట్టుకోలేకపోయింది.

ముందు గదిలో కూర్చున్న సుభద్రమ్మ "ఏమిటింతసేపు రాచకార్యాలు? ఈ మధ్య యింటిపట్టునే వుంటంలేదు" అంది.

"ఆఁ ఏం లేదు. అలా శంకర్రావుగారింటికి వెళ్ళాను" అన్నాడాయన.

"నిన్న జగన్నాధంగారిల్లు. ఇవేళ శంకర్రావుగారిల్లు....ఈ మధ్య రోజూ ఎక్కడోక్కడికి వెడితే కాని మీకు తోచటంలేదనుకుంటాను"

"రోజంతా నా ముఖం చూస్తే నీకు విసుగ్గ వుంటుందని...." అని పెద్దగా నవ్వాడు ఆయన.

"చాల్లెండి. ఈ యెండలో పడి తిరిగితే ఎక్కడయినా వడగొట్టేను."

"ఇదిగో ఈ నారింజపళ్ళున్నాయ్ చూసావ్" అంటూ తెచ్చిన పళ్ళగురించి కాసేపు వర్ణించాడు.

కృష్ణవేణి తెచ్చిన మంచినీళ్ళు త్రాగి "ఇదిగో నమ్మాయ్!" అంటూ జేబులోని డబ్బు తీసిచ్చాడు

ఆమె వెలవెలబోతూ చూసింది.

"ఫించనా? నెల మధ్యలో...." అని ఆశ్చర్యబోతూ అడిగింది సుభద్రమ్మ.

"ఈ మధ్య డబుల్ పెన్షన్ యిస్తున్నారులే!" అని గలగల నవ్వాడాయన.

"వేళాకోళాలు కట్టిపెట్టి చెబ్దురూ!"

"ఇదివరకెవరికో అప్పిచ్చాను. అది తిరిగిచ్చారు. ఈ ఆరాలన్నీ నీకెందుకు?" అని నీర్సంగా నవ్వి కుర్చీలో వెనక్కి వాలాడు.

అప్పుడే గదిలోంచి బయటికి వచ్చి చూసిన మాధవి "అది నిజం కాదత్తయ్యా!...ఆ డబ్బు ఎక్కడ్నించి వచ్చిందో నాకు తెలుసు!..." అంది ఉద్వేగపూరిత స్వరంతో. మామగారు వారిస్తున్నా వినకుండా తను చూసిందంతా చెప్పింది.

కృష్ణవేణి నిర్ఘాంతపోయింది. సుభద్రమ్మ పిచ్చిదానిలా చూసింది.

"నువ్వెందాకా అడిగితే నేను చెప్పలేక పోయింది ఇదేనక్కా! ఆయన మిమ్మల్ని మధ్యపెడుతుంటే భరించలేకపోయాను..," అంది మాధవి గద్గద స్వరంతో.



అతిరూప సుందరి

పొరుగు రాష్ట్రమైన తమిళనాడు వాలీబాల్ ఆటలో గత కొద్ది సంవత్సరాలుగా పురోభివృద్ధి కనబరుస్తున్నది. అందుకు కృషి చేస్తున్న క్రీడా కారిణులలో అతిరూప సుందరి ఒకరు.

ప్రస్తుతం కోయంబత్తూరులోని అవినాశిలింగం హోం సైన్స్ కళాశాలలో బి. ఏ. ద్వితీయ సంవత్సరం చదువుతున్నది అతిరూప సుందరి.

1970లో జెమ్‌షెడ్‌పూరులో జరిగిన జాతీయ పోటీలలో ఆమె ప్రప్రథమంగా తమిళనాడు జట్టు తరఫున వాలీబాల్ పోటీలలో పాల్గొన్నది. అప్పటి నుండి తమ రాష్ట్రం తరఫున జాతీయ స్థాయి పోటీలలోనూ, యితర పోటీలలోనూ ఆమె పాల్గొంటూనే వున్నది. 1975లో తిరుచ్చిలో జరిగిన జాతీయ పోటీలలో తమిళనాడు జట్టుకి నాయకురాలుగా నియమించబడింది. అదే సంవత్సరం ఢిల్లీలో జరిగిన పోటీలలో ఆమె తమ జట్టు తృతీయ స్థానం సంపాయించడానికి ఎంతగానో కృషిచేసింది. ఆ పోటీలు అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగా జరిగాయి.

అతిరూప సుందరి వాలీబాల్ ఆటలోనే కాకుండా బాల్ బాడ్మింటన్ ఆటలో కూడా ప్రవీణురాలు.

—శ్రీమతి ఉమా మహేశ్వరం

**Results of Camel Vanitha Crylin Contest No. 8 held in October 1978.**

*1st Prize*: Rs. 100/- Smt. Vasantha Lakshmi, 'Shanthi Graham'. Natarajapuram, Nagarcoil-629 002. *2nd Prize*: Rs. 75/- N. Lakshmi C/o. Dr. N. S. R Shastry, Ramaraopeta, Kakinada. *3rd Prize*: Rs. 50/- T. Bala, W/o. T. Narayana Rao, Dept. of Chemistry. Rajah's College, Bobbili-532 558. *Certificate of Merit*: K. Sanyasamma, C/o. Kukkodapu Subba Rao, Peddaveedhi, Tuni, E. G. Dt (A.P.). Miss V. Santhi Sri Devi, D/o. V. Poornananda Sarma P. O. Vellatur-522 257, (Via) Tenali R. M. S. Guntur Dt. (A.P.). A. Radha, 24, Ebrahimji Saheb St., 2nd Floor, Madras-600 001

సుభద్రమ్మకి కొడుకు మీద—భర్త మీద కూడ కోపం వచ్చింది. "ఏమిటండీ!...నిజమేనా?" అని అడిగింది ఆవేశంగా.

"అబ్బే. అక్కడ నేను చేసే పని చాలా తక్కువ!..." అని కొట్టిపారేసాడు సత్య నారాయణగారు తేలిగ్గా.

"మీరింక అక్కడికి వెళ్ళకండి మామయ్యా! వున్నంతలోనే గడుపుకుందాము. ఇంట్లో విశ్రాంతి తీసుకోవలసిన వేళ మీరిలా శ్రమపడటం మంచిది కాదు. ఈ సంగతి తెలిస్తే మీ అబ్బాయి నన్నే తిడతారు..." అంది మాధవి.

"ఆడపిల్లలు, చిన్నపిల్లలు మీరంతా కష్ట పడుతున్నారు. మగవాడ్ని నన్నూరికే తిని కూర్చో మంటావామ్మా!..."

"అలాగని శక్తికి మించి పనిచేస్తే ఆరోగ్యం పాడవదా?...ఇంతకాలం మీరు చేసింది చాలదా?" అంది సుభద్రమ్మ.

"అంతగా చేయలేకపోతే అప్పుడే మానేస్తాను. నువ్వూరికే హైరాన పడకు...ఓ కప్పు కాఫీ యియ్యమ్మా కృష్ణా!..."

అంతవరకు స్థాణువులా నిలబడిపోయిన కృష్ణవేణి స్పృహలోకి వచ్చింది.

కొడుకు వ్యసనం తెచ్చిన ఆర్థిక దుస్థితి వల్లనే కదా—ఈ వయస్సులో ఆయన శ్రమ పడాల్సి వస్తోంది! ఈ సంగతి వింటేనేనా బుద్ధి తెచ్చుకుని మంచి దారిని పడతాడేమో—అన్న ఆలోచనతో ఆ రాత్రి విశ్వనాధం తిరిగి వచ్చే వరకు మెలుకువగా వుంది సుభద్రమ్మ!

రోజూలాగునే కృష్ణవేణి తప్ప అప్పటికంతా భోజనాలు చేసేశారు. మురళీమోహన్ ట్రయినింగుకి వెళ్ళాక మాధవి గదిలో పడుకుంటోంది నిర్మల. తల నెప్పిగా వుందని చెప్పి ఆ పూట పెందరాళే పడుకుంది మాధవి. గతవారం తను వ్రాసిన కధని తిరిగి చదివి చేర్పులు మార్పులు చేసుకుంటోంది నిర్మల. ముందు గదిలో కూర్చుని చదువుకుంటున్నాడు రవి....చదువుకుంటూ కునికిపాట్లు పడుతున్నాడు నారాయణ. పేచీపెట్టి అత్తనడిగి పుచ్చుకున్న పుస్తకం మీద తలపెట్టి పడుకుని నిద్రపోతోంది చిట్టి సుభద్ర. ఇంకా వంటింట్లో ఏవో సవరించుకుంటూ వుండిపోయింది కృష్ణవేణి....వాకిట్లో కుర్చీమీద కూర్చున్న తల్లిని చూసి ఆ పూట చాలా పెందరాళే యింటికి వచ్చాననుకున్నాడు విశ్వనాధం.

తల త్రిప్పుకొని కొడుకు వెళ్ళిపోయినా అట్టే సేపు అక్కడే కూర్చోలేకపోయింది సుభద్రమ్మ. కొడుకు అన్నం తిని గదిలోకి వెళ్ళేదాకా ఆగింది. అతను నిద్రలోకి జారేలోగా వెళ్ళి విషయం చెప్పాలని లేచింది.

కాని, అంతకంటే ముందు కృష్ణవేణి అతని దగ్గరకి వెళ్ళింది. అత్తగారి కంటె ముందు ఆదేమాట అతనితో చెప్పింది. చెప్పటం చాలా నెమ్మదిగా చెప్పింది. అనునయంగా అర్థం చేసుకోమన్న ప్రాధేయతతో చెప్పింది!

కాని, విశ్వనాధం అర్థం చేసుకునే స్థితిలో లేడు. "ఆయన కిష్టమయింది. ఆయన చేస్తున్నాడు. మధ్యలో నీ గోలేమిటి?" అని కసురుకున్నాడు.

"లేదు. ఆయనకిష్టమయి కాదు. ఇంట్లో వాళ్ళ కష్టం చూడలేక. తెచ్చిన డబ్బంతా నాకే యిచ్చారు. ఆ డబ్బు ముట్టుకోవటానికి నా ప్రాణాలు గిలగిలలాడాయి....ఈ వయస్సులో ఆయన్ని శ్రమపెట్టటం మనకి భావ్యం కాదు. ఇటు ఆడపిల్లలు....అటు ఆయన....నాకు చాలా బాధగా వుంది. దయుంచి నన్నర్థం చేసుకోండి ఇంక బాధ భరించలేను...."

ఆమె గుండె చించుకొని వచ్చిన ఆ మాటలు అతని రాతి గుండెను కదలించలేదు సరికదా—మరింత బండబారినట్లు స్పష్టం చేశాయి. "అంతగా వాళ్ళు కష్టపడటం చూడలేకపోతే....అప్పుచేసి అందాకా గడుపు....ఏదో ఒకనాడు అవన్నీ నేనే తీర్చుకుంటాను."

"అంతేకాని, ఈ పని మాత్రం మీరు మానరు!" అంది ఆమె నిస్పృహగా.

"ఏం. కళ్ళెఱ్ఱచేస్తే హడలిపోతాననుకుంటున్నావా?...."

"లేదు. మీకెవరన్నా భయం లేదు....కాని, ఒకప్పుడు ఇరుగు పొరుగూ బాధపడుతున్నా చూడలేకపోయేవారు. ఇప్పుడు మీ కన్నతండ్రి ఈ పెద్ద వయస్సులో కష్టపడుతుంటే మీకు బాధనిపించలేదు! అదేనండీ నా బాధ!...."

"అంత అభిమానం వున్నదానివి నువ్వేం

[64 వ పేజీ చూడండి]

'అందమే ఆనందం' అన్నారు. అటువంటి అందాల ఆనంద సౌరభాన్ని యిటీవల 'నీవియా క్రీమ్' ఉత్పత్తి దారులు నిర్వహించారు. ఈ అందాల పోటీలు బెంగళూరు, మద్రాసు, ఢిల్లీ, కలకత్తా, బొంబాయి నగరాలలో జరిగాయి. ఈ ఐదు నగరాలలో 'మిస్ బ్యూటిఫుల్'గా ఎన్నికైన ఐదుగురూ బొంబాయిలో జరిగిన 'మిస్ నీవియా క్వీన్' పోటీలలో పాల్గొన్నారు.

మద్రాసులో జరిగిన ప్రాంతీయస్థాయి పోటీలలో పన్నెండుమంది పాల్గొన్నారు. వారిలో పదహారేళ్ళ మిస్ పాలా బాల్‌డ్రీ 'మిస్ బ్యూటిఫుల్'గా ఎన్నికైంది. బొంబాయిలో జరిగిన 'మిస్ నీవియా క్వీన్' పోటీలలో ఆమె తృతీయ స్థానాన్ని పొందింది! ఇంతకీ పాలా ఇంతకుముందు ఎన్నడూ కూడా అందాల సుందరి పోటీలలో పాల్గొనలేదు. మద్రాసులోని హోలీ ఏంజెల్స్ కాన్వెంట్‌లో పదవ తరగతి విద్యార్థిని—మిస్ పాలా బాల్‌డ్రీ.

"ప్రథమ ప్రయత్నంలోనే ప్రాంతీయస్థాయిలో ప్రథమస్థానాన్నీ, జాతీయస్థాయిలో తృతీయ స్థానాన్నీ పొందడం నాకు ఎంతో వుత్తేజాన్ని కలుగజేసింది" అంటుంది పాలా.

ఆ పోటీలలో ద్వితీయ స్థానాన్ని పొందిన పద్దెనిమిదేళ్ళ మిస్ ఆలిసన్ డాలి మద్రాసులోని సీటా వరల్డ్ ట్రావెల్ సర్వీస్ సంస్థలో వుద్యోగం చేస్తోంది. గత సంవత్సరం మార్చినెలలో ఫెమీనా పత్రిక నిర్వహించిన 'అందాల సుందరి' పోటీలో ఆమె పాల్గొన్నది. ఆ పోటీలో కూడా ఆమె ద్వితీయస్థానాన్ని పొందింది.

'మిస్ బ్యూటిఫుల్' పోటీలో తృతీయస్థానం—పదిహేడేళ్ళ కుమారి మంజరి థోడేకి లభించింది. ఈమె మద్రాసు స్టెల్లా మేరీస్ కళాశాలలో మొదటి సంవత్సరం బి.ఎస్సి విద్యార్థిని. భరతనాట్యంలోనూ, స్టేజి నాటకాలలోనూ కూడా ఆమె పలు బహుమతులు గెల్చుకుంది. హిందీ, ఆంగ్ల భాషలలో గేయాలు కూడా రాస్తూ వుంటుంది కుమారి మంజరి.

మద్రాసులో జరిగిన 'మిస్ నీవియా బ్యూటిఫుల్' పోటీలకు-సినీ నటులు శ్రీమతి షావుకారు జానకి, శ్రీ జెమినీ గణేష్, భరతనాట్యంలో ప్రసిద్ధి గాంచిన శ్రీమతి చిత్రా విశ్వేశ్వరన్, ప్రముఖ న్యాయవాది శ్రీ గోవిందస్వామి-న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించారు.

# అందాల పోటీ



షీలా బాత్రా



మంజరి ఫడ్కే



ఆలిసన్ డాలి

[కృష్ణవేణి: 62వ పేజీ నుంచి]

చేస్తున్నావ్–యింట్లో తిని కూర్చోటం తప్పు!...."

అతని మాటల పెళుసుతనానికి కృష్ణవేణి నివ్వెరబోయింది.

"కబుర్లు చెప్పటం కాదు....సంపాదించేవాడికి తెలుస్తుంది కష్టమంటే యేమిటో!...."

ఆమె గుండెల్లో గునపం దింపినా అంత బాధ కలిగుండేది కాదేమో: పగలంతా పరిశ్రమతో ఆమెకు నీరసంగా వుంది. అన్నం కూడా తినలేదేమో కళ్ళు చీకట్లుక్రమ్మేంత నిస్సత్తువగా వుంది. దీనికి తోడు అతని సూటిపోటి మాటలు. ఆమె సహనాన్ని హరించేసాయి. "అవునండీ! మీరు మీ పేకాటలో సంపాదించి తెచ్చే వందలకి వందలు ఖర్చుపెట్టుకు తింటున్నాను!....నాకు ఒకళ్ళ కష్టం గురించి ఎలా తెలుస్తుంది!...."

భరించలేని బాధలో ఆమె అన్న మాటలు అవి మాత్రమే! కాని, అతని దృష్టిలో అదే ఒక మహాపరాధం అయిపోయింది. మంచం మీద నుంచి క్రిందకొక్క వురుకు వురికాడు. ఆమె వూపిరి తీసి విడిచే లోపల జుట్టు పట్టుకుని గుంజి ఊపిరి సలపనంతగా ఆమె దవడలు వాయించాడు. చేతులు నెప్పెట్టాయేమో–బలంగా ఒక్క త్రోపు తోసాడు....ఆ విసురుకి గది తలుపు మీదకి వచ్చిపడిపోయింది కృష్ణవేణి.... గది గుమ్మం బయట నిలబడి ఇంతసేపు వాళ్ళ మాటలు వింటున్న సుభద్రమ్మ పిచ్చిగా కేక పెట్టింది. అప్పటికే స్పృహతప్పి కుప్పగా కూలి పోయింది కృష్ణవేణి....ఆమెను గబుక్కున పట్టుకోలేకపోయిన తన అశక్తికి తిట్టుకుంటూ పెద్దగా యేడవసాగింది ఆవిడ.

గదిలో పడుకొని నిద్రపోతున్న సత్యనారాయణ గారితో సహా అంతా పరుగు పరుగున వచ్చారు.

సుభద్రమ్మ యేడుస్తూనే జరిగిందంతా చెపు తోంది. నిర్మలా మాధవీ కృష్ణవేణికి సపర్యలు చేస్తున్నారు.

"ఇంటెడు చాకిరీ తను చేసుకుంటోంది. పనిమనిషి పని, వంటమనిషి పని, చాకలిపని..... ఆఖరికి ఈ రోగిష్టి అత్తగారికి అన్నిసేవలూ తనే చేసుకుంటోంది. అలాంటి మనిషికి సంపాదించే వాళ్ళ కష్టం తెలియదా? హాయిగా తిని కూర్చుం టోందా?....అనటానికి వాడికి నోరెలా వచ్చిందో మరి!...."

కోడలినా స్థితిలో చూసేసరికి భార్య మాటలు వినేసరికి కొడుకు మీద ఎక్కడలేని కోపం వచ్చింది సత్యనారాయణగారికి. "ఇంటి విషయాలు పట్టని వాళ్ళకి యింట్లో ఎవరెంత కష్టపడుతున్నారో ఎలా తెలుస్తుందే!...."

"పాపం, తన కష్టం గురించి కృష్ణ ఏమీ చెప్పుకోనే లేదండీ! మీరు లాయరుగారి దగ్గర పనికి వెడుతున్నారని చెప్పింది. ఈ వయస్సులో మిమ్మల్ని కష్టపెట్టటం భావ్యం కాదని చెప్పింది. ఆ కబురు వింటే కళ్ళు తెరుచుకుంటాడేమోనని చెప్పింది. నేనూ చెపుదామని వెళ్ళబోతున్నాను. అంతలోనే యింత పని చేశాడు రాక్షసుడు.... నోరు చాల్లేదు చెయ్యి కూడా చేసుకున్నాడు...."

"తానెంత శ్రమపడుతోందో ఇంట్లో వున్న నీకే తెలియదు....వాడికెలా తెలుస్తుందే!...."

ఆయనమాటలర్థంకాక అంతా తెల్లబోయారు.

"ఒరేయ్ రవీ! వెళ్ళరా....లోపలికి వెళ్ళి మీ వదిన దాచిపెడుతున్న- బట్టలన్నీ తెచ్చి మీ అన్నయ్యకి చూపించరా!" అన్నాడాయన ఆవేశంగా.

"వద్దు నాన్నా! వదిన ఎవరితోనూ చెప్పద్దంది!" అన్నాడు రవి జంకుతూ.

"తానేం కష్టపడుతోందని మీ అన్నయ్య అడిగాడట! మీ వదిన తన నోటితో ఎలాగా చెప్పదు. నువ్వయినా చెప్పరా! అవి పట్టుకువచ్చి చూపించరా!" అన్నాడాయన బొంగురు కంఠంతో.

రవి లోపలికి వెళ్ళి మడతపెట్టబడిన క్రొత్త బట్టలు చాలా తెచ్చాడు....అవన్నీ విడదీసి కొడుకు వైపు చూపించాడు సత్యనారాయణగారు. "చూడరా చూడు! నువ్వు సంపాదించి తెచ్చి చ్చింది. ఖర్చు పెట్టుకోవటం లేదురా! పస్తైడన్నం తినటానికి తన కష్టం తానే పడుతోంది. ఇంట్లో ఇంతమందున్నా ఎవరూ లేని దానిలా తన తిండి ఖర్చు తనే సంపాదించుకుంటోంది. వాళ్ళవీ వీళ్ళవీ బట్టలు కుట్టుకు బ్రతుకుతోందిరా!.... చూడరా దౌర్భాగ్యుడా!...."

దుఃఖంతో ఆవేశంతో సత్యనారాయణగారి గొంతు పూడిపోయింది. విశ్వనాథం రాయిలా అలాగే నిలబడ్డాడు.

"ఎంతపని చేసావు వదినా!...." అంది నిర్మల యేడుస్తూ.

"నాకిదంతా తెలియనే తెలియదండీ! ఏవో యింట్లో బట్టలే కుట్టుకుంటోందనుకున్నాను." అంది సుభద్రమ్మ ఎంతో తప్పుచేసినదానిలా!

పంచె చివర్లతో తన కళ్ళొత్తుకున్నాడు సత్య నారాయణగారు. "నాకు మాత్రం తెలుసులే! ఒకరోజున కుట్టినబట్టలు రవిచేత ఎవరికో పంపిస్తుంటే చూశాను. వదిన ఎవరికీ చెప్పద్దంది నాన్నా అని వాడు యేడ్చాడు. వీడు బజారున పడి పేకాటాడుతూ యింటి పరువుని వీధికెక్కి స్తుంటే–మనందరి మర్యాదా దక్కించాలని తను గది తలుపులు వేసుకొని లోపల రెక్కలు ముక్కలు చేసుకుంటోంది!....నాకు తెల్సిందని ఎక్కడ బాధపడుతుందోనని నేనే తప్పించుకు తిరుగుతున్నాను. ఊరికే అలా తిరగటమెందుకని ఏవో నాలుగు కాగితాలు వ్రాస్తున్నాను....కొంచె మయినా ఆ పిచ్చితల్లి బరువు తగ్గిద్దామని!...."

సుభద్రమ్మకి దుఃఖం ఆగలేదు. "నాది పాడు జన్మయిపోయిందే తల్లీ! ఈ యింటి కోడలివయినందుకు నువ్వొక్కరోజు సుఖపడింది లేదు. నరకంలోకి వచ్చిపడ్డావు." అంటూ కాలు స్వాధీనం లేకపోయినా దేకుంటూ కోడలి దగ్గరకి వచ్చింది. ఆమె చేతిని తనలోకి తీసు కుంది. "ఇంకా తెలివి రానేలేదు. చూడండమ్మా! డాక్టర్నేనా తీసుకురండి..." అంది యేడుస్తూ.

వదినగారి తలని తన వళ్ళో పెట్టుకొని ఆమెకి స్పృహ తెప్పించటానికి ప్రయత్నం చేస్తూనే వుంది నిర్మల. తనూ ఏడిస్తే వాళ్ళు మరీ కంగారు పడతారని మాధవి గ్రుక్కిళ్ళు మింగుతోంది!

"అమ్మా! కృష్ణవేణీ!...." అంటూ దగ్గరగా వచ్చి రెండు మూడుసార్లు పిలిచాడు సత్యనారాయణగారు. కోడలి పాదాలు రాస్తూ తనూ సపర్యలు చేయసాగాడు.

వాళ్ళ ప్రయత్నాలు ఫలించాయి. మరి కాసేపటికి ఆమెకు తెలివి వచ్చింది. మాధవి వేడివేడి కాఫీ తెచ్చింది.

అక్కడున్న బట్టలన్నీ బొత్తుపెట్టి గబగబా లోపలికి తీసుకుపోయాడు రవి.

కృష్ణవేణి స్పృహలోనికి వచ్చినందుకు విశ్వనాథానిక్కూడా భయం తగ్గింది. అంతవరకు తల్లిదండ్రుల తిట్లకన్న....తను కొట్టిన దెబ్బల వల్ల ఆమెకేమయినా జరగలేదుకదా అని ఎక్కువ కంగారుపడ్డాడతను.

# లోకజ్ఞానం

1. మన దేశంలోనేకాక ప్రపంచంలోని అనేక దేశాలలో వస్తువుల తూనికకు యిప్పుడు కిలోగ్రాములనే వుపయోగిస్తున్నారు. వీటి వుపయోగం అమలులోకి వచ్చేముందు కిలోగ్రాము అంటే యిలా వుండాలి. అని ఒక నమూనా రూపొందించబడింది. అయితే ఆ నమూనా ఎక్కడ భద్రపరచబడిందో చెప్పగలరా?

2. ఆకాశం వైపు చూస్తూంటే మనకి ఎన్నో నక్షత్రాలు కనిపిస్తాయి. వాటిల్లో కల్లా అత్యంత ప్రకాశవంతమైన నక్షత్రం ఏది?

3. రాష్ట్రపతి జాకీర్‌హుస్సేన్ మరణానంతరం సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి ఒకరు కొంతకాలం పాటు ఆ పదవిని అలంకరించారు. ఆయన పేరేమిటో చెప్పగలరా?

4. నాట్యకళకి ప్రసిద్ధిగాంచిన దేశం మనది. అయితే మన దేశంలో ముఖ్యంగా పేర్కొనదగిన శాస్త్రీయ నాట్యరీతులు ఆరు వున్నాయి. అవి ఏవి?

5. ఈ భూ ప్రపంచంలో భూమ్యాకర్షణ శక్తి హఠాత్తుగా మాయమైందనుకోండి. అప్పుడేమవుతుంది?

6. ఇప్పుడు ఇందిరా కాంగ్రెస్, పాత కాంగ్రెసు, మరో కాంగ్రెసు అని యిన్ని కాంగ్రెసులున్నా ఒకప్పుడు వీటిలోని సభ్యులు, ప్రస్తుతం కేంద్రంలో అధికారంలో వున్న వారిలో చాలా మంది కూడా ఒకప్పుడు భారత జాతీయ కాంగ్రెస్‌లోని వారే. అయితే ఈ భారత జాతీయ కాంగ్రెసును ఎవరు....ఎప్పుడు స్థాపించారు?

7. రవీంద్రనాథ టాగూర్ స్థాపించిన విశ్వవిద్యాలయం పేరు ఏమిటి?

8. మనదేశంలో ఆంగ్ల భాష బోధనతో పాటు పాశ్చాత్య విద్యా విధానం అంతా బ్రిటిషు వారి పాలనలో వచ్చిందన్నది అందరికీ తెలుసు. అయితే మొట్టమొదటిసారిగా ఈ పాశ్చాత్య విద్యా విధానాన్ని మనదేశంలో ప్రవేశపెట్టిన కళాశాల ఏది? ఏ నగరంలోనిది?

9. డాక్టర్ ధర్మేంద్ర ఎవరు?

10. బంగారం గురించి గత నెల 'వనిత'లో మీరు ఒక వ్యాసం చదివారు. మరి ప్రపంచంలోకల్లాఅత్యధికంగాబంగారం వుత్పత్తి చేస్తున్న దేశం ఏదో చెప్పగలరా?

[సమాధానాలు ఈ సంచికలోనే వున్నాయి వెతికి మీ సమాధానాలతో సరిపోతాయేమో చూడండి.]

## 49

ఆ సంఘటన తర్వాత విశ్వనాథం మారింది ఏమీ లేదు కాని....కృష్ణవేణి మళ్ళీ అలాంటి శ్రమపడకుండా అంతా తలోవైపుగా కాపలా కాసారని చెప్పవచ్చు!

"నువ్వు మళ్ళీ బట్టలు కుట్టావంటే నా మీద ఒట్టే!" అని ఆంక్ష పెట్టింది నిర్మల.

రెండు మూడు రోజులు మాధవీ ఆమే కూర్చుని యింట్లో వున్న బట్టలన్నీ కుట్టేసి ఎవరివి వాళ్ళ కప్పగించేసారు. ఎవరయినా మళ్ళీ యిస్తే తేవద్దని తమ్ముడితో గట్టిగా చెప్పింది నిర్మల. ఓపిక లేకపోయినా లేచివచ్చి కోడలి దగ్గరే తరచు కూర్చుంటోంది సుభద్రమ్మ!

సత్యనారాయణగారు ఎండవేళ కాక సాయంత్రం చల్లబడ్డాక వెడుతున్నాడు లాయరు గారింటికి! "వదిన బాధపడుతోంది మీరీ పని మానెయ్యండి నాన్నా!" అని రెండు మూడు సార్లంది నిర్మల. "కాలక్షేపానికి వెడుతున్నానే కాని....నేనేం కష్టపడటం లేదమ్మా!....ఓపిక లేనినాడు మానేస్తాను." అని సర్దిచెప్పాడాయన.

కాలం బరువుగా గడుస్తోంది. మాధవికి కాలేజీ శలవులిచ్చాక కృష్ణవేణికి కొంత విశ్రాంతి దొరికింది!

ఓ రోజున రవి పరీక్ష ఫలితాలు వచ్చాయి. అతను పాసయినందుకు ఇంట్లో అందర్కీ ఆనందమయింది.

కాని, ఓ వారం రోజులు పోయాక బట్టల నిండా మరకలతో వచ్చిన తమ్ముడ్ని చూసి "ఎక్కడికి వెళ్ళావు? ఏం చేశావు?" అని తరచి తరచి అడిగింది నిర్మల.

చెప్పలేక చెప్పలేక తనో స్కూటరు రిపేరు షాపులో మెకానిక్‌గా చేరానని చెప్పాడు రవి.

"ఎందుకు?....ఎందుకు చేస్తున్నావురా యీ పని?" అని కోపంగా అడిగింది ఆమె.

"పని నేర్చుకుందామని!"

"ఈ పని నేర్చుకుని ఏమి చేద్దామనుకుంటున్నావ్?"

"ఎక్కడేనా మెకానిక్‌గా ఉద్యోగం చేద్దామనుకుంటున్నానక్కా!"

"ఏం, కాలేజీలో చేరి పైకి చదువుకోవాలని లేదా?"

రవి మాట్లాడలేదు.

"మాట్లాడవేంరా?"

"కాలేజీ చదువంటే బోలెడంత ఖర్చని నీకూ తెలుసు కదా! ఇంతకాలం మీరంతా కష్టపడి నన్ను చదివించారు. ఇంకెవర్నీ బాధ పెట్టటం నా కిష్టంలేదక్కా!..." అన్నాడు రవి తలదించుకుంటూ.

నిర్మల నివ్వెరపోయింది. "విన్నావా వదినా వీడి మాటలు!...."

కృష్ణవేణికేమనాలో పాలుపోలేదు.

[సశేషం]

# పుస్తకాలు పత్రికలు పెట్టుకోవడానికి......

సాధారణంగా మనం కాలక్షేపం కోసం పుస్తకాలు కొంటూవుంటాము. అలా కొన్న పుస్తకాలు సరిగ్గా చదువుదామనుకున్న సమయానికి యింట్లోనే ఎక్కడో కనిపించకుండా పోతూ వుంటాయి. దాంతో చిరాకు, విసుగూ కలుగుతాయి. ఆ సమయంలో పుస్తకాలు పొందికగా ఒకచోట అమర్చుకుంటే బాగుంటుందని అనిపించడం సహజం. అలా అమర్చుకునేందుకు ఉపయోగపడే వస్తువు— మేగజైన్ రేక్ (Magazine Rack). ఇది ఉపయోగకరమైనదే కాకుండా అలంకార ప్రాయంగా కూడా వుంటుంది.

ఇది తయారు చేసుకునేందుకు కావలసిన వస్తువులు: 6″×52″ జనుము గుడ్డ (Jute). మూడు అంగుళాల సైజు గల ప్లాస్టిక్ రింగ్, ఏప్లిక్ వర్క్‌కోసం పువ్వులు, లేస్, క్రోషే చేసిన పెద్దపువ్వు ఒకటి, రూబియా పూసలు 4

(రూబియా బీడ్స్ (Rubia beads) పేరిట బజార్లో ఇవి దొరుకుతాయి. ఈ పూసలు చూడడానికి స్ఫటికం వలె వుంటాయి. ఇవి దొరకకపోతే బజార్లో లభించే మామూలు పూసలు పెద్ద సైజువి వుపయోగించవచ్చును).

మొదట 6"×52" సైజులోని జనుము గుడ్డని తీసుకోవాలి. ఆ గుడ్డ రెండు వైపుల నుంచి ½" మడిచి కుట్టు వెయ్యాలి. అంటే బెల్టు తయారు చేసుకునే విధంగా కుట్టుకోవాలన్నమాట. ఆ తర్వాత వుల్టాగా కుట్టుకున్న గుడ్డని సరైన వైపుకి అంటే రైట్ సైడ్‌కి తిప్పుకోవాలి. ఆ విధంగా రెండు ముక్కలు తయారు చేసుకోవాలి.

ఆ తర్వాత ప్లాస్టిక్ రింగులోకి ఈ రెండు గుడ్డముక్కలు పోనిచ్చి వాటి చివరలు కుట్టుకోవాలి. అంటే ఇప్పుడది గుండ్రంగా తయారైందన్నమాట.

ఇక ఇప్పుడు రింగు వైపునుంచి 10" విడిచిపెట్టి బెల్టు రెండువైపులూ కలిపి వాటి మీద లేసు కుట్టాలి. రెండవ బెల్టు మీద కూడా ఈ విధంగానే చేసుకోవాలి.

రింగు వైపునుంచి 8" విడిచిపెట్టి క్రోషే చేసిన ఏప్లిక్ ఫ్లవర్‌ని బెల్టులు రెండూ కలిసే చోట బెల్టుల ఉపరితలం మీద కుట్టుకోవాలి. (ఫోటోలో చూపిన విధంగా).

ఇప్పుడు క్రింది భాగం నుంచి పై వైపుకి 8" జాగా విడిచిపెట్టి లేస్ అల్లుకోవాలి. ఐతే ఈసారి మాత్రం బెల్టుకి రెండు వైపులా లేసు అల్లనవసరం లేదు. ఒక వైపు అల్లితే చాలు. ఫోటోలో చూసినట్లుగా చిన్న చిన్న ఏప్లిక్ పువ్వులని అక్కడక్కడ అమర్చుకుంటే అందంగా వుంటుంది. ఇక మిగిలిందల్లా రూబియా పూసలని గానీ మామూలు పెద్ద సైజు పూసలని గానీ రేక్ క్రింద భాగంలో చక్రాల్లా అమర్చుకోవడం. ఇలా చేసుకున్న మేగజైన్ రేక్‌లో పుస్తకాలు అమర్చుకుంటే నిండుగా చూడ ముచ్చటగా అందంగా వుంటుంది.

# ప్రాచీన అలంకరణ






ఇక్కడ కనిపిస్తున్న ఆభరణాలు–ఐదవ శతాబ్దానికి చెందినవిగా భావింపబడుతున్నాయి. చిత్రంలో (అజంతా గుహ) కనిపిస్తున్న వ్యక్తి – పూలు తీసుకు వస్తున్న దాసి. 'రిబ్బను' లాంటి గుడ్డను, ఈమె జుట్టుకు కట్టుకోడం చూస్తే — ఈ విధానం అప్పట్లోనే వుండేదని అర్థమవుతుంది: చెవులకు పెట్టుకున్న పెద్ద పెద్ద కమ్మలు, చేతులకు వేసుకున్న అంటి పెట్టుకున్న గాజుల జతా — ఇవాల్టి 'ఫాషన్'గా కూడా చూస్తున్నాము. సిగచుట్టూ, చుట్టుకున్న గుడ్డ కూడా అందమైన అలంకారంగానే వుంది: (చిత్రంలో వున్న ఆభరణాలే, విడిగా పెద్ద బొమ్మలుగా కనిపిస్తున్నాయి.)

చిత్రం: శ్రీమతి ఉదయగిరి

# మీపిల్లలకు అధిక శక్తినిస్తుంది...
# అగ్రస్థానం చేకూర్చుతుంది...
# కోకో-రుచిగల బోర్న్‌విటా!



బోర్న్‌విటాలో ఇప్పుడు అధికంగా కోకో ఉన్నది. దానిని మరింత రుచికరంగా-ఆరోగ్యంగా చేసేందుకు

అంతేకాక బోర్న్‌విటా మాల్ట్, పాలు మరియు పంచదారల పోషకత్వపు గుణాలతో నిండియున్నది.

వేడి కప్పు పాలలో రెండు చెంచాలతో రుచికరమైన పోషకత్వం గల పానీయం తయారవుతుంది. మీ పిల్లలకు ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వండి. రోజుకు రెండుసార్లు వారి ఎదిగే శరీరాలకు అమూల్యమైన పోషకత్వం చేకూర్చేందుకు సహాయపడుతుంది మీకు గూడా బోర్న్‌విటా అవసరం. వారికి తగ్గటుగా ఉండేందుకు!

క్యాడ్‌బరీస్

## బోర్న్‌విటా

అధిక కోకో గలది: అధిక రుచి, అధిక పోషకత్వం!







OBM 8376 B/TL



## మన దేవాలయాలు:

# తిరుపతి



అర్థమేలేని బ్రతుకులకు పైతం సర్వార్థాలు సమకూర్చేది అర్థం! పురుషార్థాలైన ధర్మ, అర్థ, కామ, మోక్షాలలో 'అర్థా'నికి ద్వితీయ స్థానం కల్పించారు మన పెద్దలు. కాని మిగతా పురుషార్థాలను సాధించడంలో 'అర్థం' పాత్ర అద్వితీయమైనది. అది లేకుంటే పురుషార్థాల మాట ఎలా వున్నా మనిషి, మనిషిగా నిలబడలేడు. జీవన గమనానికి ధనం— మనిషికి హృదయం లాంటిది.



ఈ జీవిత సత్యాన్ని ప్రపంచానికి చాటడానికా అన్నట్టు – సర్వమంగళ ప్రదాయినియైన లక్ష్మీ దేవిని హృదయంలో నిలిపి – వైష్ణవులు కొలిచే వేంకటేశ్వరుడు తెలుగు వారి ఇలువేల్పుగా ఏడు కొండల మీద వేంకటాచలపతిగా వెలుగుతున్నాడు!

వేంకటాచల ఆవిర్భావం గురించి దాని మహాత్మ్యం గురించీ పద్మ, వరాహ, బ్రహ్మాండ పురాణాలతోపాటు వేంకటాచల ఇతిహాస మాల-వేనోళ్ళ కొనియాడుతున్నాయి. నాలుగు యుగాల లోనూ ఈ శైలం శాశ్వతమయిందనీ – కృత యుగంలో వృషభాచలంగా, త్రేతా యుగంలో అంజనాచలంగా, ద్వాపర యుగంలో శేషాచలంగా కలి యుగంలో వేంకటాచలంగా ఇది ప్రసిద్ధి చెందుతుందనీ పురాణాలు చెప్పాయి.

కృష్ణా నదికి దక్షిణ దిశగా తూర్పు కనుమలు - నల్లమలగా, తిరుమలగా వ్యాపించి వున్నాయి. చిత్తూరు జిల్లాలోని శేషాచలం మీద శ్రీనివాస ఆలయం సముద్ర మట్టానికి ఇంచుమించు రెండు వేల అడుగుల ఎత్తులో వున్నది. పురాణ గాథల ప్రకారం విష్ణువు శేషశయనుడు. ఇక్కడి కొండలు కూడా పడుకున్న ఏడు తలల పాములా కనబడడంవల్ల దీనికి శేషాచలం అన్న పేరు యేర్పడిందని చెబుతారు. అంతేకాదు. శేషం తరుగులేని శాశ్వతమైన జ్ఞానానికి సంకేతం. అది నాశనము లేనిది. జ్ఞానాన్ని ఆలయంగా కలవాడు దేవుడు గనుక విష్ణువు శేషశయనుడు. శేషాచలనామ రహస్యార్థం ఇదే అంటారు విజ్ఞులు!

తిరుమల, దానికి క్రిందవున్న తిరుపతి రెండూ అతి ప్రాచీనమైనవే. కాని వాటి చారిత్రకాధారాలు మాత్రం సరిగా లేవు. తొండమానుడనే రాజు, మొదట ఈ గుడిని కట్టించాడనీ ఆ తర్వాత పల్లవ, చోళ పాండ్య రాజులే కాకుండా చంద్రగిరి యాదవరాజులు కూడా ఈ ఆలయ అభివృద్ధికి పాటుపడ్డారనీ ఇక్కడి శిలాశాసనాలు చెబుతున్నాయి. అద్వైత సిద్ధాంతం ప్రతిపాదించిన ఆదిశంకరులు; విశిష్టాద్వైత సిద్ధాంత విశిష్టతను జన సామాన్యానికి చాటి చెప్పిన రామానుజాచార్యులు శ్రీనివాస మందిర ఉద్ధరణకు ఎంతో కృషి చేశారట. అయితే ఈ ఆలయానికి ఎన్నో సీమలను దానంచేసి గాలిగోపురం, స్వర్ణవిమానం, నిర్మాణంతోపాటు 'ఆనంద నిలయాన్ని' స్వర్ణకాంతులు విరజిమ్మే విధంగా చేసి – ఆలయం మూడు పువ్వులు, ఆరు కాయలుగా కళకళలాడడానికి దోహదం చేసిన వారు విజయనగరం రాజులే-అంటారు.

సాహితీ సమరాంగణ సార్వభౌముడనీ, ఆంధ్ర భోజుడనీ యశస్సు నార్జించిన శ్రీ కృష్ణదేవరాయలు తన జీవితంలో ఒక నిర్దిష్టమైన విజయం సాధించినప్పుడల్లా ఏడుకొండల వానిని దర్శించి కృతజ్ఞతాంజలి ఘటించాడట! అందుకు నిదర్శనాలా– అన్నట్టుగా ఆలయ ప్రవేశంలోనే-కృష్ణరాయలు, భార్యలతో తిరుమల దేవుని అర్చిస్తున్నట్టున్న విగ్రహాలు కనిపిస్తాయి.

మహావిష్ణువును ధ్యానించి ధ్యానించి తమ మనసులను అందాల బృందావనాలుగా మార్చుకుని అందులో అల్లనల్లనసాగే తేనెల సెలయేటి పాయల్లా వేంకట నాథుని మీద సుమధుర భక్తి గీతాలను ఆలపించి తమ జన్మ ధన్యమయిందని ఆనంద బాష్పాలతో పులకించినవారు ఆళ్వారులు!



ఆడినమాటల్లా అమృత కావ్యంగా, పాడినపాటల్లా పరమ గానంగా ఆలపించిన పదకవితా పితామహుడు తాళ్ళపాక అన్నమయ్య; వేంకటనాథుని సేవించి తరించడమే జన్మకు సార్థకమని వేంకటాచలమహాత్మ్యం రచించిన తరిగొండ వేంకమాంబ; త్యాగబ్రహ్మ మొదలైనవారు సమర్పించిన సుమధుర భక్తి పరిమళ విలసిత కవితా సుమాల మాలలందుకున్నవాడే వేంకట రమణుడు!

విజ్ఞానశాస్త్రం, దైవ నమ్మకం ఉత్తర దక్షిణధ్రువాల లాంటివి. ఒకటి వుండేచోట మరోదానికి చోటు వుండదు — ఇది కొందరివాదం. కాని ఇవాళ విద్యావిజ్ఞాన చంద్రికలు వెదజల్లే విశ్వవిద్యాలయ పూర్ణచంద్రోదయానికి ముఖ్య కారణం తిరుమల మీద వెలుగొందే శ్రీ వేంకటేశ్వర ఆలయం! ఇది ప్రత్యక్ష నిదర్శనం.

ఒక్క విశ్వవిద్యాలయమే కాదు — తిరుపతి పట్టణమే ఈ గుడిని కేంద్రంగా చేసుకుని ప్రముఖ వ్యాపార కేంద్రంగా పారిశ్రామిక రంగంలో కూడా రోజు రోజుకూ సత్వర అభివృద్ధి సాధిస్తున్నది. అందుకే దీనిని 'దేవాలయ నగరం' అని కూడా అంటారు.

ఉత్తర భారత దేశానికి, దక్షిణ భారత సంస్కృతికీ మధ్య వెలుగొందే సేతువు లాంటిది మన తెలుగు నేల. ఈ రెండు ప్రాంతాలవారికే కాదు దేశం నలుమూలల నుంచి వచ్చే ప్రజావళికి కూడలి మన వెంకన్న కొలువున్న తిరుమల!

తిరుమల మీద వెలుగొందే వెంకన్న ఆలయమే కాకుండా తిరుపతిలోని గోవిందరాజులస్వామి ఆలయం, కోదండరామస్వామి ఆలయం తిరుచానూరులోని అలమేలు మంగ ఆలయం కూడా ముఖ్యమైనవే.

ఏడుకొండల మీద అక్కడక్కడ ఎన్నో తీర్థాలు వున్నప్పటికీ కపిల తీర్థం, గోతీర్థం, ఆకాశగంగ, స్వామి పుష్కరిణి మొదలైన తీర్థాలను పరమ పవిత్రాలుగా ముక్తి ప్రదాలుగా భక్తులు విశ్వసిస్తారు.

తిరుపతి అనగానే వేంకటాచలపతితోపాటు ప్రతి వారికీ గుర్తు వచ్చేది- భక్తులు అర్పించే తల నీలాలు; హుండీలో పోగయ్యే డబ్బు; బంగారం! భారత దేశంలోనే కాదు ప్రపంచం మొత్తం మీద కూడా ధన సంపదలో ఈ గుడికి సరితూగ గల ఆలయం లేదు! అందుకేనేమో వేంకటేశ్వరుని 'స్వర్ణబ్రహ్మ' అన్నారు!

ఏడాది పొడవునా సగటున రోజుకు ఇరవై వేల మంది వేంకటేశుని దర్శిస్తారు. పుష్కరిణిలో స్నానంచేసి తల నీలాలను కానుకగా సమర్పిస్తారు. నల్లటి జుట్టును తీసి వేయడం, తామసగుణం వదలి వేయడానికి సంకేతంగా పెద్దలు చెబుతారు. అంటే అజ్ఞానం, అజాగ్రత్త, సోమరితనం మొదలైన వాటిని పోగొట్టుకుంటేనే శుద్ధ సత్త్వ స్వరూపుడైన శ్రీనివాసమూర్తి (ఆనందం) దర్శనం సాధ్యమవుతుందన్నమాట!












మన కంటికి కనబడేది, తాకడానికి వీలయ్యేది- స్థూలశరీరం. కంటికి కనబడకుండా శరీరం కదలడానికి, పని చేయడానికి దోహదం చేసేది ఉచ్ఛ్వాస నిశ్వాసరూపాలలో వుండే ఊపిరి. దీనినే సూక్ష్మ శరీరం అన్నారు మన పెద్దలు. ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు ఆధారంగా వుండేది ప్రాణం. మన పూర్వులు దీనిని కారణశరీరం అన్నారు. ప్రాణాలకు ప్రాణంగా-స్థూల, సూక్ష్మ కారణ శరీరాలకు ఆధారమైనవాడు దేవుడు. మన శరీరాలకు మాత్రమేకాదు. విశ్వమంతటికీ ఆధారభూతమైనవాడు దేవుడే కనుక ఈ దివ్య సత్యానికి సంకేతంగా తిరుపతి మూల విరాట్టు చుట్టూ మూడు ప్రాకారాలు-బంగారు వాకిలి, వెండి వాకిలి, గర్భగుడి నిర్మించబడి వున్నాయి।

దర్శించినవారిని ఇట్టే ఆకర్షించే ఏడడుగుల దివ్యమంగళ విగ్రహం। అతడే సర్వలోకాలకు అధినాథుడని చాటే మణిమయమకుటం. ఉదయ భానుని దివ్య తేజస్సుతో వెలుగొందే ముఖపద్మం।

అంతులేకుండా పరిభ్రమించేది కాలం. కాని దానిని తన ఇష్టప్రకారం పరిభ్రమింపజేసేది దివ్య శక్తి। దీనిని సూచించడానికే అన్నట్టు శ్రీవారికి దక్షిణపార్శ్వంగా శ్రీ చక్రం।

ప్రణవనాదం పరబ్రహ్మ స్వరూపం అంటారు పెద్దలు. శంఖం ప్రణవనాదానికి పవిత్రసంకేతం. అందుకే వేంకటేశుని వామభుజం వద్ద శ్రీ శంఖం।

కొలిచేవారి జీవితాలలో దివ్య పరిమళం వీస్తుంది అని తెలియజేయడానికా అన్నట్టు క్షీరసాగర పుత్రికకు నివాసస్థానమైన శ్రీనివాసుని వక్షస్థలం మీద వెలుగొందే తులసీమాల।

వినీల ఆకాశంలో మెరిసే తారల సమాహారంలా, పట్టుపీతాంబరధారియైన నీలమేఘశ్యాముని శరీరం నిండా వజ్రవైఢూర్యాది నవరత్న హారాలు; కాసు మాలలు।

'నా చరణాలను శరణు పొందినవారిని తప్పక కాపాడుతాన'నే వరదహస్తం।

వైష్ణవాచారంలో 'శరణాగతి'కి ఉన్నంత ప్రాముఖ్యం మరి దేనికీలేదు. మనిషి కష్టసుఖాల నుంచి కడతేరి శాంతియుతంగా జీవించాలంటే అది 'ప్రపత్తి' ద్వారానే సాధ్యం అంటుంది శ్రీవైష్ణవం।

ప్రపత్తి అంటే-జీవితనావను విధి తుపానుకు వదలి, చేతులు జోడించి కీర్తనలు ఆలాపించడం కాదు. మనం మంచి మార్గంలో నడిచినంతకాలం దేవుని రక్షణ వుంటుంది. జరిగిపోయినదానికి విచారించకుండా జరగనున్నదానికి బెంగపడిపోకుండా ప్రస్తుత కర్తవ్యాలను భగవదర్పణ బుద్ధితో సక్రమంగా నెరవేర్చినట్టయితే ప్రగతి, అభ్యుదయం అగమన్నా ఆగవు. ఇదే ప్రపత్తిమార్గ పరమార్థం। నరక తుల్యమయిన ఈ భువి-స్వర్గం కావడానికి అదే రాజ మార్గం—అంటుంది శ్రీ వైష్ణవమతం।



## దత్తపుత్రులు

పిల్లలను దత్తు తీసుకోవడమన్నది ఈనాటిది కాదు. అనాదిగా వస్తున్న ఆచారమే. అయితే కొత్త ఏమిటీ అంటే అలా దత్తు తీసుకోవడంవల్ల-దత్తు తీసుకున్నవారికి ఆనందం కలగడం, గౌరవం పెంపొందడం కన్న ముఖ్యమైనది - ఆ పిల్లలకి అందువల్ల ఏమైనా లాభం చేకూరుతోందా లేదా అన్నది.

1945 ప్రాంతాల్లో ఇంగ్లండులో ఈ విషయంపై అలజడి చెలరేగింది. చివరికి ఆ అలజడి కారణంగా ప్రభుత్వం విచారణా సంఘాన్ని కూడా నెలకొల్పవలసిన ఆగత్యం ఏర్పడింది. ఇంతకీ ఆ అలజడికి కారణం - పెంపుడు తలిదండ్రుల సంరక్షణలో వున్న ఒక పసికందు మరణించడం। ఆ 'తలిదండ్రుల' నిర్లక్ష్యంవల్లే ఆ బాలుని మరణం సంభవించిందన్న విషయంపై విచారణ సంఘం ఏర్పాటు చేయబడింది. డేమ్ మైరా కర్టిస్ ఆ విచారణ సంఘానికి అధ్యక్షత వహించారు. కర్టిస్ రిపోర్టు పేరిట వెలువడిన నివేదికలో యిలా వుంది:

''దత్తు తీసుకునే వారు తమ పిల్లల మీద ప్రేమానురాగాలు చూపించాలి. వారి లోటుపాట్లు అర్థం చేసుకోవాలి. వారి చిన్నారి వ్యక్తిత్వాన్ని గౌరవిస్తూ అది పెంపొందేందుకు తోడ్పడాలి. వారిలో స్థిరత్వాన్ని, స్వయంగా ఆలోచించగల శక్తినీ కలుగజేయాలి. అందుకు తగ్గ అవకాశాలు కల్పించాలి. వారిని పెంపుడు జంతువులను పెంచినట్లుగా కాకుండా తమ వయసు వారితో కలిసి మెలసి వుండేటట్లు, ఆట పాటలలో పాల్గొనేటట్లు చెయ్యాలి।''

మరొక ముఖ్య విషయం — 'ఏ క్షణంలోనూ వారు తమ సొంత పిల్లలు కారు అన్న ఆలోచన మనసులోకి రాకుండా చూసుకోవాలి. అప్పుడే అలా దత్తు వెళ్ళినవారికీ, తీసుకున్న వారికీ సుఖం.



1. ప్రపంచం మొత్తం మీద పదిహేను ఏళ్ళ లోపు పిల్లలలో పనిచేసే వారి సంఖ్య— 5 కోట్ల 20 లక్షలు. అయితే భారత దేశంలో వీరి సంఖ్య 1 కోటి 70 లక్షలు. ఇందులో బాలికల సంఖ్య 26 లక్షలు
2. మనదేశంలో ఆరేళ్ళలోపు పిల్లలు 1? కోట్ల మంది వున్నారు. 14 ఏళ్ళ లోపు పిల్లలు దేశజనాభాలో 42 శాతం వున్నారు. మరో పదేళ్ళలో వీరి సంఖ్య మరో 14 కోట్లకి పెరగవచ్చునని అంచనా వేయబడుతోంది.
3. మనదేశంలో ఒకటవ తరగతిలో చేరిన పిల్లలలో ఐదో తరగతి చేరుకునే లోపలే సగం మంది చదువు మానివేయడం జరుగుతోంది. మిగిలిన వాళ్ళల్లో ఎనిమిదవ తరగతికి చేరుకునే వారి సంఖ్య - 25 శాతం మాత్రమే. ఇలా చదువు మానేసిన వారిలో విద్యార్థుల సంఖ్య కన్న విద్యార్థినుల సంఖ్య రెట్టింపు వుంది. విద్యా సదుపాయాలు ఈ విధంగా వృధా చెందడానికి 55 శాతం కారణం పేదరికం అని నిపుణులు చెబుతున్నారు.



హైద్రాబాద్‌లో ఇటీవల శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌కు ప్రధాని శ్రీ మొరార్జీ దేశాయ్-యునెస్కో అవార్డును అందజేశారు. అక్షరాస్యతా వ్యాప్తికై గణనీయమైన సేవ చేసినవారికి అంతర్జాతీయ సంస్థ యునెస్కోవారు యిచ్చే ఈ అవార్డు ఈ సంవత్సరం శ్రీమతి దుర్గాబాయ్‌కి లభించింది! 'ఈ బహుమతిని తాము అక్షరాస్యతా వ్యాప్తికై కృషి చేస్తున్న వేలాది సేవా కార్యకర్తల తరఫున స్వీకరిస్తున్నా'మని అన్నారు శ్రీమతి దుర్గాబాయ్.

## వార్తావనిత



తెనాలి మహిళామండలి ఆధ్వర్యాన ప్రముఖ రచయిత్రి శ్రీమతి మాదవపెద్ది పుణ్యశీలా ప్రసాద్‌కు అక్టోబర్ 28 వ తేదీన ఘన సన్మానం జరిగింది. మహిళా మండలి భవనంలో జరిగిన ఈ సన్మానానికి మండలి అధ్యక్షురాలు శ్రీమతి ఉయ్యూరు ధనలక్ష్మి అధ్యక్షత వహించారు.

మండలి కార్యదర్శిని శ్రీమతి మాదవపెద్ది మీనాక్షి సభికులకు స్వాగతం పలికి, ముఖ్య అతిథిని పరిచయం చేసి, తమ మండలి కార్యకలాపాలను వివరించారు.

తెనాలి వి. యస్. ఆర్ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీమతి ఏంజెలా పాల్‌మన్ రాజ్ మండలి తరుపున శ్రీమతి పుణ్యశీలా ప్రసాద్‌కు ఒక నటరాజ విగ్రహాన్ని, ఒక మెమెంటోను బహూకరించి, సన్మానించారు.



ప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి యద్దనపూడి సులోచనా రాణికి 1978 సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ అవార్డు లభించింది. ఆమె రచించిన ''కీర్తి కిరీటాలు'' ఈ సంవత్సరపు ఉత్తమ నవలగా ఎన్నికకావడంతో ఆమెకు ఈ బహుమతి లభించింది. శ్రీమతి సులోచనారాణికి ఈ అవార్డుతో పాటు వెయ్యినూటపదహార్లు నగదు బహుమతి కూడా అకాడమీ నుండి లభిస్తుంది.

కళాసాగర్ (మద్రాసు) వార్షికోత్సవ సందర్భంగా జరిగిన వేడుకలలో ఉత్తమ చలనచిత్ర కథకురాలిగా (ఆమె కథ) భానుమతి రామకృష్ణ ద్వారా బహుమతి అందుకుంటున్న వాసిరెడ్డి సీతాదేవి. మధ్య వున్నది - ఉపాధ్యక్షుడు టి. వి. కె. శాస్త్రి.





గోల్కొండ (హైదరాబాదు) లయన్ లేడీస్ క్లబ్బు యిటీవల లయనెస్ క్లబ్బుగా రూపొందిన సందర్భంలో ప్రారంభోత్సవం చేస్తూ లయన్సు డిస్ట్రిక్టు 324C ప్రథమ మహిళ లయన్ లేడీ నిర్మలా భాస్కరరెడ్డి దీపపు కుందుని వెలిగించారు. ఈ లయనెస్ క్లబ్బు అధ్యక్షురాలిగా శ్రీమతి కళా శంకర్, కార్యదర్శిగా శ్రీమతి నళిని భాస్కర్, కోశాధికారిగా శ్రీమతి కె. నిర్మల - తదితరులు పదవీ స్వీకారం చేసారు. —విలేకరి



విశాఖపట్నం ఇన్నర్‌వీల్ క్లబ్ కార్యకర్తలు ఇటీవల రామనగర్ లయన్స్ సామూదాయిక భవనంలో వంటల పోటీ ఏర్పాటు చేసారు. పాకశాస్త్ర కళలో అభిరుచి వున్న నగరంలోని మహిళలు 72 మంది యీ పోటీల్లో పాల్గొన్నారు. తీపి, కారపు శాకాహార వంటకాలు (కోడిగ్రుడ్డు నిషేధం కాదు) ఒకటిన్నర గంటల కాలంలో కిరోసిన్ స్టవ్‌ల మీద మాత్రమే అక్కడికక్కడ తయారుచేసి పోటీ ప్రదర్శనకు అందజేయడం అందులోని విశేషం! ఆనాడు తయారు చేసిన వంటకాలు - వాటి తయారీ విధానాలు (బొమ్మలతో సహా) వివరిస్తూ ఒక గ్రంథాన్ని త్వరలోనే విడుదల చేస్తున్నారు. పోటీలో గెలుపొందిన విజేతలకు – ముఖ్య అతిథిగా పాల్గొన్న కేంద్ర రైల్వే మంత్రి సతీమణి శ్రీమతి ప్రమీలా దండావతే బహుమతులను పంచి పెట్టారు. ఈ పోటీ నిర్వహణలో నగరంలోని ప్రముఖ రా[illegible]యస్లు సహకరించారని, వారికి తమ కృతజ్ఞతలను తెలుపుకుంటున్నామని ఇన్నర్‌వీల్ క్లబ్బు అధ్యక్షురాలు, శ్రీమతి కమలాచిత్రా తెలియజేసారు.

ఈ పోటీలకు నౌకాదళ తూర్పు ప్రాంతీయాధికారి సతీమణి శ్రీమతి శంకర్, పోలీస్ డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ - జనరల్ సతీమణి శ్రీమతి వల్లాషా, శ్రీమతి భయంకర్, శ్రీమతి భానుమతి న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు. —విలేకరి

స్థానిక రాణీ చంద్రమతీదేవి వైద్యశాలలో చికిత్స, శిక్షణ పొందుతూన్న వికలాంగులైన పిల్లల సంక్షేమ సహాయాల నిమిత్తం ఇన్నర్‌వీల్ క్లబ్, విశాఖపట్నం నవంబరు నెల నాలుగవ తేదీన కుమారి ఊర్మిళ భరతనాట్య ప్రదర్శన ఏర్పాటు చేసారు. వాల్తేరు ఆంధ్రా యూనివర్సిటీ అసెంబ్లీ హాలులో జరిగిన ఆ నృత్య ప్రదర్శనకు ఆర్. సి. డి. వైద్యశాలలోని వికలాంగులూ, మానసిక రోగులూ అయిన పిల్లలు కూడా హాజరై ప్రదర్శనను చూసి ఆనందించారు. ఆనాటి ప్రదర్శనకు లోక్‌సభ డిప్యూటీ స్పీకరు, శ్రీ గోడే మురహరి విచ్చేసి కుమారి ఊర్మిళను ఆశీర్వదించారు. ముఖ్య అతిథిగా పాల్గొన్న శ్రీమతి పార్వతీ భాస్కరరావు బాలకళాకారిణిని అభినందిస్తూ 'మెమెంటో'ను బహూ



కరించారు. ప్రదర్శనా కార్యక్రమానికి ప్రయోక్తగా ఇన్నర్‌వీల్ క్లబ్ పాస్ట్ ప్రెసిడెంటు శ్రీమతి ప్రభా కృష్ణకుమార్ వ్యవహరించారు.

ఈ నాట్య ప్రదర్శనతో తన పన్నెండవ ఏటనే 50 ప్రదర్శనలను పూర్తిచేసి కుమారి ఊర్మిళ స్వర్ణోత్సవం జరుపుకోబోతున్నది. ప్రస్తుతం మద్రాసు చర్చ్ పార్క్ కాన్వెంటులో ఎనిమిదవ స్టాండర్డు చదువుతున్న కుమారి ఊర్మిళ 1976లో తొలి సారిగా మద్రాసు మ్యూజిక్ అకాడమీలో రంగ ప్రవేశం (అరంగేట్రం) చేసింది. ఆనాటి రంగ ప్రవేశానికి చీఫ్ జస్టిస్ రామప్రసాదరావు హాజరయ్యారు. చదువులో కూడా ప్రథమశ్రేణిలో వస్తున్న కుమారి ఊర్మిళకు వక్తృత్వ పోటీలు, యోగాభ్యాసాలలో కూడ మంచి ఆసక్తి ఉంది. ఈమె తండ్రి డా॥ బి. నరసింహులు (మద్రాసు), తల్లి జయలక్ష్మి.

—విలేకరి



"సికింద్రాబాద్ లాండ్ ఎయిర్ ట్రావెల్స్" ప్రధాన నిర్వహణాధికారిగా పనిచేస్తున్న శ్రీమతి కళాశంకర్-గోల్కొండ (హైదరాబాదు) లయనెస్ క్లబ్బు అధ్యక్షురాలిగా పదవీస్వీకారం చేసి మహిళా లోకానికి ఉపయోగపడే అనేక సేవా కార్యక్రమాలను చేపట్టి గణనీయమైన నిస్వార్థ సేవ చేస్తున్నారు. "రక్తదానం చేసి ఒక విలువైన జీవితాన్ని కాపాడండి!" అనే నినాదాన్ని ప్రచారం చేసి, అనేక రక్తదాన శిబిరాలు ఏర్పాటుచేసి తాను స్వయంగా అనేక సందర్భాలలో రక్తదానం చేసారు. ఇటీవల సికింద్రాబాదు రైల్వే హాస్పిటలులో అత్యవసరంగా రక్తం కావలసిన పరిస్థితి ఏర్పడినపుడు 350 సి. సి.ల తన రక్తాన్ని తిరిగి దానం చేశారు. జంట నగరాల రాణీగంజ్‌లోని ఇందిరాగాంధీ నగర్ మురికివాడ ప్రాంతంలో వయోజన విద్యాకేంద్రాన్ని ఏర్పాటుచేశారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సంక్షేమ శాఖామంత్రిణి శ్రీమతి రోడామిస్త్రీ సహకారంతో పూరిగుడిసెలలో నివసిస్తూన్న పేద ప్రజలకు భూమి పట్టాలను అందజేసారు. వికలాంగులూ, మానసిక రోగులూ అయిన పిల్లలకు ఆమె చేసిన నిస్వార్థ సేవలకు రాష్ట్ర ఆరోగ్యశాఖామంత్రి శ్రీ ఎ. మదన్ మోహన్ ఆమెకు ఇటీవల ప్రత్యేక బహుమతి ప్రదానంచేసి ఆమెను ఘనంగా సత్కరించారు.

—విలేకరి



కలకత్తా ఆంధ్ర మహిళామండలి తృతీయ వార్షికోత్సవాలు యిటీవల జరిగాయి. ఆనాటి కార్యక్రమాలకి ముఖ్య అతిథులుగా శ్రీమతి బుర్రా కామేశ్వరీదేవి, శ్రీమతి పి. ఇందిరావంతులు విచ్చేశారు. మండలి బాలికలచే నృత్య, నాటిక ప్రదర్శనలు జరిగాయి. మండలి కార్యకర్తలు ఏర్పాటు చేసిన ఆటల పోటీలలో గెలుపొందిన వనితలకు శ్రీమతి ఇందిరావంతులు బహుమతి ప్రదానం చేశారు. ఈ చిత్రంలో మండలి అధ్యక్షురాలు ఎస్. సరస్వతీదేవి, ఉపాధ్యక్షురాలు ఎ. విజయలక్ష్మి, కార్యదర్శి ఎ. కల్యాణి, సహ కార్యదర్శి ఎ. కమలా గోపాల్, కోశాధికారిణి జి. మాణిక్యాంబ వున్నారు.

## వనిత మాటల కొలువు - 41

సరైన సమాధానం :

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 చ | 15 లి | ■ | 16 మే | ■ | 2 ఆ | 17 వ | ల |
| ■ | 3 కి | 18 ను | క | ■ | 4 ప | గ | ■ |
| 5 ఆ | వా | లు | ■ | 6 కం | ద | ■ | 19 పం |
| మ | ■ | 7 గు | డు | బ | ■ | 8 మా | ట |
| 9 డ | 20 ఎం | ■ | ■ | డి | ■ | తం | ■ |
| ■ | 10 గి | 21 ల | క | ■ | 11 క | గి | 22 లు |
| 12 బా | లి | క | ■ | 13 మే | డు | ■ | గు |
| తు | ■ | 14 ప | గ | టి | వే | లు | వు |

పై సమాధానంతో సరిపోయే సమాధానాలు పంపినవారు పదిహేనుమంది. వారు :

1. జి. సరస్వతి, ప్రొద్దటూరు 2. పి. లలితారాణి, సిరిసిల్లా 3. పి. ఆదిలక్ష్మమ్మ, మార్కాపురం 4. కె. అచ్యుతవల్లి, నాగ్‌పూర్ 5. పి. నారాయణమ్మ, విశాఖపట్నం 6. బి. పేరిందేవి, కర్నూలు 7. ఆర్. రాగసుధ, ఆదోని 8. పి. కమల, సిర్‌పూర్ కాగజ్‌నగర్ 9. కె. జయలక్ష్మి, పెద్దకడబూరు 10. జి. సుమతి, మంథని 11. జి. సీతారామమ్మ, ఖరగ్‌పూర్ 12. వి. వాణి, వరంగల్ 13. కె. గిరిజ, మినగల్లు 14. ఎ. రమాదేవి, అర్ధవీడు 15. కమలా రామలింగం, కొత్తగూడెం.

బహుమతి మొత్తం రూ. 150లను వారికి అందజేస్తున్నాము.

ఇటీవల అనంతపూర్‌లోని అంబేద్కర్ నగర్ (హరిజనవాడ) ప్రాథమిక పాఠశాలలో అనంతపురం ఇన్నర్‌వీల్ క్లబ్‌వారు ఉచిత నేత్ర పరీక్షా శిబిరం నిర్వహించారు. డాక్టర్ గుంటుపల్లి రాధాకృష్ణమూర్తి కంటి పరీక్షలు చేస్తూ వుండగా ఇన్నర్‌వీల్ ప్రెసిడెంట్ శ్రీమతి జి. ఎస్. లక్ష్మిమూర్తి, శ్రీమతి ఎ. సత్యవతిరావు సన్నాహాలు చేశారు.





Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026

మిరమిట్లు గొల్పే తెలుపు
చూడగానే అందరి నోట ఒకే మాట...

ఇది తప్పక

# డెట్

డిటర్జెంట్ బిళ్ల వుతుకే




Shilpi DM 35A/78 Tel

REGD. No. TN/MS(S)/64 VANITHA (Telugu) February 1979

# క్రేక్‌జాక్-జనం అంతా మనసుపడేది

PARLE Krackjack

విడిగా
అమ్మబడవు—
అనుకరణలుంటాయి...
జాగ్రత్త!

కొందరిది తియ్యనిదని వాదిస్తారు
మరికొందరిది ఉప్పనిదని
పట్టుబడతారు. కాని మరువలేని
మజా రుచిగలదని అందరూ
ఒప్పుకుంటారు.

పార్లే

everest/78/PP/220-tl

క్రాక్‌జాక్ బిస్కట్లు—నోరూరించే ఆరుచికి మనస్ఫూర్తిగా లొంగిపోతారు మీరు.